# PREFACE.

In this book an attempt has been made to explain in simple language the administrative machinery of our country. A full account of the various departments has been given. Our object has been to present a general but complete account of the British administration of India and to arouse the reader's mind to a proper appreciation of the same.

One can easily see that it is only the settled condition of the Government which renders possible the numerous blessings of the modern times. Railways or canals, irrigation projects or reservoirs, bridges or tunnels, museums or parks, can never be possible in a country constantly suffering from internal strifes or external foes.

We believe that a plain unvarnished account of the British administration is enough not only to create a sense of responsibility of citizenship but also to evoke feelings of love and loyalty in the reader. Sowing the seeds of such feelings and helping the children to develop faculties which will make them happy, contented and useful citizens, are among the most sacred duties of the parent at home and the teacher at school, to whom, we hope, these pages will be of some help.

Madras,<br>January, 1914, } K. Sitaramaiya.

# CONTENTS.








శ్రీ విక్టోరియా మహారాణి గారు

1901 వరకును ఇండియా దేశపు చక్రవర్తిని గారు




శ్రీ జార్జి ది ఫిప్త్ సార్వభౌముడును వారి భార్యయు బిడ్డలును



KING GEORGE V, EMPEROR OF INDIA

శ్రీ జార్జి ది ఫిఫ్త్ చక్రవర్తి గారు

మన దేశమును ప్రస్తుతము పాలించెడి మహా చక్రవర్తిగారు



QUEEN MARY, EMPRESS OF INDIA

శ్రీ మేరీ మహా రాణిగారు

మన దేశపు చక్రవర్తియగు జార్జి ది ఫిఫ్త్ సార్వభౌముని భార్య

HIS MAJESTY

# KING GEORGE V

TO HIS

# INDIAN SUBJECTS



## TO THE PRINCES AND PEOPLES OF INDIA.—

The lamented, and unlooked for, death of my dearly loved father calls me to ascend the Throne that comes to me as the heir of a great and ancient line as King and Emperor. I greet the Princes, the Ruling Chiefs and all the other dwellers in my Indian dominions. I offer you my heartfelt thanks for the touching and abundant manifestation that this event has called forth from all the diverse races, classes and faiths in India, of loyalty to the Sovereign Crown and personal attachment to its wearers.

'Queen Victoria of revered memory addressed Her Indian subjects and the heads of Feudatory States when She assumed the direct Government in 1858, and Her August son, my father of

honoured and beloved name, commemorated the same most notable event in his Address to you fifty years later. These are the charters of the noble and benignant spirit of imperial rule, and by that spirit, in all my time to come, I will faithfully abide.

'By the wish of his late Majesty, and following His own example, I visted India five years ago accompanied by my Royal Consort. We became personally acquainted with great Kingdoms known to history, with monuments of a civilisation older than our own, with ancient customs and ways of life, with Native Rulers, with the peoples, the cities, towns and villages throughout those vast territories. Never can either the vivid impressions or the affectionate associations of that wonderful journey vanish or grow dim.

'Firmly I confide in your dutiful and active co-operation in the high and arduous tasks that lie before me, and I count upon your ready response to the earnest sympathy with the well-being of India that must ever be the inspiration of my rule.'

## శ్రీమన్మహారాజ చక్రవర్తిగారు తమపట్టాభిషేక మహోత్సవ సమయమున మన ఇండియాదేశమందలి రాజులకును ప్రజలకును పంపిన శుభవార్త.



సమస్తజనులకు విశేషముగు దుఃఖమును కలుగఁజేయునదియు ఆకస్మికమును అగు నాప్రియజనకుని మరణమువలన పురాతనమును అత్యుత్తమమును అగు రాజవంశాచారము చొప్పున ఏతద్వంశీయుఁడనగు నాకు రాజత్వమును చక్రవర్తిత్వమును కలిగినవి. అందువలన నాకు సింహాసనము నెక్కెడు భాగ్యమును కలిగినది. నా దొరతనమునందుఁజేరిన హిందూదేశమునందలి రాజాధిరాజులకును రాజులకును సామాన్యజనులకును అనేక అభివందనము లొనరించెద.

సకలజాతులవారును మతములవారును పంపిన మనఃపూర్వకమగు ఆదరింపులకును, దొరతనమువారియెడ వారికిఁగల రాజభక్తికిని, సింహాసనాసీనులయెడ వారికిఁగల అభిమానమునకును ఎంతయుఁ గృతజ్ఞతాబద్ధుఁడ నైతిని.

గతించిన విక్టోరియా మహారాణిగారు 1858-వ సంవత్సరమున రాజ్యభారమును వహించునపుడు హిందూదేశమునందలి తమప్రజలకును సామంతరాజులకును తమయభిప్రాయముఁ దెలుపువార్తను పంపిరి. ఆమె యనంతరము ఆమహాపీఠ మధివసించి

ఇప్పుడు చనిపోయిన మాతండ్రిగారును తమ తల్లిగారివలెనే ఆ మహాకార్యమును చేసిరి.

ఇవియే మహారాజ్యములను ఏలెడివారి గొప్పమనసును మంచిస్వభావమును దెలుపు శాసనములై ఉన్నవి. అట్టివారి సన్మార్గమును అవలంబించి నేనును నడచుకొనువాఁడను. గతించిన నాతండ్రిగారి యాజ్ఞను అనుసరించి వారివలె నేనును నాదేవితోడ హిందూదేశమును చూచుటకై ఐదుసంవత్సరములకు మునుపు వచ్చియుంటిని. అప్పుడు పురాణప్రసిద్ధములగు రాష్ట్రములును, పూర్వకాలమునుండియు మాకంటె ప్రాచీన నాగరికత గలిగి ప్రాచీనాచారపరులగు స్వదేశరాజులను అచ్చటిప్రజలను రాజధానులను పట్టణములను పల్లెలను అనేకములను మేము చూచితిమి.

ఆశ్చర్యాస్పదమగు మా యాత్రయందలి స్వచ్ఛాభిప్రాయములును ప్రియములగు స్నేహములును నాశమును గాని క్షీణతనుగాని యెన్నటికిని పొందనేరవు.

ఇఁక మేము జరుపఁబోవు రాచకార్యములు నెఱవేఱుటకు మీ రాజభక్తిని సాహాయ్యమును నిశ్చయముగా నమ్మియున్నారము.

మా మనోభీష్టమగు హిందూదేశ సౌఖ్యమునకు మీ తోడ్పాటు ఆవశ్యకమని నమ్మియున్నారము.

---



మన యువరాజుగారు శ్రీ జార్జి ది ఫిప్త్
సార్వభౌముని ప్రథమ పుత్రుడు

# సివిక్సు.



సివిక్సు అనుపదము, సివిస్ అనుమాటనుండి వచ్చి
నది. సివిస్ అనుపదమునకు నగరవాసి యని అర్థము. ఈపద
మునకు నగర మని అర్థమును గలదు. అనగా నగరవాసులును
గవర్నమెంటువారును పరస్పరము చేయవలసిన విధికృత్యము
లను, అట్టి విధికృత్యములను సరిగా చేయుటవలన ఇరువురకును
కలుగుసుఖములను సవిస్తరముగా తెలుపుశాస్త్రమునకు సివిక్సు
అని పేరుపెట్టియున్నారు. ఈశాస్త్రము ఈక్రింది ప్రశ్నలకు
నిస్సందేహమైన ఉత్తరములనిచ్చును. నే నెవరు? నాయొక్క
సహవాసు లెవరు? నన్ను పాలించువార లెవరు? నేను చెల్లిం
చుపన్ను ఏవిధముగా ఖర్చు అగుచున్నది? జనులను జనుల
యొక్కవస్తువులను కాపాడుటకు గవర్నమెంటువారు ఏయే యే
ర్పాటులను చేసియున్నారు? అంటువ్యాధులు, కరువు మొదలయి
నవి సంభవించిన కాలములయందు వారు ఎటువంటి ఉపకారము
లను జనులకు చేయుచున్నారు?

హిందువులు రాజవిశ్వాసమునకును రాజభక్తికిని ప్ర
సిద్ధికెక్కి యున్నారు. ఆవిశ్వాసమును వృద్ధిచేయుటకొఱకు
గవర్నమెంటువారికిని జనులకును గల సంబంధములును, వారువార

స్పరము చేసికోవలసిన విధికృత్యములను ప్రతిబాలుడును బాగు గా తెలిసికోవలసినది అత్యావశ్యకము గనుక యీశాస్త్రమును ఎలిమెంటరీపాఠశాలలయందు పిల్లలకు చెప్పవలెనని యేర్పాటు చేసియున్నారు.

## తపాల్, తంతి.

ఇంగ్లీషువారి పరిపాలనవలన హిందూదేశమునకు గలిగిన లాభములలో తపాల్, తంతి ఏర్పాటులు అత్యంత ఉపయోగ మైనవి. 1854 సంవత్సరమునకు పూర్వము ఆయాజిల్లాలయొక్క తపాలాఫీసు లన్నియు జిల్లా కలెక్టరు వారి అధీనములో ఉం డెను. రాజధాని యందలి ముఖ్యపట్టణములకును మఱికొన్ని యితర పట్టణములకును మాత్రమే మనుష్యులు అంచెలమీద తపాల్ జాబులు మొదలయినవానిని ఎత్తుకొని పోవుచుండిరి. ఈ తపాలలో నైన ఇతరుల సొంత జాబులను పంపుట కష్ట ముగా నుండెను. ఒకవేళ పంపిన యెడల మిక్కిలి సహాయము చేసినట్లు తలంపబడుచుండెను. ఇప్పటివలె ముద్రచీట్లు లేనం దున ఆయా జాబులకు కూలి రొక్క పూర్వకముగా తీసికొను చుండెడువారు. జాబులకూలి దూరమునకు తగినట్లు పలువిధ ములుగా నుండెను. 1854 సంవత్సరము తపాలా యేర్పాటుల విషయమై కొన్ని ముఖ్యములయిన మార్పులు కలిగెను. అవి ఏవనగా :—

(1) దూరమునుగుఱించిన భేద మేమియు లేక ఎంతదూర

మైనను సమాచార పత్రిక లన్నిటికి తపాల్ కూలి ఏర్పాటు ఒకవిధముగానే యుండునట్లు చేయబడెను.

(2) తపాల్ కూలి రొక్కముగా చెల్లింప తగదని అందులకు బదులుగా తపాలా బిళ్లలు (ముద్రచీట్లు) ఏర్పరుపబడెను.

(3) తపాలా కచ్చేరీలు అన్నియు అధ్యక్షుడైన ఒకయధికారియొక్క అనగా డైరెక్టర్ జనరల్ వారి విచారణకు లోబడి యుండునట్లు చేయబడెను.

పూర్వకాలమునందు ఒక యూరినుండి మఱియొక యూరికి సమాచారము పంపవలసినప్పుడు కొంతపైక మిచ్చునట్లుగ దూరమునుబట్టి కూలి యేర్పాటుచేసి ఒకమనిషిని పంపుచువచ్చిరి. ఈరీతిగా సమాచారము పంపుటవల్ల కాలనష్టము కలుగుటయేకాక అనేకవిధములయిన అసౌకర్యములు కూడ కలిగెను. పిదప కొంతకాలమునకు జనులు సమాచారపత్రికలను ఎద్దులమీద పంపినట్లు చెప్పబడియున్నది. ఈపద్ధతిలోను కాలనష్టము ఉన్నదని తెలిసికొని షర్షాఅనువారు సుమారు 1545 సంవత్సరములో గుఱ్ఱములమీద తపాలుపంపుపద్ధతిని ఏర్పాటుచేసిరి. హిందూదేశములో ఇనుపదారుల యొక్క ఉపయోగము 1853 సంవత్సరమువరకు తెలిసినదికాదు. 1853 సంవత్సరములోనే ఇనుపదారులు ఈదేశములో ఏర్పాటు చేయబడినవి. క్రమముగా ఇనుపదారులు దేశమందంతటను

నిర్మింపబడినందున వీనిగుండా ఇప్పుడు తపాలు పంపబడుచున్నవి.

చెన్నపట్టణమునుండి బొంబాయి పట్టణమునకు ఇంచుమించుగా రెండురోజులలోను, తూత్తుకుడికి 24 ఘంటల కాలములోను ఇప్పుడు జాబులు పంపబడుచున్నవి.

## 1. తపాల్ కూలి వివరము.

తపాలాఫీసు, ఇతర స్థలములనుండి సమాచారములను జాబుల మూలముగా తెలిసికొనుటకు హేతువుగా నున్నది. వ్రాయబడిన కార్డులకు కానిబిళ్లయు, ఒకరూపాయ ఎత్తుగల మూతజాబుల (కవరు) కు అర్ధణాబిళ్లయు దిగువ కనబఱచినట్లు కరిపించవలెను. ఈ మూతజాబులకు (కవర) పదితులములవరకు ఒక అణా బిళ్లను, పది తులములకు మించినప్పుడు ప్రతి పదిరూపాయల ఎత్తుకును, దాని శేషమునకును ప్రత్యేకముగా ఒక అణా బిళ్లయు అతికించవలెను.

| | |
|---|---|
| మ-రా-రా|శ్రీ, పోతుల-గురవయ్య గారికి. | బిళ్ల |
| | నరసాపురము, |
| | కృష్ణాజిల్లా. |

వార్తాపత్రికలు, పుస్తకములు, ఇతరవిషయములు ముద్రింపబడిన కాగితములు, నకళ్లు ఇటువంటి వానికి పైన చెప్పబడిన

రేట్లు కాక అనుకూలమైన కొన్ని ఏర్పాటులు చేసియున్నారు. అవి ఎవ్వియన :—

| పుస్తకములు, మాదిరి వస్తువులు ఈప్యాకెట్లు. | బంగీలు.—ధరలు ముందు చెల్లింపక తప్పదు. | | |
|---|---|---|---|
| | 400 తులములకు మించని. | 400 తులములకు మించిన (రిజిష్టరు చేయుట ఆవశ్యకము.) | |
| ప్రతి 10 తులములకు లేక దానిలో భాగమునకు. | ప్రతి 40 తులములకు లేక దానిలో భాగమునకు. | 400 తులములకు మీఁది 480 తులములకు మీఱని. | ప్రతియొక్క పై40 తులములకు లేక దానిలో భాగమునకు 200 తులములవరకు. |
| అణా. ½ | అణాలు. 2 | రూపాయలు. 3 | అణాలు. 4 |

తపాలకూలి ముందుగా ఇవ్వనపుడును లేక పూర్తిగా ముందు ఇవ్వనపుడును బటువాడాఅగునపుడు చార్జి చేయబడును ఎట్లన :—

బొత్తుగా తపాల్ కూలి యివ్వబడని జాబులకు, ప్యాకెట్టుకు. ... ... ... } ముందుగా చెల్లించవలసినకూలికి రెండింతలు.

కొంతకూలి తక్కువగా చెల్లించబడిన జాబుకు, లేక ప్యాకెట్టుకు. ... ... } ఎంత తక్కువ పడునో దానికి రెండింతలు.

## 2. సేకరించుట, పంపుట, ఇచ్చుట.

కార్డు, మూత జాబులు (కవర్లు) మొదలయిన వానిని సేకరించుటకు ముఖ్యమైన వీధులలోను, చిన్న గ్రామమయిన యెడల గ్రామ మునసబు ఆఫీసులలోను, తపాలాఫీసులలోను, రయిల్వే స్టేషనులలోను తపాలుపెట్టెలు స్థాపింపబడి యున్నవి నిర్ణయింపబడిన కాలములయందు ఈ పెట్టెలలో నుండు కాగితములను ప్రోగుచేసి తపాలాఫీసుకు తీసికొని పోయి ఆ ఆఫీసు పేరును, ఆరోజు తేదియు కనబడుచు మొహరుతో మొహరువేసి, అతికింపబడియుండు తపాలా బిళ్లలను రద్దుచేసి ఈ కాగితములను, ఆ ఆఫీసునుండి ఇతరస్థలములకు పంపవలసిన బంగి, మనీఆర్డరు, మొదలైన వానికి కూడ తగునట్లుగా మొహర్లువేసి ఆఫీసు లెక్క పుస్తకములలో దాఖలుచేసి వీనినన్నిటిని సంచులలో వేసి బంగిచేసి మనిషిద్వారాగాని లేక రైలుమార్గముగాగాని పంపివేయుదురు. పైనచెప్పబడినకార్డులు, మూతజాబులు (కవర్లు) మొదలయినవి ఏయేఊళ్లకు పంపబడినవో ఆ యాఊళ్లయందుండు తపాలాఫీసులలో అవివచ్చిచేరిన తేది మొహరువేసి తపాలాబంట్రోతు మూలముగా చిరునామాదారున కివ్వబడును. చిరునామాదారుడు ఊర లేని పక్షమున వాడు ఎక్కడ ఉండునది, సరియైన విలాసము బాగుగా విచారించి జాబులమీద వ్రాసి తపాలుపెట్టెలో వేసినయెడల వానికి భద్రముగాచేరును. దీనికి ప్రత్యేకమైన ఖర్చుఏమియు నాచిరు లేదు.

మాదారుడు ఎక్కడను కనబడక పోయెనేని ఇటువంటి బేవారుసు జాబులు " డెడ్ లెటరు " ఆఫీసుకు పంపబడును. ఆఆఫీసులో నుండు అధికారులు ఈజాబులను వ్రాసినవారికి పంపివేయుదురు. దీనికికూడ ప్రత్యేకమైనఖర్చుఏమియులేదు. ఈకారణమునుబట్టియే జాబులు వ్రాయువారు అందఱును జాబుయొక్క కుడివైపు భాగమున వారియొక్క ఊరు, పేరు, తేది వీనిని విశదముగా వ్రాయవలెను. కాలణాకార్డులలో విలాసము కొరకు ఏర్పడియుండు ప్రక్కను చిరునామాదారుని విలాసము మాత్రము వ్రాయవలయునేగాని వేరే ఏవిషయమును వ్రాయగూడదు. స్వంతముగా తయారుచేయబడినకార్డులు 5½ అం. పొడవు, 3½ అం. వెడల్పుకంటె పెద్దవిగానుండకూడదు. ఈకార్డులలో విలాసము వ్రాయుప్రక్క సగమునకు తక్కువగాకుండ విలాసముకొరకు విడిచిపెట్టి మిగతసగమునందు సమాచారములు వ్రాయవచ్చును.

### 3. మనీఆర్డరు.

ఇది (1) సాధారణ మనీఆర్డరు (2) తంతి మనీఆర్డరు, (3) రివిన్యూ మనీఆర్డరు అని మూడువిధములు.

(1) సాధారణమనీఆర్డరు:—దీనిమూలముగా ౧-కలణా మొదలు (600) ఆరువందల రూపాయలవరకు పంపవచ్చును సాధారణముగా అణాకు తక్కువ మొత్తమును మనీఆర్డరు మూలముగా పంపుటకు వీలులేదు. అయితే గవర్నమెంటువారి

కిన్ని, గవర్నమెంటుకు సమానమైన మునిసిపాలిటీ, లోకల్ బోర్డు వార్లకును చేరవలసిన మొత్తమైనను, వారిచే లోకులకు చేర వలసిన మొత్తమైనను అణాకు తక్కువగా నున్నప్పటికిని సాధారణ మనీయార్డరు మూలముగా పంపవచ్చును.

మనీఆర్డరు కమిషన్—వివరము.

రూ. 5 లకు ఒకఅణా, 10 రూ, లకు 2 అణాలు, రూ, 15 లవరకు రు. 0-3-0లు. 15 రూపాయలకుపైన 25 రూ.ల వరకు రు. 0-4-0లు. 25 రూపాయలుకుమించిన పెద్ద మొత్తములకు ప్రతి ఇరువైయైదు రూపాయలకును రు. 0-4-0 చొప్పున కమీషన్ తీసికోబడును. మనీఆర్డరు నమూనాలు తపాలాఫీసునుండి డబ్బులేకయే తెచ్చుకోవచ్చును. ఆ నమూనాను భర్తీచేసి దానిని పైకముతో సహా తపాలాఫీసులో ఇచ్చిన యెడల వారు నమూనాలో వ్రాసియుండు మొత్తములకు రశీదు ఇత్తురు. ఆనమూనా చిరునామాదారునికి పంపబడును ఆ నమూనాలో చిరునామాదారుని యొక్క చేవ్రాలుకొరకు ఏర్పడియుండు స్థలములలో చిరునామాదారునిచే చేవ్రాలు చేయించి, నమూనాలో వ్రాసియుండు మొత్తమునుతపాలాబంట్రోతు చిరునామాదారులకిచ్చి వేయును. చిరునామాదారుని చేవ్రాలుతోనుండు నమూనాయొక్క ఒకభాగము, మొత్తము సరిగా వానికి ముట్టినదని పంపినవారికి దెలుపుటకై, రశీదుగా పంపబడును.

(2) తంతి మనీఆర్డరు :—తంతిమనీఆర్డరు మూలముగా పైకముపంపుటకు ఇష్టపడినఎడల, సాధారణ మనీఆర్డరుకమీషన్‌తో కూడా, తంతిరుసుమును కలిపి ఇవ్వవలెను. తంతిమనీ ఆర్డర్లు రెండువిధములు. (1) (యక్స్‌ప్రెస్) శీఘ్రముగాపోయి చేరుటకు ఏర్పర్డమనీఆర్డరు, దీనికి సాధారణమనీఆర్డరుకమీషన్‌తో కూడ ఒకరూపాయ తంతిరుసుము ఎక్కువగా ఇవ్వవలెను. (2) (ఆర్డినరీ) సాధారణతంతి మనీఆర్డరు. దీనికి సాధారణ మనీ ఆర్డరు కమీషన్‌తో కూడ తంతిరుసుము ఎనిమిది అణాలు ఇవ్వవలెను. ఈతంతి మనీఆర్డరు మూలముగా ఒకరూపాయ మొదలు ఆరువందల రూపాయలవఱకు పంపవచ్చును. కొన్ని వేళలయందు తపాలాఫీసులేని గ్రామములకు తంతి మనీఆర్డరు పంపవలసి వచ్చును. ఆగ్రామమునకు తపాలా బంట్రోతు పోవలసియున్నను, వాడు పోవుకాలమునకు సరిగా తంతి మనీఆర్డర్లను పంపుట కష్టము గనుక అటువంటి గ్రామములకు తంతి మనీఆర్డరు పంపువారు మనీఆర్డరు ఏ ఆఫీసులోనుండి బట్వాడాకావలయునో ఆ ఆఫీసులోనుండి గ్రామమునకు ఒకమనిషి త్వరితముగా పోవుటకు ఎంతకూలిఇవ్వవలెనో, ఆమొత్తమును ముందుగనే చెల్లించి, ఈవిషయమునుమనీఆర్డరు నమూనాలో ఉదాహరింపవలెను. తంతిమనీయార్డరు నమూనాలో (Express) ఎక్స్‌ప్రస్ లేక ఆర్డినరీ అను విషయమును తెలుపవలెను. చిరునామాదారుడు తపాలఫీసువారికి తెలియపఱచి

వేరేస్థలమునకు పోయినయెడల ఎక్కువఖర్చులేకయే ఈతంతి మనీఆర్డరు వానికి పంపబడును.

(3) <u>రివిన్యూమనీఆర్డరు</u> :— ఒకపట్టాదారుడు వేరే స్థలములోనుండి తనపట్టాభూములుండు గ్రామమునసబుద్వారా తహశ్శీల్ దారునివారికి పట్టాదారు చెల్లించవలసిన శిస్తుపైక ము గడువుదాటకుండా పంపకోరునపుడు మనీఆర్డరు మూల ముగా పంపవచ్చును. ఈరకము మనీఆర్డర్లకు రివిన్యూ మనీఆ ర్డర్లని పేరు. భూమిశిస్తు, రోడ్డుశెస్సు, మొదలయిన సర్కారు శిస్తులను చెల్లించుటకు మాత్రము ఈమనీఆర్డరును ఉపయోగిం పవచ్చును. ఈపద్ధతి చెన్నపురి రాజధానిలో మాత్రమే అను సరింపబడుచున్నది. సర్కారువారికి తప్ప, స్వదేశరాజులకుగాని జమీన్ దార్లకు గాని రైతులు చెల్లించవలసిన పైకములను ఈమనీఆర్డరుద్వారా పంపుకోకూడదు. ఈమనీఆర్డరు నమూనా మూడుభాగములుగా భాగింపబడి యున్నది. మొదటి భాగ మునకు ''ఏ'' అనిపేరు. దీనిలో పంపబడు మొత్తముయొక్క వివరమును, పంపువారియొక్కయు చిరునామాదారునియొక్క యు షిలాస వివరములు వ్రాయవలెను. రెండవ భాగము ''బి''. దీనిలో పట్టాదారునిపేరు,సర్వేనంబరు, గ్రామముయొక్క పేరు, ఫసలీ, కిస్తివివరము ఇవన్నియు ఉండవలెను. మూడవ భాగము ''సి''. దీనిలో రెండవభాగములో కనబఱచిన విషయ ములే ఉండును. ఈభాగమే పైకము చెల్లించువారికి రశీదు

గాపంపబడును. "బి" భాగమును గ్రామమునసబు తనవద్దనుం చుకోవలెను "ఏ" భాగమును గ్రామమునిసిఫ్, కరణమువీరిద్ద రును చేవ్రాలు చేయుటకు ఏర్పడియుండు స్థలములలో చేవ్రా లుచేసి గ్రామలెక్కలలో జమవ్రాసి తహశ్శీల్దారుని వారికి పంపివేయవలెను. తహశ్శీల్దారుగారు గ్రామమునిసీబు పం పిన మనీఆర్డరు నమూనాయొక్క భాగములో ఏర్పడియుండు స్థలములో తాముగూడ చేవ్రాలుచేసి ఆగ్రామములోనుండు తపాలాఫీసుకు పంపినతోడనే తపాలాఫీసువారు తహశ్శీల్ దారునివారికి పై మొత్తమునకు ఒక రశీదు ఇత్తురు. ఈ రశీ దును ఆధారముగా పెట్టుకొని తమ ఆఫీసు లెక్కలలో జమక్రింద పట్టాదారుని వద్దనుండిపైకము పుచ్చుకొన్నట్టును, ఖర్చుక్రిం ద మొత్తమును తపాలాఫీసుకు ఇచ్చినట్టును లెక్క వ్రాయబ డును. ఈరీతిగా లెక్కపుస్తకములలో, పైకమును నిజముగానే ఇచ్చి తీసికోకుండ లెక్కవ్రాయు పద్ధతికి, "బుక్ ట్రాన్సుపర్ అక్కౌంటు" (Book Transfer Account) అని పేరు. ఈ రివిన్యూ మనీఆర్డర్లకు కూడ సాధారణ మనీఆర్డర్లకు వలెనే కమీషను ఇవ్వవలెను. అయితే ఈమనీఆర్డర్ల ద్వారా పంపబడు మొత్తము సర్కారువారికి చేరును గనుక అణాకు తక్కువైన మొత్తములు కూడ పంపవచ్చును.

## 4. రిజిస్టరు చేయుట.

కార్డులు, మూతజాబులు, పుస్తకములు, బంగీలు ఇవి

చిరునామాదారునికి భద్రముగా పోయి చేరుటకు వీనిని రిజ
స్టరు చేయవచ్చును. రిజస్టరు రుసుము. 2 అణాలు. ఈ
క్రింద చెప్పబడు ప్రకారము సామానులకు ఇన్‌ష్యూరు చేసిన
నేగాని పోస్టాఫీసువారు నష్టములకు బాధ్యపడరు, రిజస్టరు చే
యవలసిన సామాను తపాలాఫీసులో ఇచ్చినవెంటనే తపాలా
ఫీసువారు దానిని తీసికొన్నందుకు గురుతుగా రశీదు ఇత్తురు.
ఆ రశీదులో ఈసామాను రిజస్టరునంబరును, రిజస్టరు అయిన
తేదియును, చిరునామాదారుని పేరును, వ్రాయబడియుండును.
సామాను భద్రముగా చిరునామాదారునికి చేరినందుకు వాని
చేవ్రాలుతో ఒక రశీదు కోరినయెడల ఒక అణా ఎక్కువగా ఇ
వ్వవలెను. ఈ అణాకును బిళ్లలుకొని అతికించవలెను. ఈ
క్రింద చెప్పబడియుండు సామానులను రిజస్టరుచేసియే పంపవ
లెను. (1) కరెన్‌ఫీనోట్లు, (2) తపాలాపీసుబిళ్లలు, (3) చెక్కు
లు, (4) ఉండీలు. తపాలరుసుము, రిజస్టరు రుసుము ఈ రెంటి
విలువకు తగిన బిళ్లలు సామానుమీాద అతికించవలెను.

## 5. ఇన్‌ష్యూరెన్సు.

రిజస్టరు చేయుబడిన జాబులను, బంగీలను, ఇన్‌ష్యూరు
చేయవచ్చును. బ్రాంచి తపాలాఫీసులో 500 రూ. వరకును
ఇతర తపాలాఫీసులో రూ, 200ల వరకును విలువగల సామా
నులను ఇన్‌ష్యూరు చేయవచ్చును. ఇన్‌ష్యూరెన్సు రుసుము
ను కూడ బిళ్లలుగా అతికించవలెను. రు. 90 లకు ఎక్కువగాని

సామానులకు ఇన్‌ష్యూరెన్సు రుసుము రు. 0-1-0. దానికిపై బడినయెడల ప్రతి రు. 50 లకును దానిభాగమునకును రు.0-1-0 ఒకఅణా. ఇన్‌ష్యూరు చేయవలసిన సామానును గట్టిగానుండు సంచిలో వేసి సీలు వేయవలెను. సంచిలోనుండు సామాను సంచిని కఱచుకొని యుండునట్లుగా కుట్టి ముడివేయవలెను. ఇన్‌ష్యూరు చేయబడు సామానుయొక్క విలువను సంచిమీద అక్షరములతో వ్రాయవలెను. పంపువాని విలాసమున్ను ఎడమవైపు మూలలో విశదముగా వ్రాయవలెను. తపాలాఫీసువారు సామాను తీసికొన్నందుకు గుర్తుగా ఒక రశీదు ఇత్తురు. రూ. 250 లకు తక్కువ విలువగల ఇన్‌ష్యూరు చేయబడిన సామానులను చిరునామాదారునికి తపాలాబంట్రోతు స్వయముగా ఇంటివద్దకు తీసికొని వచ్చి ఇచ్చివేయును. దీనికి పైబడిన సామానులను చిరునామాదారుడు తపాలాఫీసునకు వెళ్లి చేవ్రాలు చేసి తెచ్చుకొనవలెను. చిరునామాదారుని చేవ్రాలుగల రశీదు, సామాను పంపువారికి ఎక్కువ ఖర్చులేకుండ పంపించబడును.

ఇన్‌ష్యూరు చేయబడిన సామాను తపాలాపీసులోగాని దారిలోగాని నష్టమైనయెడల తపాలాఫీసువారు బాధ్యపడుదురు. ఇన్‌ష్యూర్డు చేయబడిన సామానుయొక్క వెల ఇంతయని పంపినవాడు ఋజువుచేసినఎడల ఆ మొత్తము తపాలాపీసువారిచే ఇవ్వబడును. కెంపులు, నగలు, నాణెములు,బంగారుకడ్డీలు ఇటు

వంటి విలువగలసామానులను కరెన్సీనోట్లను రిజిస్టరుచేసి ఇన్‌షూర్యారుచేసియే పంపవలెను.

6. (Certificate of Posting) తపాలు పెట్టెలో వేసినందుకు సర్టిఫికేట్టు:—తపాలుద్వారా పంపబడు ప్రతిసామాను భద్రముగాపోయి చేరుటకొరకు రిజిస్టరుచేయవలసినయావశ్యకము లేదు. తపాలాఫీసుకు సామాను పంపువారు ఒక చిన్నకాగితములో చిరునామాదారునివిలాసమును, సామానులయొక్క సంఖ్యయును వ్రాసికానిబిళ్ల అంటించి తపాలాఫీసుకు పంపినయెడల ఆఫీసువారు కాగితములో నాటి తేదిగల తపాలాఫీసు ముద్రను వేసి ఇత్తురు. ఈ కాగితము ఆరోజున తపాలాఫీసులో సామానుఇవ్వబడినదని అనుటకు ఒకబుజువగును. కార్డు,మూతజాబులు, వార్తాపత్రికలు అయినపక్షమున ఒక సర్టిఫికేట్టులో మూడువంతున వ్రాయవచ్చును. రిజిస్టరు చేయబడినవియు, లేక చేయబడని బంగీలు, బుక్కుప్యాకెట్లు ఇవి ఆరుసామానులు ఒక్కసర్టిఫికేట్టులో జూపవచ్చును. ఈసర్టిఫికేట్టులో 'సామానులను తపాలాఫీసులో పోస్టుచేసినందుకు సర్టిఫికేట్టు' అని వ్రాసియుండవలెను.

7. వి. పి. తపాల్.

ఒక గ్రామమునుండి ఒక వస్తువును, దానియొక్క వెలను ముందుగానే ఇవ్వకుండ తెప్పించుకోవలెనని కోరినపక్షమున, ఆవస్తువును తపాలాపీసు మూలకముగా తెప్పించుకోవ

చ్చును. ఈరీతిగా తెప్పించుకొనువారు ఆయూరిలోనుండు వర్తకునికి వస్తువుయొక్క వివరమును, కావలసిన వస్తువుల సంఖ్యయును, జాబుమూలముగా తెలియపఱచి, తపాలాపీసు మూలకముగా సామాను ఖరీదును ఇచ్చునట్లు వ్రాయవలెను. ఆవర్తకుడు ఈజాబును ఆధారముగా పెట్టుకొని కోరిన సామానులను భద్రముగా కట్టి వి. పి. ల కొరకు ఏర్పడియుండు నమూనాలో తన విలాసమును, చిరునామాదారుని విలాసమును వ్రాసి ఆవస్తువుయొక్క తపాలరుసుమును బిళ్లల రూపకముగా అతికించి, నమూనాలో తపాలరుసుము మొత్తమును, వస్తువుయొక్క ఖరీదును, ఆపైకము తనకు ముట్టుటకుగాను మనీఆర్డరు కమిషన్, ఈ మూటియొక్క మొత్తమును నమూనాలో కనపఱచి ఈ నమూనాను సామానుతో సహా తపాలాఫీసులో ఇవ్వవలెను.తపాలాఫీసువారు దీనికి ఏవిధమైన రశీదుఇవ్వరు. చిరునామాదారుడు సామాను తనకు చేరినతోడనే నమూనాలో కనబఱచియుండు మొత్తమును తపాల్ బంట్రోతునకిచ్చి ప్యాకెట్టును తీసికోవలెను. ఆమొత్తమును తపాలాఫీసువారు తీసికొని ఆ సొమ్మును వర్తకునికి పంపివేయుదురు.

వర్తకుడు సామానును రిజష్టరు చేయక పంపునపుడు తనకు ముట్టవలసిన మొత్తముయొక్క మనీఆర్డరు రుసుమును, తపాల్ రుసుమును, బిళ్లలుగా సామానుమీద అతికించవలెను. అట్లులేక సామాను రిజష్టరుచేసి పంపునపుడు తపాల్,

రిజస్టరు రుసుముల మొత్తములకు బిళ్లలు అంటించవలెను. తపాలాఫీసువారు సామానును తీసికొన్నతోడనే పంపువారికి ఒక రశీదు ఇచ్చి, చిరునామాదారుని వద్దనుండి నమూనాలో వ్రాయబడియుండు ప్రకారము కమీషన్ సహా మొత్తమును తీసికొని తపాలాఫీసువారు కమీషన్ పోగా మిగిలియుండు పైకమును సామాను పంపినవానికి మనీఆర్డరు చేయుదురు. ఈవిధముగా పంపబడు సామానులు రూ. 1000 లకు మించకుండా ఉండవలయును.

8. సేవింగ్సు బ్యాంకి. (Savings Bank)

ఒకడు తనవద్దనుండు పయికమును భద్రపఱచుకొనుటకు వీలు లేనప్పుడు "స్వల్పజీవనములో జీవించువారు వారివద్ద మిగిలియుండు పైకములను కూడపెట్టుకొనుటకుగాను ఏర్పడియుండు" సేవింగ్సుబ్యాంకులో భద్రపఱచుకొనవచ్చును. తపాలాఫీసులో 12 గంటలుమొదలు 4 గంటలవరకు సేవింగ్సు బ్యాంకి విషయములను విచారించుచుందురు. ఆదివారమునాడును, సర్కారువారివల్ల ఏర్పఱచబడ్డ సెలవుదినములలోను ఈ బ్యాంకి సంబంధమైనపని జరుగదు. ఈరీతిగా పైకమును తపాలాఫీసులో ఉంచుటకు ఇష్టపడువారు తమపేరిటగాని లేక ఒక మైనరుతరఫుగార్డియన్ పేరిటగాని వేయవచ్చును, మైనర్లును, స్త్రీలును వారి పేరిట నేరుగాబ్యాంకిలో పైకమును ఉంచవచ్చును.

ంగ్సుబ్యాంకి లెక్కలు రెండు తరగతులు:—

వారమురోజుల కొకసారి కావలసినపైకమును తీసికొను ం వీలుగానుండు తరగతి, (2) ఆరుమాసములు నోటీసుతో గలాఫీసువారికి తెలియపఱచి పైకమును తీసికొనుటకు వీలు నుండుతరగతి. రు. 0-4.0 లకు తక్కువ మొత్తముగాని,ఒక రాలో భాగములుగాని బ్యాంకిలో తీసికోబడవు. ఒకసంవత్సర లో అనగా ఏప్రిల్ మొదటితేదిమొదలు మార్చి 31-వ వరకు ఒకనిపేరిట రు. 1200 లకు హెచ్చినమొత్తమును ్యాంకులో ఉంచుటకు వీలులేదు, ఈమొత్తములో రు.200లు ధారణడిపాజిట్‌గాను, రు.1000లు గవర్నమెంటు ప్రామిసరీ ట్లుగాను ఉండవచ్చును.

బ్యాంకి లెక్కలో ఒకనిపేరిట ఒక సమయమున 2000లకు ఎక్కువగా నుండకూడదు. ఎక్కువగాఉండినయె హెచ్చుమొత్తమునకు వడ్డిలేదు. మైనరుకొరకు రు. 1000 ం ఎక్కువగా సేవింగ్సు బ్యాంకిలో వేయకూడదు. సర్కారు రికి అప్పుగా ఇచ్చినయెడల ఒక్కడు తనపేరిట రు 5000వర బ్యాంకిలో పెట్టవచ్చును. అప్పుడప్పుడు తీసికొన్నే షరత్తు ద ఉంచబడియుండు మొత్తములకు రు.100కి సంవత్సరము ం రు. 3-0-0 వంతునను, ఆరుమాసముల కొకపర్యాయము టీసిచ్చి తీసికొనే మొత్తములకు నూటికి సంవత్సరమునకు 3-4-0 వంతునను వడ్డి ఇవ్వబడును. ఆరుమాసముల షర

త్తుక్రింద పైకమును ఉంచియుండువారు వారికి పైకము కావలసిన కాలమునకు ఆరుమాసములకు ముందుగానే వారిలెక్క లో నుండి ఇంతపైకము కావలయు నని దరఖాస్తు చేసికొనవలెను. నోటీసుప్రకారము కాలము వచ్చినప్పుడు పైకము అక్కరలేక పోయినయెడల కోరిన మొత్తమును మరల అట్లే ఉంచునట్లు చెప్పవచ్చును.

ఈ బ్యాంకి సంబంధమైన లెక్కలు వ్రాయుటకు ప్రతి వారికిని ఇవ్వబడియుండు ప్యాసుపుస్తకమును (Pass Book) భద్రముగా పెట్టుకొనవలయును. ఈపుస్తకము పోయినయెడల మఱియొక పుస్తకమును గొనుటకు రు. 1-0-0 ఇవ్వవలెను. ఒకమాసములో 4 తేదులు అయినతరువాత వేయబడిన మొత్తమునకు ఆ మాసమునకు వడ్డిలేదు. మరియు ఒకమాసములో కొద్దికొద్దిగా తీసికోబడిన మొత్తము పోగా ఆ మాసాంతములో మిగిలియుండు మొత్తమునకే ఆమాసమునకు వడ్డి లెక్కపెట్టుదురు.

ఒకరూపాయకు తక్కువపడిన సొమ్మునకు వడ్డి ఇవ్వబడదు. ఒక తపాలాఫీసునుండి మఱియొక తపాలాఫీసుకు బ్యాంకి లెక్కను మార్చుకొనవచ్చును. ఇష్టము వచ్చినప్పుడు బ్యాంకి వ్యవహారములను చాలించుకొనవచ్చును. బ్యాంకిలో పైకము వేసిన కాలము మొదలు పదిరూపాయలకు ఎక్కువగాని మొత్తములకు మూడు సంవత్సరముల వరకును, రు 100లకు ఎక్కువ

గాని మొత్తములకు ఆరుసంవత్సరములవరకును, రు. 100లకు ఎక్కువైన మొత్తములకు 12 సంవత్సరముల వరకును నూతనముగా పైకము తీసికొన్నట్టుగాని వేసికొన్నట్టుగాని లెక్క ఏర్పడని ఎడల ఆమొత్తములను మరల తీసికొనుటకు కంట్రోలరు యొక్క ఉత్తర్వులేనిది వీలుకాదు. కనుక పై చెప్పబడిన కాల పరిమితి ఏర్పడినపుడు కంట్రోలరుకు అర్జీ పెట్టుకోవలెను. వారు విచారణచేసి న్యాయమని తోచినయెడల వడ్డీతో సహా పైకమును ఇచ్చుటకు ఉత్తర్వు చేయుదురు.

ఈ సేవింగ్సు బ్యాంకి విషయములో మనము గమనింపవలసిన విషయము ఒకటిగలదు. అదేమనగా: పైకముఇచ్చునపుడును, తీసికొనునపుడును చేవ్రాలు ఒకటేరీతిగా నుండవలెను. జూన్ నెల 15 వ తేదికి తరువాత ప్యాసు పుస్తకము (Pass Book) ను తపాలాఫీసులో ఇచ్చిన యెడల వడ్డీ లెక్కచేసి అసలుతో వడ్డీని కలిపి ఆమొత్తమును వ్రాసి తిరిగి ఇచ్చివేయుదురు.

తపాలాఫీసులో అమ్మబడు తపాల్ బిళ్లలు:—కాలణా, అర్ధణా, ఒకణా, రెండుఅణాలు, రెండున్నరణా, మూడు అణాలు, నాల్గుఅణాలు, ఆరుఅణాలు, ఎనిమిదిఅణాలు, పండ్రెండుఅణాలు, ఒకరూపాయ, రెండురూపాయలు, మూడురూపాయలు, అయిదురూపాయలు, పదిరూపాయలు, పదిహేనురూపాయలువరకు విలువగలవి అమ్మబడును.

తపాలాఫీసులో నుండు లోపములను పై అధికారులకు తెలియపఱచవలసిన యెడల ఆలోపములను ఒక అర్జీ మూల కముగా ఇన్‌స్పెక్టరు మొదలగు పై అధికారులకు తెలియ పఱచవచ్చును. ఈ అర్జీ తత్క్షణమే విచారణ చేయబడి లోప ములు సరిచేయబడును. ఈఅర్జీపంపుటకును ఏవిధమైన తపాలు రుసుమును ఇవ్వవలసిన అవసరములేదు.అయితే ఈఅర్జీయొక్క మూతకాగితము (Cover) మీాద "తపాలాఫీసులో నుండు లోపములను గురించిన అర్జీ" అని విశదముగా వ్రాయవలెను.

8. తంతి విషయము. (Telegraph)

తపాలుమూలముగా సమాచారమునుపంపునపుడుదూ రమునుబట్టి కాలయాపనమగును. తంతి మూలకముగా పంప బడెనేని మిక్కిలి త్వరలోచేరును. తంతి అనునది పొడుగైనతు త్తునాగమను లోహముతో చేయబడిన తీగ. ఈతీగయొక్క ఒకకొన ఒకఆఫీసులోను మఱియొకకొన మఱియొక ఆఫీసులోను స్థాపింపబడియుండును. ప్రతిస్టేషన్‌లోను ఈతీగయొక్కకొన రాగితీగచే ఆఫీసులోనుండు ఒక యంత్రముతో కలుపబడియు న్నది. ఈరాగితీగ యంత్రములోనుండి వ్యాపించుశక్తి దానిని విడిచి పోకుండ నుండుటకు ఇండియారబ్బరుచే బాగుగా కప్పబడియున్నది. ఈతుత్తునాగపు తీగలు తంతి స్తంభములయొ క్క పై చివరలద్వారా ఒకస్టేషన్‌లో నుండి మఱియొకస్టేషన్ లోనికి పోవుటను మీారు చూచి యుండవచ్చును. ప్రతియొక

గొప్ప తంతిఆఫీసులోను ఈతీగయొక్క ఒకకొన ద్రావకము తోనిండిన ఒకపాత్రతోను,భూమితోను సంబంధపడుయుండును. ఈతీగ ద్రావకము సహాయముచేత సమీపమందు ఒకపెట్టెలో నుండు ఒక కాంతపుసూదిని ఇటునటు చలింపజేయును. ఈకాంతపుసూది ఏర్పాటు విశేషముగా రైల్వేస్టేషనులలోనే కనబడును. తపాలాఫీసువారు ఈకాంతపు సూదియొక్క సహాయము లేకయే సమాచారములు పంపుచున్నారు. యంత్రమువద్ద పని చేయునపుడు "కట్టు "కడ " అని వినిపించుశబ్దము ఈకాంతపుసూదిని చలింపజేయుటకుగాని, లేక ఆశబ్దమును రాగితీగలో ప్రవేశింపజేయుటకుగాని ఏర్పడుచున్నది. తిన్నగా కొట్టుటవలనను, అదిమికొట్టుటవల్లను అక్షరములవ్యత్యాసములు కనబఱిచెదరు. ఇంగ్లీషు భాషలోని 26 అక్షరములకును అంకెలకును గురుతులు ఏర్పాటుచేసి వీనిసహాయముచేతతీగలమూలకముగాసమాచారములనుపంపుచున్నారు. తంతిమూలకముగా సమాచారము వచ్చుటకు ఆలస్యము ఎంతమాత్రము కాదు. ఒకకొనలో 'కట్టు' అనిశబ్దము కలిగినవెంటనే మరియొక స్టేషన్ లోనుండు రెండవకొనలో ఈశబ్దము వినిపించును. భూమిమీద తంతి స్తంభముల ద్వారా తీగలు దేశమందంతట వ్యాపించునట్లే సముద్రములోకూడ ఈతీగలు ఏర్పాటుచేసి అనేకదేశములకు సమాచారములను పంపుచున్నారు. ఇండియానుండి లండన్ నగరమునకును,అమెరికాలోనుండు న్యూయార్కుపట్టణ

మునకును అతిశీఘ్రముగా సమాచారములను తెలుపవచ్చును, నీటిలో తీగలద్వారా తంతిసమాచారము కొంచెము ఆలస్యము గా పోవును. నీటిలో వేయబడియుండు తీగలు నేలమీఁగనుండు వానికంటె కొంచెము లావుగా నుండవలెను.

తంతి ఆఫీసులు మూడువిధములు.

(1) సర్కారు తంతి ఆఫీసులు, (2) తపాలాఫీసుతో కలిసియుండు తంతి ఆఫీసులు, (3) రైల్వేతంతి ఆఫీసులు- ఈ మూడు ఆఫీసులద్వారాను మనము సమాచారము పంపవచ్చును. తంతిరుసుము ఈదేశములో రెండు విధములు. శీఘ్రముగాపోయి చేరవలసినందులకు ఒకరుసుమును, సాధారణముగా చేరవలసినప్పుడు ఇంకొకవిధమైన రుసుమును ఏర్పాట్లు చేసియున్నారు.

తంతి సమాచారములు మూడువిధములు.

(1) సర్కారు సంబంధముగా సర్కారు ఉద్యోగస్థులకు పంపుసమాచారములు (2) జనులుపంపుసమాచారములు (3) వార్తాపత్రికలకు పంపబడు సమాచారములు. సర్కారువారికిని జనులకును రుసుములో ఏవిధమైన భేదము లేదు. వార్తాపత్రికలవిషయమై కొంతసహాయము చేసి యున్నారు.

తంతి రుసుము వివరము.

సర్కారువారికిని, జనులకును.

| | రు. |
|---|---|
| 12 మాటలకు శీఘ్రముగా పంపవలసినప్పుడు (Express) .... .... .... | 1-0-0 |

| | | | రు. |
|---|---|---|---|
| ప్రతి ఎక్కువమాటకును | .... | .... | 0-1-0 |
| సాధారణముగా పోవలసినప్పుడు 12 మాటలకు | | | 0-6-0 |
| .... | .... | ప్రతి ఎక్కువమాటకును | 0-0-6 |
| వార్తాపత్రికలకు 48 మాటలకు జరూరు అయినప్పుడు | | | 1-0-0 |
| ప్రతి ఎక్కువ ఆరుమాటలకును | .... | .... | 0-2-0 |
| సాధారణమైనపుడు | .... | .... | 0-8-0 |
| ప్రతియెక్కువ ఆరుమాటలకును | .... | .... | 0-1-0 |

సాధారణజనులు అయిదుపందల మాటలకు ఎక్కువగా ఒకేసమయమందు తంతి మూలకముగా పంపకూడదు. దూరములోనుండు ఒకస్థలమునకు శీఘ్రముగా సమాచారము పంపబడునపుడు మధ్యలోనుండు ఆఫీసులో ఏవిధమైన ఆలస్యము లేకుండ ఇతరపనులు నిలిపి శీఘ్రముగా పోవలసిన ఈ సమాచారమును పంపవలసియుండును గనుక జరూరుసమాచారములకు ఎక్కువరుసుమును తీసికొనుచున్నారు. రైల్వేస్టేషనులలో రైల్వేసంబధమైన పనులు ఎక్కువగా లేనికాలమునందే జనులు పంపగోరు తంతిసమాచారములను పంపుటకు సమ్మతింతురు. పంపుటలో జరూరుతంతి మొదటను సాధారణతంతి తరువాతను గమనింపబడును. ఇనుపదారియొక్క ఇరువైపులలోను తంతి స్తంభములమీద తీగలు పోవుటను మీరుచూచియున్నారుగదా? వానిలో నొకటి గవర్నమెంటు సమాచారములకొరకును, మఱియొకటి రైలువారికొరకును ఏర్పడియున్నవి.

ఇతరదేశములకు పంపబడు తంతి సమాచారములకు దూరము నుబట్టిరుసుముల నిర్ణయించియున్నారు. ఇతర దేశములకు పంపబడు తంతిసమాచారములలో జరూరు అనియు, సాధారణ మనియు వ్యత్యాసము లేదు ఎప్పుడును రుసుము ముందుగా నేచెల్లించవలయును. రుసుమును బిళ్లలుగామార్చి నమూనాలో దీనికి ఏర్పడియుండు స్థలములో అతికించవలెను. (రుసుముకొరకు అంటింపబడియుండు) బిళ్లలు రద్దుచేయబడినవా లేవా యని జాగ్రత్తగా చూడవలెను. నమూనాలు తపాలాఫీసులో డబ్బులేకయే దొరకును. బదులు తంతికి చెల్లించబడిన పైకము బదులు ఇవ్వక పోయినప్పుడు తిరిగితీసికొనవచ్చును ఈ విషయమును గురించి కలకత్తాలో నుండు ఛెక్ ఆఫీసు సూపరింటెండెంటు (Check Office Superintendent) గారికి మనవిచేసికొవలెను. రెండు నెలలైనతరువాత వాపసు కోరిన యెడల వాపసుచేయబడదు. ఈఅధికారికే తంతిసమాచారపు సంబంధమైన లోపములను తెలియపఱచుకోవలెను. దీనికికూడ తపాలరుసుము ఏమియు లేదు.

9. తపాలాఫీసు అధికారులు.

(1) బ్రాంచిపోస్టుమాస్టరు:—గొప్ప పట్టణములయందు ముఖ్యమైన వీధులలోను, వ్యాపారము బాగుగా జరుగు గ్రామములలోను బ్రాంచి తపాలాఫీసులు ఏర్పాటు చేయబడియున్నవి. ఈ ఆఫీసుల అధికార్లకు 'బ్రాంచి పోస్టుమాస్టరు'

అని పేరు. ఈ ఆఫీసులలో జాబులు, బంగీలు మనీ ఆర్డర్లు, రిజి స్టర్లు మొదలయిన విషయములు మాత్రము గమనింపబడును. అయితే సేవింగ్సుబ్యాంకి, ఇన్‌షూ్యరెన్సు, ఇతరదేశములకు పోవలసినబంగీలు ఇవియన్నియు గమనింపబడవు—ఆ గ్రామ పోస్టు బంట్రోతు, ఇటువంటి ఇతర చిన్న నౌకర్లుకూడ ఈ ఆపీసులో నున్నారు.

(2) సబ్ పోస్టుమాష్టరు:—ఒకగొప్పగ్రామములోగాని చిన్నపట్టణములో గాని ఏర్పాటు చేయబడియుండు తపాలాపీ సుకు 'సబుపోస్టు ఆపీసు' అనిపేరు. ఈఆపీసు అధికారికి 'స బుపోస్టుమాస్టరు' (Sub Post Master) అనిపేరు. జాబులు, బంగీలు, మనిఆర్డర్లు, రిజస్టర్లు, ఇన్‌షూ్యరెన్సు, సేవింగ్సుబ్యాంకి మొదలయిన అన్నివిధముల తపాలాఫీసు వ్యవహారములును ఈ ఆఫీసులో జరుపబడును.

(3) హెడ్ పోస్టుమాస్టరు:—సాధారణముగా ఒక జిల్లాకు ఒకటివంతునను, తపాల్‌పనులు ఎక్కువగా నుండు జిల్లాలకు రెండు లేక మూడువంతునను హెడ్ పోస్టు ఆఫీసులు ఏర్పాటు చేసియున్నారు. ఈ ఆఫీసు అధికారికి 'హెడ్ పోస్టు మాస్టరు' అనిపేరు. హెడ్‌పోస్టుఆఫీసులు రెండు విధములు:—

1. (ఫస్టుక్లాసు) మొదటితరగతి హెడ్‌పోస్టు ఆఫీ సు. 2. (సెకండ్‌క్లాసు) రెండవతరగతి హెడ్ పోస్టు ఆఫీసు రాజధానియొక్క ప్రధాన పట్టణములలోనుండు తపాలాఫీసు

'జనరల్ పోస్టుఆఫీసు' అని చెప్పబడును. దీనికి అధికారి ప్రెసిడెన్సి పోస్టుమాస్టరు, (Presidency Post Master.) ఈ ఆఫీసు మొదటి తరగతిలో చేరినది. ఇతర జిల్లాలయందుండు హెడ్ పోస్టుఆఫీసులు రెండవతరగతిలో చేరినవి. హెడ్ పోస్టుమాస్టరు తన అధికారమునకు లోబడియుండు సబు, బ్రాంచి తపాలాఫీసులను తనికిచేసి వాని లెక్కలను పై అధికారియైన (Depsty) డిప్యూటీకంట్రోలరుకు తన అఫీసులెక్కలతో కలిపి పంపవలెను. హెడ్ పోస్టుమాస్టరు వానికి లోబడియుండు సబు, బ్రాంచి (Sub, Branch) పోస్టుమాస్టర్లు ఏరీతిగా పనిచేయుచున్నారో యను విషయమును కనిపెట్టి ఉండి యేమైన లోపములున్న యెడల పై అధికార్లకు తెలియపఱచవచ్చును.

(4) సూపరింటెండెంటు (Superintendent)

వీరు హెడ్ పోస్టుమాస్టరు పై అధికారి. వీరికి హెడ్, సబు, బ్రాంచిపోస్టు ఆఫీసులమీాద పూర్ణమైన అధికారమున్నది. ప్రతిఆఫీసును స్వతంత్రముగా వెళ్లి వీరుతనిఖీచేయవచ్చును. వీరికి సహాయము చేయుటకు ఇన్ స్పెక్టర్లను (Inspectors)ఏర్పాటు చేసియున్నారు. ఈఇన్ స్పెక్టర్లు అన్ని బ్రాంచి ఆఫీసులను, సూపరింటెండెంటుగారిచే నిర్ణయింపబడుకొన్నిసబు ఆఫీసులను తనిఖీచేసి లోపములను సూపరింటెండెంటుగారికి తెలియజేయవలయును. ఈసూపరింటెండెంట్లు ఒక రాజధానికి స్వదేశ రాజ్యములలో సహా, 12 లేక 15 మంది ఏర్పడియున్నారు.

వీరికి పై అధికారి, 'పోస్టుమాస్టరు జనరల్' (Post Master General) అనువారు.

(5) (Presidency Post Master) ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరు. చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తా ఇటువంటి ప్రధానపట్టణములయందు ప్రత్యేకముగా తపాలాఫీసు లున్నవి. ఒక ప్రధానపట్టణములోని బ్రాంచి సబు ఆఫీసులు ఆప్రధాన పట్టణములో నుండు జనరల్ పోస్టుఆఫీసు అధికారియైన (Presidency Post Master) ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరుకు లోబడినవి. వీరు హోదాలో పోస్టుమాస్టరుజనరల్‌కు ఇంచుమించుగా సమానమైనవారు. ప్రెసిడెన్సీ పోస్టు ఆఫీసులెక్కలు, ఈఆఫీసువారిచేత తనిఖీ చేయబడు ఇతర ఆఫీసుల లెక్కలు డిప్యూటీకంట్రోలరు (Deputy Controller) కు పంపబడును. ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరు చేయవలసినపనులు మిక్కిలి విస్తారముగా నున్నందున వీరికి సహాయము చేయుటకు ఒక సూపరింటెండెంటు, ఒక డెప్యూటీపోస్టుమాస్టరు, అనునట్టి యుద్యోగస్థులు నియమింపఁబడియున్నారు.

(6) పోస్టుమాస్టరు జనరల్:—బర్మా, హిందూదేశము ఈరెంటిని 9 భాగములుగా విభజించి ప్రతియొక భాగమునకును ఒక పోస్టుమాస్టరు జనరల్‌ను ఏర్పాటుచేసి యున్నారు. ఒక భాగములోనుండు పోస్టాఫీసులయొక్క లెక్కల సంబంధమైన విషయములు తప్ప ఇతరవిషయము లన్నిటికిని ఈ పోస్టుమా

స్టరు జనరల్ జవాబుదారి. ప్రధానపట్టణముల యందుండు ప్రెసిడెన్సీపోస్టు ఆఫీసులోని ఉద్యోగస్థులను తప్ప ఇతర ఆఫీసులలోనుండు ఉద్యోగస్థులను ఏర్పాటుచేయుట, తీసివేయుట మొదలైన పనులను వీరే చేయుదురు.

(7) పోస్టు ఆఫీసు డైరక్టరు జనరల్ (Director General of Post offices in India.)

పైచెప్పబడిన పోస్టుమాస్టరు జనరల్ అను ఉద్యోగస్థులకు పైఅధికారి పోస్టుఆఫీసు డైరక్టరు జనరల్. వీరియొక్క వాసస్థానము హిందూదేశమునకు రాజధానియైన కలకత్తాపట్టణము. ఇండియా, బర్మా, ఈరెండు దేశములలో తపాలాఫీసుల సంబంధమైన అన్నివిషయములను వీరే గమనింపవలయును గనుక వీరికి సహాయముగా డెప్యూటీ అసిస్టెంటు డైరక్టర్లను (Deputy Assistant Directors) నియమించి యున్నారు.

(8) తపాలాఫీసు కంట్రోలరు (Post Office controller.)

తపాలాఫీసు సంబంధమైన రిజిస్టర్లు, బంగీలు మనీఆర్డర్లు సేవింగ్సు బ్యాంకి ఈలెక్కలను తనిఖీచేయుటకు బర్మా, ఇండియాదేశములను నాలుగు భాగములుగా భాగించి ప్రతిభాగమునకును ఒక డిప్యూటీకంట్రోలరును నియమించియున్నారు. వీరికి పై అధికారి తపాలాఫీసు కంట్రోలరు (Post Office Controller.) వీరు కలకత్తానగరములో నుందురు.

తంతి సంబంధమైన విషయములను తనిఖీ చేయుటకు ప్రత్యేకముగా ఇన్‌స్పెక్టర్లు, సూపరింటెండెంట్లు(Superintendents) ఏర్పడి యున్నారు. వీరికి పై అధికారి డైరక్టరు జనరల్ (Director General.) వీరుకూడ కలకత్తా నగరములోనే ఉన్నారు.

(Railway Mail Service) రైల్వే మెయిల్ సర్వీసు.

రైలుమూలకముగా పంపబడు తపాలను తనిఖీ చేయుటకున్ను, రైల్వే మెయిల్ సర్వీసు (Railway Mail Service) చిల్లర ఉద్యోగస్థులను కనిపెట్టియుండుటకును, కొన్ని కొన్ని స్టేషను లలో మెయిల్ ఆఫీసులను ఏర్పాటుచేసి ఆ ఆఫీసులను తనిఖీ చేయుటకు ఇన్‌స్పెక్టర్లు (Inspectors) ను, వీరిమీద ఇండియాను నాలుగుభాగములుగాచేసి ప్రతిభాగమునకు ఒక ఇన్‌స్పెక్టర్ జనరల్ (Inspector General) ను నియమించి యున్నారు. ఈ ఇన్‌స్పెక్టరు జనరల్ తపాలాఫీసుల డైరెక్టరు జనరల్ వారికి లోబడినవారు.

(II. Police పోలీసు.)

ఒక సంఘములోనుండువారు ఒకరికి నొకరు సహాయకారులుగా ఉండవలెనన్న పక్షమున ఆదేశము మిక్కిలి నెమ్మదిగానుండవలెను. అట్లులేనియెడల గందరగోళములు గలిగి తపాల్, తంతి, రైలు ఇవన్నియు నిలిచిపోవును. దీనిమూలముగా జనులకు క్షేమము తగ్గి అనేకములయిన అసౌకర్యములు క్రమ

ముగావృద్ధినొంది కష్టములు ఏర్పడును. కాబట్టి దేశముయొక్క క్షేమమునుద్దేశించి దేశమును సురక్షితముగా నుంచవలసినది అత్యావశ్యకము. దేశముయొక్క రక్షణార్థము గవర్నమెంటు వారిచే ఏర్పాటుచేయబడియుండు నౌకర్లు రెండువిధములుగా నున్నారు. గొప్పయుద్ధము, కలహము, ఇతరదేశములవారిచే కలుగు తొందరలు ఇటువంటివి సంభవించునపుడు దేశమును రక్షించుటకు ఎక్కువబలము గలవారును అధికసామర్థ్యము గలవారును కావలెను. ఇటువంటి సమయములలో సహాయము చేయుటకు అనేకవీరులను ఏర్పాటుచేసి వారికి డ్రిల్లునేర్పి తుపాకి, కత్తి మొదలైన ఆయుధములను చక్కగా ఉపయోగపఱచుటకు సామర్థ్యమును గలుగజేసి యుద్ధమునకు సిద్ధముగా ఉంచియున్నారు. వీరిని మనము యుద్ధబటులు లేక సిపాయిలని చెప్పుచున్నాము. చిన్నకలహములు, జగడము, దొంగతనము, ఇటువంటి గంధరగోళములను ఆపుటకు ఎక్కువబలము గాని యుద్ధనిపుణతగాని అక్కరలేదు. కనుక ఇటువంటి చిల్లర విషయములకు పోలీసువారిని నియమించియున్నారు. అయినను కొన్నిసమయములలో చిన్నకలహములు, జగడము ఇవివృద్ధి నొంది గొప్పవి కావచ్చును. ఆటాలున సిపాయిలను, గొప్పయుద్ధవీరులను రప్పించుటకు సాధ్యములేనప్పుడు పట్టణములనుభద్రముగా కాపాడుటకును, సాధారణమైన కలహముజరుగునప్పుడు దానిని వారించి దేశమునురక్షించుటకును పోలీసువారికి కావల

సినంత బలమును ధైర్యమును ఉండవలెను. గనుక వీరినికూడసిపాయీలవలెనే తయారుచేసి ఉన్నారు. కవాతు చేయుటకును, గుఱ్ఱముమీాద స్వారిచేయుటకును కొందఱికి బాగుగావచ్చును. తుపాకి, కత్తి, బాణాకఱ్ఱ ఇటువంటి ఆయుధములను ఉపయోగపఱచుటకును వీరు అభ్యాసము గలిగి యున్నారు. కొందఱికి గుఱ్ఱపుస్వారిగూడ చక్కగా అభ్యాసమైయుండును.

ఒకజిల్లా అనేక తాలూకాలుగాను, ఒక తాలూకా అనేక గ్రామములుగాను భాగింపబడియున్నవి. పూర్వకాలపు గ్రామప్రచారణకును ప్రస్తుతపు గ్రామవిచారణకును గల వ్యత్యాసమేమనగా పూర్వకాలమందు రాజు నివసించుపట్టణమును గుఱించియు ఆపట్టణమునకు చుట్టునుండు గ్రామములనుగుఱించియు మాత్రమే రాజు గమనించుచుండెను. ఆపట్టణమునకు మిక్కిలి దూరములోనుండుగ్రామములోను ముఖ్యమైన ఇతర పట్టణములలోను జరుగు విషయములను విచారించువారు ఎవరును లేరు. ఇప్పుడు ఒక చిన్న గ్రామములోనుండు మిక్కిలిబీదవానికిగూడ ఆగ్రామాధిపతి ఏవిధమైనకీడును చేయ లేడు. గ్రామము ఎంత చిన్నదైనను రాజుగారు నివసించు స్థలములకు ఎంత దూరములోనుండినను ఆగ్రామములోనుండు జనులు ఏవిధమైన భయమును లేకుండ సుఖముగా జీవించుచున్నారు.

ప్రతియొక పెద్దగ్రామములోను పోలీసు ఠాణా ఉన్నది. ఈపోలీసుఠాణా (స్టేషన్) సబుఇన్‌స్పెక్టరు అధీనములోను

న్నది. ఈఉద్యోగస్థుని అధికారమునకులోబడి కనీసము ఎనిమిది లేక పదిమంది కానిస్టేబిల్సు (Constables) నియమింపబడి ఉన్నారు. పోలీసుకు సంబంధించిన ఉద్యోగస్థులకు వారివారియొక్క హోదాలకు తగినట్టుగా దుస్తులు (Dress) ఏర్పడి యున్నవి. ఒకపోలీసు ఉద్యోగస్థుడు కానిస్టేబిలా కాదా అని దుస్తులను బట్టిచెప్పవచ్చును. ఈతరగతిఉద్యోగస్థులకంటెతక్కిని ఒక టేమాదిరి తలగుడ్డ,కోటు, షరాయి లేక లాగు, చెప్పులు, చేతికర్ర, ఈల (Whistle), బెల్టు, నోటుపుస్తకము, ఈమొదలయినవి ఇచ్చియున్నారు. అవసరమైన కాలమందు వీరు కత్తి, తుపాకి మొదలైన వానిని కూడ ఉపయోగింతురు. ప్రతి కానిస్టేబిల్ కును నంబరు ఇచ్చియున్నారు.

కానిస్టేబిల్సు—వారు చేయవలసినపనులు.

వీరు ముఖ్యమైన వీధులలో నిలువబడి రాత్రులయందును పగటివేళయందును పట్టణమును భద్రముగా కాపాడవలెను. వీధులలో నేరములు జరిగి పోట్లాటలుజరిగినయెడల అట్లుచేయు వారిని తక్షణమేపట్టి పోలీసు స్టేషనుకు తీసికొని పోవలయును. ఎక్కువగా త్రాగిగాని పిచ్చిచేతగాని వీధులలో తిరుగుచు జనులకు ఉపద్రవమును కలుగజేయువారిని పట్టుకొనివచ్చిస్టేషన్ లో ఉంచవలెను. ఇంతేకాక బజారులోను వీధులలోను వ్యాపారము చేయువారు తూనికలలోగాని, కొలతలలోగాని ఏవిధమైన మోసము చేయకుండ కానిస్టేబిల్సు కనిపెట్టి యుండవలెను.

ఖయిదీలను ఒకచోటనుండిమరియొకచోటికి తీసికొనిపోవునప్పుడును, సర్కారు ఖజానాను ఒకచోటనుండి మఱియొక చోటికి తీసికొనిపోవునప్పుడును, రక్షణార్థము వెంబడిపోవలెను. దారి తప్పి తిరుగుబిడ్డలను భద్రముగా కాపాడి స్వంతదారులు వచ్చి అడుగునపుడు వారికి ఒప్పగించవలెను. దొంగ నామానుల ఎగుమతి దిగుమతులను ఆటంకపఱచి గ్రామములలో జూదమాడువారు ప్రవేశించకుండా చేయవలెను. గ్రామ చట్టములకును ఆరోగ్యవిధులకును మీఱి నడుచువారిని శిక్షించవలెను. దొంగతనముచే పొట్టపోసికొనుటకు ప్రయత్నించు హీనజాతి జనులను జాగ్రత్తగా కనిపెట్టియుండి రాజస్థానిలో ప్రతియొక పోలీసు స్టేషనులోను వ్రాయించబడియుండు ఈజాతి జనులయొక్క వర్ణన సహాయముచేత వీరిని గుర్తించి ఈజాతి వృద్ధి కాకుండ ఉండునట్లును, వీరిచే జనులకు ఏవిధమైన కీడును కలుగక ఉండునట్లును, వీరి నడతలను చర్యలను గమనింపవలెను. అన్నివిధముల గ్రామ బందోబస్తుకు జవాబుదార్లు ఈ తరగతిలో చేరిన పోలీసు ఉద్యోగస్థులే.

సబ్ ఇన్ స్పెక్టర్లు:—కానిస్టేబిల్సు పై అధికార్లు సబ్ ఇన్ స్పెక్టర్లని పైన చెప్పియున్నాము. సబ్ ఇన్ స్పెక్టర్లు వారికి లోబడియుండు కానిస్టేబిల్సుచే పనిచేయించుటకు శక్తిగలవారై యుండుటకును, జనులకు కావలసినంత సహాయకారులుగా నుండుటకును, దొంగతనము, ఖూని మొదలైన నేరము

లను సులభముగాను తంత్రముగాను కనిపెట్టుటకు సామర్థ్య ముగలవారై యుండుటకును, పై చెప్పబడిన సబ్ ఇన్‌స్పెక్టర్లను ఉద్యోగములో నియమించుటకుమునుపే, ఈతరగతి పోలీసు ఉద్యోగస్థులను తరిబీతు చేయించుటకుగాను ఏర్పడియుండు పోలీసుట్రెయినింగ్ పాఠశాలలో ఒక సంవత్సరము తరిబీతు చేయించుచున్నారు. పూర్వమువలెగాక ఇప్పుడు ఈతరగతి ఉద్యోగస్థులు చదువుకొన్నవారుగా నున్నారు. లంచము మొదలగు చెడ్డయలవాటులు రానురాను తగ్గుననుటకు సందేహము లేదు. ఈఉద్యోగస్థులయొక్క జీతము బత్తా మొదలగువానిని గవర్నమెంటువారు వృద్ధిచేసియున్నారు గనుక మునుపటివలె అన్యాయముగా ద్రవ్యసంపాదన చేయరు అని ఊహించుటకు అవకాశ మున్నది. ఒక సబ్ ఇన్‌స్పెక్టరు ఒక పోలీసు స్టేషన్ ఛార్జిలో నుండును. ఆపోలీసుస్టేషన్ హద్దులలోనుండు గ్రామములో జరుగు నేరములకు వీరు జవాబుదారిగా నుందురు. వీరికి నెలకు 50 రూపాయలు మొదలు నూరు రూపాయలవరకు జీతమును, 15 రూపాయల గుర్రపు అలవెన్సున్ను ఇచ్చెదరు.

ఇన్‌స్పెక్టర్లు:—సబ్ ఇన్‌స్పెక్టర్లకు పై అధికారి పోలీసు ఇన్‌స్పెక్టరు. వీరికి 150 రూపాయలు మొదలు 250 రూపాయల వరకు నెలజీతము ఇచ్చుచున్నారు. వీరికి పైఅధికారులును గలరు. ఒక రివిన్యూ తాలూకాలో పోలీసుసంబంధమైన

విషయము లన్నియు అనగా ఆతాలూకాలో జరుగు కొట్టుతిట్టులు, పోట్లాటలు, ఖూనీలు, వీనినిగురించి వీరు మొదట విచారించి తగుసాక్షి బుజువులతో మేజిస్ట్రేటు (Magistrate) గారి ఎదుట క్రమమైనవిచారణకు హాజరుపఱచవలయును.

ఇన్స్పెక్టర్ల పై అధికారులైన డెప్యూటీసూపరింటెండెంటును అసిస్టెంటు సూపరింటెండెంటును, ఈఇద్దరు ఉద్యోగస్థులును జిల్లాసూపరింటెండెంటుకు సహాయము చేయుటకు నియమింపబడియున్నారు. జిల్లాసూపరింటెండెంటు వీరికి పై అధికారి. పోలీసు విషయములలో ఒక రివిన్యూజిల్లాఅంతయు వీరికి లోబడినది. వీరు బందిపోటు, వెయ్యిరూపాయలకు లోబడిన దొంగతనము, లేక 500 లకు హెచ్చిన పగటిదొంగతనము,కన్నము వేయుట ఇట్టి నేరములను స్వయముగావిచారించి దొంగలను కనిపెట్టవలెను. వీరు జిల్లా కలెక్టరుకులోబడి.వారితో కలిసి పని చేయవలెను. జిల్లాసూపరింటెండెంటు ఆఫీసులో వారికి ఆఫీసుపనులయందు సహాయము చేయుటకు మేనేజరు అని చెప్పబడు ఒకఉద్యోగస్థుడునియమింపబడియున్నాడు. వీరుపైనచెప్పబడిన సూపరింటెండెంటుకు క్రింది అధికారులకును పై అధికారులకును పంపవలసిన వర్తమానములను (Correspondence) గమనింపవలెను. ఇంకను ఈసూపరింటెండెంటు ఆఫీసులో లెక్కలు తయారుచేయుటకును, వారికిని ఇతర సిబ్బందులకును జీతపుబిల్లులుతయారుచేయుటకును, ఖర్చుపట్టీలువ్రాయుటకును

ఒక (Auditing Inspector) ఆడిటింగ్ ఇన్‌స్పెక్టరు ఏర్పడియున్నాడు. సూపరింటెండెంటు సెషన్సుకోర్టులో హాజరుకావలసిన కాలములయందు గొప్పనేరములు జరిగినయెడల వానిని స్వయముగా సూపరింటెండెంటుగారే విచారింపవలసినపుడు వీరికి బదులుగా కోర్టుకు హాజరై కేసులనుజరుపుటకును విచారించుటకును (Prosecuting Inspector) ప్రాసికూ్యటింగ్ ఇన్‌స్పెక్టరున్ను నియమించుచున్నారు. కొన్నిసమయములలో సూపరింటెండెంటు స్వయముగా ఈపనినిచేయుటయును కలదు. పోలీసు అధికారులు అందఱును (Magistrate) మాజిస్ట్రేటు ఉద్యోగస్థులతో ఎప్పుడును కలిసి పనిచేయవలెను. తామే అధికారులమనియు తమకుఅందఱును భయపడవలెననియు ఎప్పుడును తలంచకూడదు.

(Reserve Police) రిజర్వు పోలీసు.

ప్రతిజిల్లా సూపరింటెండెంటువారి అధీనములో అవశ్యమైన సమయములందు అనగా ఉత్సవము గొప్పకలహము ఇట్టివి జరుగు కాలములయందు అల్లరుల నణచుటకును, నెమ్మదిని గూర్చుటకును రిజర్వు పోలీసు అనిచెప్పబడు ఒక పోలీసు సిబ్బందిని సర్కారువారు ఏర్పాటు చేసియున్నారు. జిల్లాయొక్క విస్తీర్ణము, దానిస్థితి, దానిలో వాడుకగా జరుపబడు ఉత్సవములు వీనినిబట్టి ఈపోలీసువారిసంఖ్య నిర్ణయింపబడును.

ఈసిబ్బందులను క్రమముగా నుంచుటకు ఒక పోలీసు ఇన్స్పెక్ట రున్ను ఇతర ఉద్యోగస్థులును ఏర్పడియున్నారు.

(District Superintendent) జిల్లా సూపరింటెండెంటుకు పై అధికారి ఇన్స్పెక్టరు జనరల్ (Inspector General). ఒకరాజధానిలోనుండి పోలీసు సైన్యములను సరిగానుంచుటకు కావలసిన కట్టుదిట్టములను వీరే ఏర్పాటుచేయుదురు. చట్టని ర్మాణపు పనులు ఎక్కువగానుండును గనుక వీరికి సహాయు లు ఒక (Deputy Inspector General) డిప్ప్యూటీ ఇన్స్పెక్టరు జనరల్ అనువారు నియమింపబడియున్నారు. చెన్నపట్టణములో ప్రత్యేకముగా సూపరింటెండెంటుకు పైన (Deputy Inspector) డిప్ప్యూటీ ఇన్స్పెక్టరుకు బదులుగా అసిస్టెంటుకమీషనర్, డిప్ప్యూటీ కమీషనర్ అను ఉద్యోగస్థులను ఏర్పాటు చేసియున్నారు. వీరును ఇన్స్పెక్టరు జనరల్‌కు లోబడినవారే. ఇంతవరకు డిస్ట్రిక్టు పోలీసునుగురించి చెప్పబడెను. దీనికి సంబంధించినది రైల్వేపోలీసు అనబడు మఱియొక సిబ్బందిగలదు. ఈరెంటిని జనరల్ పోలీస్ అని చెప్పవచ్చును.

(Railway Police) రైల్వే పోలీసు.

రైల్వేపోలీసు సయితము ఇన్స్పెక్టరు జనరల్ వారికి లోబడినదే. వీరి యధికారముక్రిందనే రైలుసంబంధమైనదియు ఇంటెలిజెన్సు డిపార్టుమెంటు (Intelligence Department)

అని చెప్పబడు ఒకవిధమైన సిబ్బందికి అధికారిగా ఒక డిప్యూటి ఇన్ స్పెక్టరు జనరల్‌ను నియమించి యున్నారు. వీరికి సహాయముగా అసిస్టెంటు సూపరింటెండెంటు, కొందఱు డిప్యూటీ సూపరింటెండెంట్లును నియమింపబడి యున్నారు. రాజద్రోహముగా మాట్లాడువారిని, వ్రాయువారిని, ప్రవర్తించువారిని, దొంగలసమూహములను, గొప్పదొంగతనములను, ఖూని, వీని యొక్క మూలములను, వివిధములైన సర్కారు డిపార్టుమెంటులలో జరుగు దొంగతనములను రహస్యముగా ఈ పోలీసు ఇలాకా ఉద్యోగస్థులు విచారింతురు. ఈపోలీసు ఇలాకాలోకూడ ఇన్ స్పెక్టర్లు, సబుఇన్ స్పెక్టర్లు, కానిస్టేబిల్సు, మొదలగు ఉద్యోగస్థు లున్నారు. వీరు ఈ డిపార్టుమెంటు సంబంధమైన పనులు చేయునపుడు మిక్కిలి తంత్రముగాను సామర్థ్యముతోను, బుద్ధిసూక్ష్మముతోను చేయవలెను. రైలు సంబంధముగా రైల్వేఇన్ స్పెక్టర్లును, సబ్ ఇన్ స్పెక్టర్లును నియమింపబడియున్నారు. డిస్ట్రిక్టు పోలీసువారును, రైల్వేపోలీసు వారును ఐకమత్యముతో పనిచేయుచుందురు.

జిల్లాపోలీసు, రైల్వేపోలీసు వీనికి తరువాత వచ్చునది విల్లేజిపోలీసు. ప్రతిగ్రామమును గ్రామాధికారికి లోబడియున్నది. ఆగ్రామములో జరుగు దొంగతనము, కొట్లు తిట్లు వీనిని విచారించుటకు గ్రామాధికారికి అధికార మున్నది. వీరికి సహాయముగాను రాత్రికాలమందు గ్రామమును కాపాడుటకును

ఒకతలారి (గ్రామకావలి) ఏర్పడియున్నాడు. వీనికే (Village Police) విల్లేజిపోలీసు అనిపేరు. ఈపేరువ్రాయబడిన ఒకబిళ్ళ వానికి ఇవ్వబడియున్నది. ఇనుపకట్లు వేయబడిన ఒకకఱ్ఱకూడ ఇచ్చిఉన్నారు. వీడు గ్రామాధికారుల ఆజ్ఞలప్రకారము పనిచే యవలెను. గ్రామమునకు గ్రామాధికారి కలెక్టరువంటివాడు. సంగతులు తెలియనివారు పోలీసు ఉద్యోగస్థులనుచూచిభయ పడుచున్నారు, ఈపోలీసువారు గవర్నమెంటువారి సొంతపను లను చేయుటకు ఏర్పడియున్నారని వారితలంపు. ఇదితప్పు. పోలీ సువారు కొన్ని సమయములందు చేయుతప్పులను బహిరంగ పరచవలసినది అవశ్యమే. ఆరీతిగా చేయుట జనులకు క్షేమ కరము అగును. పోలీసువారు గవర్నమెంటువారి సొంత పనులకొరకు ఏర్పడియుండలేదు. వారు జనులయొక్క క్షేమము నుద్దేశించియు, గ్రామముయొక్క క్షేమము నుద్దేశించియు గవర్నమెంటువారిచే ఏర్పాటుచేయబడియున్నారను విషయము సామాన్యజనులయొక్క మనసున నాటునట్లు చేయవలసినది చదువుకొనిన ప్రతిమనిషియొక్కయు విధియైయున్నది.

### iii. Magistracy.

### మాజిస్ట్రేట్లవారి అధికారము.

కొట్టుట, ఇతరులసొత్తులను బహిరంగముగా అపహరించుట, మోసముచేయుట, ఇటువంటి నేరములను ఒకడు చేసిన పుడు వాడు ఆనేరములను మరలచేయక ఉండునట్లు వానిని

దండించవలసినది అవశ్యకము. నేరములు అనేకవిధములు. నేర స్థుడు అవమానముచేతను దండనభయముచేతను తాను నేర మును చేసినట్లుగా సాధారణముగా ఒప్పుకోడు. నేరము చేసి నప్పుడు చూచినవారియొక్క సాక్ష్యమునుబట్టియే నేరముచేసిన వానిని దండింపవలెనుగాన నేరములను విచారించుట కొకనిర్ణి తస్థలమును, బాగుగా విచారించి న్యాయాన్యాయములను చక్కగా తెలిసికోదగిన ఒక అధికారియును కావలెను. చదువు రానిమూఢజనులు పట్టుదలచేతను, చెడ్డవాడుకలచేతను, అజ్ఞాన ముచేతను, బీదరికముచేతను, పెక్కు నేరములను చేయుచు న్నారు. వీరిని విచారించి న్యాయము చెప్పుటకును, నేరమునకు తగినట్లుగా దండనను విధించుటకును అనేకతరగతుల న్యాయ స్థానములు స్థాపింపబడి యున్నవి. అల్పనేరములను విచారించు టకు కొద్దిజీతముపొందు అధికారులను, గొప్ప నేరములను విచా రించుటకు అధికముగా చదువుకొని గొప్పజీతములను పొందు అధికారులను నియమించియున్నారు. ఈరీతిగా నేరముల విచా రణకొరకు ఏర్పడియుండు న్యాయస్థలములకు "క్రిమినల్ కోర్టులు" అని పేర్లు.

క్రిమినల్ కోర్టులు (Criminal Courts).

(1) గ్రామాధికారి :—

ఈ ఉద్యోగస్థునికి చాల పేర్లు గలవు. నేరవిచారణసం బంధమున ఈయనకు గ్రామమాజిస్ట్రేటు అనియు, సివిల్ వ్యవ

హారసంబంధమున గ్రామమునిసిఫ్ అనియు, తీరువ వసూలు చేయు సంబంధమున గ్రామాధికారి అనియు పేర్లు గలవు.

ఒకగ్రామాధికారి విచారణకు లోబడియుండు గ్రామములన్నిటిలోను వాని అధికారము చెలామణీ యగును. వీనికి పెద్దకాపు, రెడ్డి, నాయుడు అనిపేర్లుగలవు. గ్రామాధికారికి సహాయముగా కరణము, వెట్టివాడు, తలారి మొదలయినవారు నియమింపబడి యున్నారు. గొప్ప గ్రామముల యందు శిస్తువసూలు విషయములో సహాయకారిగా నుండుటకు మణియగారు అను ఉద్యోగస్థునికూడ ఏర్పాటుచేసి యున్నారు. గ్రామాధికారి గ్రామమునందు గవర్నమెంటువారి ప్రతినిధి. పూర్వకాలములో ఈఉద్యోగస్థుడుకూడ తనఫిర్కాలోనుండు పెద్దకాపులయొక్క సహాయముచేత అనేకవిధములైన అధికారములను జరుపుచుండెను. నాగరికత అధికమైన కొలఁది అధికార విభజనమునకు తగినట్లు కావలసినంత సామర్థ్యముగల అధికారులు కావలసివచ్చినందున వీరియొక్క అధికారములకు హద్దులను ఏర్పఱచి చట్టములు ఏర్పఱచి యున్నారు.

గ్రామాధికారి చేయవలసిన పనులు :—

(1) గ్రామములో జరుగు స్వల్పమైన కొట్లు, తిట్టులు, దొంగతనము వీనిని తగినట్లుగా విచారించి న్యాయము తీర్చి నేరస్థుని దండించుట, ఈవిషయములో వీరు పోలీసువారితో కలిసి పని చేయవలెను. పోలీసుజమా

నులు చేయు తప్పు పనులను పై అధికారులకు రిపోర్టు చేయవలెను.

(2) బందిపోటు మనుష్యులు, అనుమానస్థులు వీరినిగుఱించి పోలీసువారికి తెలియపఱచి తగినంత విచారణచేసి సబ్ మాజిస్ట్రేటు (Sub Magistrate) వారికి రిపోర్టు చేయవలెను.

(3) వర్తకులు కుళ్లిపోయిన వస్తువులను జబ్బువస్తువులను. అమ్మకుండా ఆటంకపఱచవలెను.

(4) అపాయకరమైన కట్టడములను పడగొట్టుటకును, భగ్గున మండెడు అపాయకరమయిన వస్తువులను ఉపయోగించ కుండ ఆపుటకును అధికారమున్నది. ఆకస్మికమరణముల గుఱించియు, అసాధారణ మరణముల గుఱించియు సమీపములోనుండు మాజిస్ట్రేటునకైనను,విచారణాధి కారముగలపోలీసుఅధికారికైనను తెలియపఱచవలెను.

(5) గ్రామములో పిచ్చివాండ్రు తిరుగుచున్నయెడల ఈ విషయమును పై అధికార్లకు తెలియపఱచవలెను.

(6) బలహీనులుగానుండు బీదజనులను, మార్గము తప్పి వచ్చిన బిడ్డలను, అనాధలుగానుండినఎడల వారినిరక్షిం చుటయును గ్రామాధికారులయొక్క విధిగా నున్నది.

(7) ఈఅధికారులకు హీనజాతి నేరస్థుని 24 ఘంటలకాలము చెఱలో నుంచుటకును, బొండకొయ్య శిక్షవేయుట

కును అధికారమున్నది. ఏజన్ దెబ్బలుకొట్టుటకు అధికారము లేదు. రు 1-0-0 కు తక్కువైన క్రిమినల్ కేసులను వీరు విచారణ చేయవచ్చును. తూనికరాళ్ళు, కొలత పాత్రలు, ఇవి సరిగా ముద్రవేయబడిఉన్నవాయనిచూచి వ్యత్యాసము లున్న యెడల వానిని సరిపుచ్చవలెను. ఈఉద్యోగస్థులను నియమించుటలో గవర్నమెంటువారు కూడినంత జాగ్రత్తతీసుకొని మిక్కిలి సామర్థ్యముగలవారిని అంతస్తుగలవారిని ఏర్పాటు చేయుచున్నారు. ఈ ఉద్యోగమునకు ఇష్టపడువారు సొత్తుగలవారుగాను గ్రామమునిసిఫ్ పరీక్షలో తేరినవారుగాను ఉండవలెను. గ్రామములో గ్రామాధికారి ఏర్పడినతరువాత చిల్లరజగడములు తగ్గిపోయి నెమ్మదిగా నుండుటవల్ల గ్రామస్థులు మిక్కిలి సుఖ మనుభవించుచున్నారు. గ్రామమునిసిప్ కచ్చేరిచేయునట్టి చోటునకు గ్రామకచ్చేరిచావడి యనిపేరు. ఇప్పుడిప్పుడు కొన్నిగ్రామముల యందు గ్రామచావళ్లకు ప్రత్యేకముగా కట్టడములు కట్టబడుచున్నవి. అనేకగ్రామములలో గ్రామమునిసిఫ్ కచ్చేరిచావడి మర్రిచెట్టుగాను, రాళ్ళదిబ్బగాను ఉండును. గ్రామాధికారికి పై అధికారి స్టేషనరీమాజిస్ట్రేటు. ఈఉద్యోగస్థుడు ఒక తాలూకాలో తనకు లోబడియుండు గ్రామములలోజరుగు నేరములను విచారించి తీర్పుచేయుటకు అధికారము గలవాడు. వీరికి రెండవక్లాసు మాజిస్ట్రేటు అధికారము ఇచ్చియున్నారు. అనగా ఒక నేరస్థుని ఆరుమాసములు చెఱలో నుంచుటకును,—

రూ.200ల వరకు అపరాధము విధించుటకును వీరికి అధికారము గలదు. గ్రామాధికారివల్ల పంపబడిన కేసులను నేరుగా తనవద్దకు విచారణకు వచ్చి సాట్లు, పోలీసు కేసులను, పిర్యాదులను విచారించును. వీరుచేసిన తీర్పులమీద వీరికి పైఅధికారియైన డివిజనల్ మాజిస్ట్రేటు (Divisional Magistrate) కు అప్పీలుచేయవచ్చును. తాను దండించుటకు అధికారములేని కేసులను విచారణచేసి (Sessions Judge) సెషన్సు జడ్జికి పంపివేయుదురు. తాలూకారివిన్యూ అధికారియైన తహశ్శీల్దారు వారు సబ్ట్యూటులోనుండుకాలములలో వీరు తాలూకా ఖజానాను కాపాడవలయును.

మిక్కిలి పెద్దవయిన తాలూకాలు ఒక పెద్దభాగముగాను లేక అనేక చిన్నభాగములుగాను భాగింపబడి యున్నవి. పెద్దభాగములో జరుగు నేరములను విచారణచేయుటకు పైన చెప్పబడిన స్టేషనరీ మాజిస్ట్రేటును, రివిన్యూవిచారణ చేయుటకు తహశ్శీల్దారును నియమింపబడి యున్నారు. ప్రతియొక చిన్నభాగమునకు డిప్యూటి (తహశ్శీల్దారు) మాజస్ట్రేటు అని చెప్పబడు ఒక అధికారిని ఏర్పఱచియున్నారు. వీరికి నేరములు విచారణ చేయుటలో స్టేషనరీమాజిస్ట్రేటుకు గల అధికారము గలదు. వీరు తమకు లోబడియుండు గ్రామములలో రివిన్యూ విచారణ చేయునపుడు తహశ్శీల్దారుని అధికారమునకు లోబడి పనిచేయుచుందురు.

కొన్ని సమయములలో ప్రత్యేకముగా కొన్ని విధములైన కేసులను విచారించుటకు కొంతమంది ఉద్యోగస్థులను నియమించుట కలదు. వీరికి స్పెషల్ మాజిస్ట్రేట్లు (Special Magistrates) అని పేరు. సాధారణముగా న్యూసెన్సు మొదలయిన స్వల్ప కేసులు విచారించుటకు మాత్రమే వీరికి అధికారము ఇవ్వబడును. మునిసిపల్ పట్టణములయందును, గొప్ప యూనియన్లయందును, జనుల ఆరోగ్యమును ఉద్దేశించి ఏర్పాటు చేయబడియుండు విధులకు విరోధముగా కొన్ని నేరములు జరుగుటకు అవకాశములు గలవు. ఇటువంటి నేరములను విచారించి దండించుటకు ఒకపంచాయితీ లేక బోర్డు ఏర్పఱచి యున్నారు. ఈ సభవారికి బెంచిమాజిస్ట్రేట్లు అని పేరు. ఈ సభకు పట్టణముయొక్కయు, యూనియన్లయొక్కయు విస్తీర్ణమునకు దగినట్లు ఇరువురనుగాని, లేక ఎక్కువ(సభ్యులు) మెంబర్లనుగాని ఏర్పాటుచేయుదురు. సర్కారువారిచే విధింపబడియుండు కొన్ని (రూల్సు) చట్టముల ప్రకారము అప్పుడప్పుడు ఈ బోర్డు మెంబర్లు సంధింతురు. ఈ మెంబర్లు ఎక్కువ చదువుగలవారుగాను, ప్రాబల్యముగలవారుగాను ఉందురు. వీరికి జీతము లేదు. గౌరవమును ఉద్దేశించియు జనులయొక్క క్షేమమును ఉద్దేశించియు ఈ మెంబర్లు ఈ పనికి ఒప్పుకొనుచున్నారు. ఈ సభకు సబ్ మాజిస్ట్రేటు అయినను, పెన్షనుడు (Pensioned) మాజిస్ట్రేటు అయినను ప్రెసిడెంటుగా నియమింపబడుదురు. ఈ

సభలోనుండు వారిలో మాజిస్ట్రేటుగా నుండువారికి ఎంతఅధికార మున్నదో ఆ అధికారము ఈసభ మెంబర్లకుకూడ ఇవ్వబడును. ఈ బెంచికోర్టు డివిజనల్ మాజిస్ట్రేటు అధికారమునకు లోబడినది.

రాజ్యములో గొప్పజగడములు, బందిపోట్లు, మొదలగుఉపద్రవములు కలుగకుండ ఉండుటకు ఈదేశములో కొన్ని ముఖ్యస్థలములయందు సైన్యమును ఉంచి బందోబస్తు చేసి యున్నారు. ఆస్థలములు వాసయోగ్యములుగాను, దేహారోగ్యమును వృద్ధిచేయునట్టివిగాను ఉండును. పట్టణములందువలెనే ఈస్థలములయందుకూడ ఇతరజనులు వాసము చేయవచ్చును. ఇటువంటి స్థలములకు కంటోన్మెంట్లు. అనిపేరు. పూనమల్లి, బెంగుళూరు, తిరుచునాపల్లి, ఇవికంటోన్మెంట్లు. ఈకంటోన్మెంట్లలో వాసముచేయు జనులు శరీరారోగ్యవిధులు మీరకుండుటకును, వారుచేయు నేరములను కనిపెట్టి నేరస్థుని దండించుటకును ప్రత్యేకముగా మాజిస్ట్రేట్లను ఏర్పాటు చేసియున్నారు. వీరికి కంటోన్మెంటు మాజిస్ట్రేటు అనిపేరు.

కంటోన్మెంటుయొక్క విస్తీర్ణమునుబట్టి ఒకటవ, రెండవ, మూడవక్లాసు మాజిస్ట్రేట్ల అధికారమువీరికి ఇవ్వబడును. మూడవక్లాసు మాజిస్ట్రేట్లకు నేరస్థుని ఒకమాసము చెఱలో నుంచుటకును, 50 రూపాయలవఱకు అపరాధము విధించుటకును, ఒకటవక్లాసు మాజిస్ట్రేట్లకు రెండుసంవత్సరముల కాల

ము నేరస్థుని చెఱలో ఉంచుటకును, రు. 1,000లవరకు అపరాధ ము వేయుటకును అధికారములుఇవ్వబడియున్నవి. వీరు డిస్ట్రిక్టు మాజిస్ట్రేటుకు లోబడినవారు. గొప్పకార్పొరేషను మెంట్లు మాజిస్ట్రేట్లకు సివిల్ అధికారముకూడ ఇచ్చియున్నారు.

ఇదివరకు చెప్పబడిన మాజిస్ట్రేట్లకంటె ఎక్కువ అధికారమువహించు ఉద్యోగస్థులకు డివిజనల్ మాజిస్ట్రేట్లని పేర్లు, వీరు 1. సబ్ కలెక్టరు, 2. హెడ్ అసిస్టెంటుకలెక్టరు, 3. అసిస్టెంటు కలెక్టరు, 4 డిప్టీకలెక్టరు, వీరిలో మొదటి ముగ్గురును ఇంగ్లాండు లో సివిల్ సర్వీసు పరీక్షలో తేరిన తరువాతనే ఈస్థానముల కు నియమింపబడుదురు. తఱుచుగా వీరు ఆంగ్లేయులుగా నుం దురు. సాధారణముగా సబ్ కలెక్టరును జాయంటుమాజిస్ట్రేటు అని చెప్పుట వాడుక. డిప్టీకలెక్టర్లు అంతఱును స్వదేశీయులే (Natives). వీరిని డిప్టీమాజిస్ట్రేట్లు అని చెప్పుట వాడుక. రెండుగాని మూడుగాని తాలూకాలు వీరి అధికారమునకు లో బడియుండును. తాలూకాలయందు జరుగుగొప్పనేరములను విచారించి సెషన్సు జడ్జీకి పంపివేయుదురు. వీరుచేసిన తీర్పుల మీాద సెషన్సు జడ్జీలవద్ద అప్పీలుచేసుకొనవచ్చును. వీరు ఐరోపియనులుగా నుండిన ఎడల జస్టిస్ ఆఫ్ పీస్ (Justice of peace) అను అధికారమును ఇవ్వబడును. అప్పుడు ఆంగ్లేయనేరస్థుని కూడ విచారించుటకు వీరు అధికారమును పొందుదురు. వీరియొక్క రెవిన్యూ అధికారమును గూర్చి తరువాత వివరింపబడును.

(౮) జిల్లాలోనుండు అన్నివిధములయినమాజిస్ట్రేట్లమీఁదను అధికారముగలవారు డిస్ట్రిక్టుమాజిస్ట్రేటువారు. రివిన్యూ విషయములో వీరికి కలెక్టరు అనిపేరు. జిల్లాఅంతయు వీరి అధికారమునకు లోబడినది. జిల్లాఅంతయుతిరిగి వీరు చేయవలసిన పనులు విశేషముగా నున్నందున నేరములవిచారణ బాహుళ్యముగాచేయుట లేదు. తమసముఖమునకు వచ్చునట్టికేసులను క్రింది అధికారులకు పంపివేయుచున్నారు. వీరియొక్క ముఖ్య పనులేవనగా (1) జిల్లాలో శిస్తువసూలు చేయుట, (2) జిల్లా సంబంధమైన భూములు తగాదాలను విచారించుట, (3) పోలీసు ఇలాకావారిపనులను తనిఖీచేయుట, (4) జిల్లాబొక్కసముతనిఖీ చేయుట, (5) గొప్ప కలహములుగాని గలభాగాని సంభవించినపుడు వీరును వీరిక్రిందనుండు ఇతరమాజిస్ట్రేట్లునుకలిసి పోలీసు. పటాలము, వీరిని పిలిపించి కలహమును ఆపి దేశమునకు నెమ్మది కలుగజేయుట, (6) రాజభాటలు, కట్టడములు, గొప్పచెరువులు వీనినిపరీక్షించి లోపములనుసరిపుచ్చుట, (7) కరువుకాలమునందు గంజితొట్లు మొదలగు ఏర్పాటులనుచేసి జనులనురక్షించుట, (8) జిల్లాయొక్క ఆరోగ్యవిధులనుగమనించిలోపములను నివర్తిచేసి గొప్పపట్టణములలో ఆవశ్యకమైనపుడుమునిసిపాల్టీని ఏర్పాటుచేయుట,(9)చెఱసాలలను పాఠశాలలను తనిఖీచేయుట (10)కలరా, ప్లేగు మొదలగువ్యాధులు ఆరంభించునపుడువానిని అభివృద్ధినొందకుండను, జిల్లా అంతయును వ్యాపించకుండను

నుండుటకు కావలసినంతప్రయత్నములను చేయుట, (11)పట్టాలనుమార్చుట, (12) ఉప్పు, చర్మము, సారాయి, సీమనూనె, మందు గుండు సామానులు, ఇవి విస్తారముగా వ్యాపారముచేయబడు స్థానములను తనిఖీచేయుట, (13) డిస్ట్రిక్టుకోర్టులను పరిశీలించుటకు,(14) ఇంజినీరింగు డిపార్టుమెంటు వారితో కలిసి సాగుబడికాలువాలు, రైలు, బాటలు వీనికి కావలసినకట్టడపు సంబంధమైన కార్యములను గమనించుట. వీరియొక్క పనులు అనేకవిధములుగా నుండుటనుబట్టి వీరికి సహాయము చేయుటకును, ఒకప్పుడు పనినేర్చుకొనుటకును గొప్ప పరీక్షలలో దేరి ఎక్కువసామర్థ్యముగల ఉద్యోగస్థులు వీరిక్రింద నియమింపబడుచున్నారు. వీరికి హెడ్ అసిస్టెంటు కలెక్టర్లు అనిపేరు. వీరు కలెక్టరుతో కలిసి వారి యిష్టానుసారముగ పనులను చేయుచుందురు. వీరికికూడ ఒకటవక్లాసు మాజిస్ట్రేటు అధికారము కలదు, కలెక్టరునకు పై అధికారులు రివిన్యూబోర్డువారు. ఈ సభయొక్క అధికారములు తర్వాత వివరింపబడును. కలెక్టరు జిల్లాకు గవర్నరువంటివాడు అని చెప్పవచ్చును. ఈ ఉద్యోగమునకు నియమింపబడువారు ఇంగ్లాండులో ఇండియన్ సివిల్ సర్వీసుపరీక్ష అని చెప్పబడు గొప్ప పరీక్షలలో తేరినవారుగాను బాగుగా పని తెలిసినవారుగాను ధృఢగాత్రులుగాను ఉండు ఐరోపియనులుగానే ఉందురు. గంజాం, విశాఖపట్టణము, గోదా

వరి, కొన్నిభాగములకు ఏజంట్లుగా నుండి వానిమీద పీరు అధికారులుగా ఉన్నారు.

(9) పైనచెప్పబడిన జిల్లామాజిస్ట్రేట్లు ప్రతి రాజధాని లోని ముఖ్యపట్టణములయందు తప్ప అన్నిజిల్లాలయందుఏర్పా టుచేయబడియున్నారు. చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తా మొదలగు ముఖ్యపట్టణములలో న్యాయమునుపరిపాలించుటకు నియమింపబడియుండు ఉద్యోగస్థులకు ప్రెసిడెన్సీమాజిస్ట్రేట్లు అనిపేరు. ఒక ప్రధానపట్టణమునకుఇటువంటిఅధికారులుముగ్గు రు లేక నలుగురుఉన్నారు. చెన్నపట్టణముయొక్క విస్తీర్ణమును బట్టియు, జనసమృద్ధినిబట్టియు ఈపట్టణమునకు నలుగురుఏర్ప డియున్నారు. వీరిలో ఒకరికి చీఫ్ప్రెసిడెన్సీ మాజిస్ట్రేటు అని పేరు. వీరు ఆంగ్లేయులు మిగతముగ్గురిలో ఒకరు హిందువు గాను మఱియొకరు మహమ్మదీయుడుగాను మూడవవారు ఐరో పీయన్ లేక యూరేషియన్గాను ఉందురు. వీరికందఱికిని ఒకటవక్లాసు మాజిస్ట్రేటు అధికారముకలదు. వీరియొక్కతీర్మా నములమీద అనేక కేసులలో అప్పీలు లేదు. సాధారణముగా గొప్పనేరములు హైకోర్టువారికే పంపబడును.

(10) రాజధానిలో ప్రతిజిల్లాయందుగాని లేక రెండు జిల్లాలకుగాని ఒకసెషన్సుకోర్టు ఉండును. చెన్నపురిరాజధా నిలో సాధారణముగా ప్రతిజిల్లాకును ఒక సెషన్సుకోర్టు (Sessions Court) ఉన్నది. ఈకోర్టు అధికారికి సెషన్సు

జడ్జిఅనిపేరు. వీరు ఖూనీ మొదలగు గొప్పనేరములను విచారించుటకు అధికారముగలవారు. వీరు కేసులను విచారించు కాలమందు జూరీలనియు అసెసర్లనియు చెప్పబడు సభలయొక్క సహాయమును పొంది కేసులను తీర్మానింతురు. అసెసర్లయొక్క అభిప్రాయమునకు వీరు బద్ధులై యుండనక్కరలేదు. జూరీలయొక్క అభిప్రాయమును అలక్ష్యముచేయగూడదు. జూరీలయొక్క అభిప్రాయము వీరి అభిప్రాయముతో ఏకీభవించనియెడల కేసులను హైకోర్టుకు పంపివేయుదురు. క్రిందికోర్టువారు వీరికి కేసులను పంపుటయుకలదు. వీరు క్రిమినల్ కేసులను సివిల్ కేసులను రెంటినివిచారించి ముగింపచేయవచ్చును. అన్నివిధములయిన దండనలను విధించుటకు వీరికి అధికారముకలదు. మరణదండన విధించునపుడు హైకోర్టువారి అనుమతిలేకుండ దండనను అమలుకు తీసుకొనిరాగూడదు. క్రిందికోర్టువారు చేసినతీర్పులను మార్చుటకును రద్దు చేయుటకును వీరికి పూర్ణమైన అధికారముగలదు. సెషన్సుజడ్జిని లోకల్ గవర్నమెంటువారు నియమింతురు. ఈఅధికారము యూరోపియన్లకును, స్వదేశీయులకును ఇచ్చుచున్నారు.

(11) ఒకరాజధానిలోనుండు న్యాయస్థానములన్నిటిలో గొప్పది హైకోర్టు. ఈకోర్టులు హిందూదేశముయొక్క ప్రధానపట్టణములయిన చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తా, అలహాబాదు. ఇటువంటి స్థలములయందు మనచక్రవర్తిగారిచే

స్థాపింపబడి ఉన్నవి. ఈహైకోర్టు జడ్జీలు మనప్రభువైన చక్రవర్తిగారిచే నియమింపబడుదురు. వారిని ఉద్యోగమునుండి తొలగించుటకు మన ప్రభువైన చక్రవర్తిగారికి మాత్రమే అధికార మున్నది. న్యాయమును కనిపెట్టితీర్పుచేయు విషయములో వీరికి సర్వాధికారము గలదు. క్రిందికోర్టువారి తీర్పులను మార్చుటకును రద్దుచేయుటకును అధికారముగలవారై యున్నారు. గొప్ప నేరములను విచారించునపుడు జూరీలయొక్క సహాయమునుకూడ బొందుదురు.

(12) రాజధానికంటె విస్తీర్ణమునందు తక్కువైనలోయరు బర్మా, పంజాబు, ఇటువంటిమాగాణములలో హైకోర్టుకు బదులుగా చీఫ్‌కోర్టు ఏర్పఱచియున్నారు. చీఫ్ కోర్టు జడ్జీలు ఇండియాగవర్నమెంటువారిచే (వైస్‌రాయిగారిచే) నియమింపబడుదురు. మధ్యపరగణాలవంటి మిక్కిలి చిన్నభాగములకు నియమింపబడు న్యాయాధికారికి చీఫ్ కమీషనర్ అని పేరు. వీరుకూడ వైస్‌రాయిగారివల్లనే నియమింపబడుదురు. ఈరెండుకోర్టులకును హైకోర్టువారికి గల అధికార మున్నది. ఈ అధికార్లకు క్రింద జడ్జీలును మాజిస్ట్రేట్లును గలరు. మధ్యపరగణాలయందు డిస్ట్రిక్టు మాజిస్ట్రేటు, డిప్యూటీకలెక్టరు, ఇటువంటిఅధికారులకు డిప్యూటి కమీషనర్, అసిస్టెంటు కమీషనర్ అని పేర్లు గలవు.

(13) హైకోర్టు, చీఫ్‌కోర్టు ఈరెంటియొక్క తీర్పుల

మీదచక్రవర్తిగారికి అప్పీలున్నది. ఇటువంటి కేసులను విచారించుటకు చక్రవర్తిగారు ప్రివి కౌన్సిల్ (Privy Council) ను ఏర్పాటు చేసియున్నారు. ఈ సభ సీమలోనున్నది. ఈ సభవారు కేసుకు సంభంధించిన దస్తావేజులను బాగుగా చూచివారి అభిప్రాయమును చక్రవర్తిగారికి తెలియపఱతురు. ఈఅభిప్రాయము ననుసరించి చక్రవర్తిగారు తీర్పుచేయుదురు.

(14) ఇండియా సంబంధమైన సర్వరాజ్య కార్యములను గమనించునట్టి మూలస్థానాధికారులు ఒకరు ఇండియాలోను మఱియొకరు ఇంగ్లాండులోను ఉన్నారు. ఇంగ్లాండులోనుండు అధికారి రాజశ్రీ చక్రవర్తిగారు. వారు. స్వతంత్రముగా అధికారము చేయుటలేదు. వారికి 'పార్లమెంటు' అని చెప్పబడు ఒక సభ యున్నది. ఇది రెండు భాగములుగా ఉన్నదిఒక సభకు 'హౌసు ఆఫ్ లార్డ్సు' అనిపేరు. ఈసభవారుకుటుంబగౌరవమునుబట్టి వంశపారంపర్యముగా గాని లేకచక్రవర్తియు మంత్రులును కలిసి నియమించుట వల్లగాని ఏర్పడిన ప్రభువుల యొక్క సంఘము. మఱియొకసభకు 'హౌసు ఆఫ్ కామన్సు' అని పేరు. వీరు అందఱును జనులయొక్క ప్రతినిధులు. వీరి సంఖ్య సుమారు 670. ఈరెండు సభలలో నుండి 16 మంత్రులు రాజ్యకార్యములను జరుపుటకొరకు ఏర్పాటుజేయబడుదురు. వీరిలో ప్రతివారికిని ప్రత్యేకమైన పని యున్నది. ఒకరు బొక్కసము సంబంధమైన విషయములకు, మరియొకరు యుద్ధ

విషయములను, ఇంకొకరు ఇతర దేశముల విషయములను, ఈ రీతిగా అనేకవిధములయిన పనులు ఒక్కరొక్కరికిని ఏర్పడియున్నవి. వీర్లకు సెక్రటరీలు అని పేరు. సెక్రటరీ అను పదమునకు కార్యదర్శి అని అర్థము. హిందూదేశముయొక్క కార్యదర్శికి ప్రత్యేకముగా ఒక ఆఫీసు ఉన్నది. ఈ ఆఫీసుకు 'ఇండియా హౌసు' అనిపేరు. ఈ కార్యదర్శికి మంత్రాలోచన సభ యొకటి గలదు. ఇండియా సంబంధమైన రాజ్యకార్యముల కిదియొక మూలస్థానము మఱియొక మూలస్థానాధికారముఇండియాలో నేయున్నది. దీనికి ఇండియాగవర్నమెంటు అనిపేరు. వైస్రాయియును వారి ఆలోచన సభయును కలిసి ఇండియాగవర్నమెంటు అగును. వీరివాసస్థానముకలకత్తా. వైస్రాయిఅనుపదమునకు "రాజప్రతినిధి" అనిఅర్థము. వీరికి రెండుముఖ్యపనులు గలవు. (1) చట్టనిర్మాణము, (2) రాజరిక విచారణలు. ఈ రెంటికిని వేరువేరు సభలున్నవి. చట్టనిర్మాణ సభలో 68 మంది మెంబర్లు ఉన్నారు. ఈ సభవారు ఎక్కువ సమర్థత గలవారుగాను చదువుకొన్న వారుగాను ఉందురు. వీరిలో కొందఱు వైస్రాయిచే నియమింపబడుదురు. మరికొందఱు జనులచే ఎన్నుకొనబడుదురు. ఇండియాగవర్నమెంటు సంబంధమైనచట్టములను ఈ సభవారే ఏర్పాటుచేసి వైస్రాయియొక్క అనుమతిని బొంది అమలుకు తెత్తురు.

ఈ ఇండియాగవర్నమెంటువారికి పైవిచారణ సభలో

7 గురు మెంబర్లు గలరు. ఈ 7 గురు మెంబర్లును హిందూ దేశ సంబంధమైన పనులను తమలో పంచుకొని నిర్వహింతురు. ఇద్దరు యుద్ధవిషయమును, ఒకరు వ్యాపారవిషయమును, ఒకరు వ్యవసాయవిషయమును, ఒకరు శిల్పకార్యవిషయమును, ఒకరుడబ్బు విషయమును, ఒకరు ఇంగ్లాండుకును ఇండియాకును సంబంధించిన విషయమును చూచుచు పని చేయుదురు.

ఇండియా గవర్నమెంటుకు బొంబాయి చెన్నరాజధాని గవర్నర్లును, ఇతర లెప్టునెంటు గవర్నర్లును లోబడినవారు. చీఫు కమీషనర్లుకూడ ఇండియాగవర్నమెంటుకు లోబడినవారే. ఎండకాలములో ఆరుమాసముల కాలమునకు ఎక్కువగా హిమాలయపర్వతముయొక్క అడుగుభాగమునందుండు సిమ్లా అను నగరములో ఇండియాగవర్నమెంటువారి ఆఫీసు ఉండును.

## IV. సివిల్ కోర్టులు.

(1) వెనుకటి అధ్యాయమున నేరములను విచారించుటకు ఏర్పడియుండు న్యాయసభలను గురించియు, అధికారులను గురించియు సంపూర్ణముగా జెప్పియున్నాము. ఈ అధ్యాయములోసొత్తు, బాధ్యత వీనిసంబంధమైన సివిల్ వ్యవహారములను విచారించి తీర్పుచేయుటకు ఏర్పడియుండు న్యాయస్థలములను గురించియు అధికారులను గురించియు వారి అధికారములకు ఏర్పడియుండు కట్టుబాట్లను గురించియు వివరముగా చెప్పెదము.

(3) వెనుకటి భాగములో చెప్పిన ప్రకారము ఈ అధికారులలో కడపటివారు గ్రామ మునిసిఫ్. వీరికి సివిల్ వ్యవహారములలో కొద్దిపాటివానిని విచారించుటకు అధికారము గలదు. లెక్కతీర్చినతరువాత స్పష్టముగా ఏర్పడియుండు మొత్తమునుగురించిగాని, అప్పుగాగాని, మొత్తము 20 రూపాయలకు ఎక్కువ కానప్పుడుగాని, ఈ 20 రూపాయలకు పైబడని కంట్రాక్టుతాలూకు బాకీగానుండు మొత్తములను గురించిగాని, చరాస్థిని గూర్చిగాని, తీసికొనిరాబడు వ్యాజ్యములను విచారించుటకు గ్రామమునిసిఫ్ అధికారము కలిగియున్నాడు. అయినను గ్రామమునిసిఫ్ ఎదుట కక్షిదార్లు యిష్టపడి (ఒడంబడిక) వ్రాసి ఇచ్చినప్పుడు కేసుల మొత్తము 200 రూపాయల వరకు ఉండవచ్చును. ఈ అధికారులు జేయు తీర్పు ననుసరించి డిస్ట్రిక్టుకోర్టువారిచే అమలు జరుపబడును.

ప్రతి గ్రామకోర్టులోను ఒకగ్రామ మునిసిఫ్ ఉండవలెను. వీరు ఆ గ్రామములో నివసించువారుగా నుండవలెను. అయితే డిస్ట్రిక్టు గెజెట్ లో ప్రచురింపబడు ప్రత్యేకమైన ఉత్తర్వుల ప్రకారము గ్రామాధికారికోర్టులో ముగ్గురున్యాయాధిపతులు ఉండవచ్చును. వీరిలో గ్రామమునిసిఫ్ అగ్రాసనాధిపతి. తక్కినవారు కలెక్టరువారిచే తయారుచేయబడిన జాబితానుండి వ్యాజ్యమునకు సంబంధించిన కక్షిదార్లు కోరుకొనునట్టి ఇద్దరు పెద్దమనుష్యులు. ఈ ముగ్గురును కలిసిన సభకు పంచాయ

తీకోర్టు అని పేరు. ఈ సభలో చేయబడిన తీర్పుప్రకారము సొమ్ము ఇవ్వవలసినవాడు ఇవ్వకుండా తీర్పుకు విరోధముగా నడుచుటకు ప్రయత్నించినఎడల వానిసొత్తును జప్తు చేయుటకు గ్రామాధికారికి అధికారమున్నది. అన్నివిధములైన జప్తులను పగటిపూటనే జరుపవలెను. వ్యాజ్య సంబంధమైన రిజిస్టర్లనుసిద్ధముగాఉంచుటకును, కోర్టులోజరుగు విషయములను వ్రాయుటకును గ్రామమునిసిఫ్‌లు బద్ధులైయున్నారు. ఈ పనులను గ్రామమునిసిఫ్‌మాత్రమే చేయవచ్చును. అయితే ఆవశ్యమైన ఎడల గ్రామకరణముయొక్క సహాయమును పొందవచ్చును. సమ్మనులు జారీచేయుటయును డిక్రీలను నెరవేర్చునపుడు కావలసిన ఉత్తర్వులను ఇచ్చుటయును, గ్రామమునిసిఫ్‌యొక్కపని. పైన చెప్పబడిన పంచాయితివారిచే డిక్రీచేయబడిన మొత్తము వెయ్యి రూపాయలకు ఎక్కువ కానప్పుడు గ్రామమునిసిఫ్ ఆడిక్రీని నెరవేర్చవచ్చును.

డిస్ట్రిక్టుమునిసిఫ్‌కోర్టు :—సివిల్ వ్యాజ్య సంబంధమున గ్రామాధికారికంటె ఎక్కువ అధికారముగలన్యాయస్థలమునకు జిల్లామునిసిఫ్‌కోర్టు అనిపేరు. ఈ ఉద్యోగమునకు నియమింపబడువారందరు సాధారణముగా ఇండియనులే. సర్వకలాశాలలో చదివి చట్టపరీక్షలలో తేరియుండువారు మాత్రమే విశేషముగా ఈ అధికారమునకు నియమింపబడుచున్నారు. వీరలు ఎక్కువఅనుభవము గలవారుగానుందురు. న్యాయస్థల

మునలో డిస్ట్రిక్టుమునిసిఫ్‌కోర్టుముఖ్యమైనది. గ్రామమునిసిఫ్‌చే విచారింపబడుచున్న సివిల్ వ్యాజ్యములుతప్ప అనేకగొప్పవ్యాజ్యములను, సివిల్ వ్యవహారములను, ఈకోర్టులో మొట్టమొదట విచారింపబడి తీర్పు చేయబడును. అప్పు, భూసంబంధమైన వ్యవహారములు, మాననష్టము, కంట్రాక్టు, ఖరారునామా, కవులు, స్థిర, చరాస్తులనుగురించిన తకరరు వ్యవహారములు, ఇంక ఇతర వ్యవహారములును విచారింపబడును. వ్యాజ్యసంబంధమైన కక్షీదార్లు సాక్షులు ఆలస్యముగావచ్చినను, అసలు రాకపోయినను విరోధములచేత అబద్ధముచెప్పినను, వారినిదండించుటకు ఈకోర్టువారికిఅధికారమున్నది. విచారణకాలములో ఎదురుతిరిగిమాట్లాడువారిని ఈకోర్టువారు దండించగలరు. వీరువిచారణచేయువ్యవహారములనుబట్టియు మొత్తములనుబట్టియు కేసులుస్మాల్‌కాసు అనియు, అసలనియు, రెండువిధములుగా ఉన్నవి. స్మాల్‌కాజుగా విచారణముచేయబడితీర్పుచేయబడిన తీర్మానములమీాద అప్పీలు లేదు. అయితే హైకోర్టువారు ఇష్టపడినఎడల మార్చవచ్చును.

ఈకోర్టులో దాఖలు చేయబడు అసలు వ్యాజ్యములు మదింపులో 2,050 రూపాయలను మించక యుండవలెను, ఈ మొత్తమునకు పైబడిన వ్యాజ్యములను ఈ క్రింద చెప్పబడి యుండు సబుకోర్టులోగాని, జిల్లాకోర్టులోగాని దాఖలు చేయవలెను.

స్మాల్‌కాసు వ్యాజ్యమైన ఎడల 200 రూపాయలవరకు ఈ కోర్టువారే విచారింపవచ్చును. వీరు చేసిన అసలు తీర్పుల

మీద జిల్లాకోర్టువారికి గాని సబుకోర్టువారికి గాని అప్పీలు చేసికోవచ్చును. డిక్రీ అయిన 30 రోజులలో అప్పీలు చేయవలెను. ఈ కోర్టులు జిల్లా ఒకటికి విస్తీర్ణమును బట్టియు వ్యాజ్యములయొక్క సంఖ్యనుబట్టియు నాలుగు మొదలు పదివరకు ఏర్పఱచియున్నారు.

## డిస్ట్రిక్టుజడ్జికోర్టు లేక జిల్లాకోర్టు.

మునిసిఫ్ కోర్టుమీద అధికారముగలది డిస్ట్రిక్టుకోర్టు (District Court). ఈ కోర్టు ప్రతిజిల్లాకును ఒకటి యున్నది. దీని న్యాయాధికారికి జడ్జి అని పేరు. ఈ కోర్టువారికి ఆ జిల్లాలోనుండు గ్రామమునిసిఫ్, జిల్లామునిసిఫ్, ఈక్రింద వివరింపబడియుండు సబుకోర్టులువీనిమీద అధికారమున్నది. ఈకోర్టువారు 500 రూపాయలకు పైబడు అసలు వ్యాజ్యములను, క్రిందికోర్టువారి తీర్పులమీద అప్పీలు వ్యవహారములను విచారించ వచ్చును. ఈ కోర్టుఅధికారి తన జిల్లాలోనుండు జిల్లామునిసిఫ్ కోర్టులను తనిఖీచేయవచ్చును. గంజాం, విశాఖపట్నం, గోదావరి ఈ మూడుజిల్లాలయొక్క పర్వతప్రదేశములయందు జరుగు వ్యవహారములను విచారించుటకు జడ్జీకి అధికారము లేదు. ఈ ప్రదేశములకు నియమింపబడియుండు కలెక్టరువంటి రివిన్యూ అధికారులే సివిల్ వ్యవహారములను విచారించుటకు అధికారము కలిగియున్నారు. వీరు చేసిన తీర్పులమీద అప్పీలు చేయ కోర్టువారు హైకోర్టుకు పోవలెను.

ఒకజిల్లా మిక్కిలి పెద్దదిగాను జనసమృద్ధము కలదిగాను ఎక్కువ గ్రామములు కలదిగాను సదా వ్యవహారములను కలుగజేసికొను స్వభావముగల జనులు కలదిగాను ఉన్నప్పుడు పై చెప్పబడిన డిస్ట్రిక్టుకోర్టువారు ఆ జిల్లాలో జరుగు సివిల్ వ్యవహారములన్నిటిని బాగుగానుతృప్తికరముగాను న్యాయలోపములులేకయు విచారణచేసి తీర్పుచేయుటకు సాధ్యముకాదు. అటువంటి జిల్లాలయందు డిస్ట్రిక్టుకోర్టుకు సహాయముగా ఒకటిలేక రెండు సబుకోర్టులను ఏర్పాటుచేయుదురు. సబుకోర్టు అధికారులకు సబుజడ్జీలని పేరు. వీరుకూడ విశేషముగా ఇండియనులే. సివిల్ వ్యాజ్యవిషయములో డిస్ట్రిక్టు కోర్టువారికి ఎంత అధికారముకలదో అంత అధికారము ఈ కోర్టువారికి కూడ ఉన్నది. సబుకోర్టువారి తీర్పులమీద హైకోర్టువారికి అప్పీళ్లున్నవి. రు. 1,000 లకు లోబడిన మొత్తమైనఎడల డిస్ట్రిక్టుకోర్టువారికి మొదటి అప్పీలును, హైకోర్టువారికి రెండవ అప్పీలును చేసికొనవచ్చును. డిస్ట్రిక్టుకోర్టులో అసలు వ్యాజ్యముతో ఆకోర్టువారు విచారించుటకు అలవికానపుడు అసలు వ్యాజ్యములను కొన్నిటిని సబుకోర్టుకు పంపివేయవచ్చును. అయినను ఇటువంటి సందర్భములు విశేషముగా కలుగవు. ఏలనగా ఒకటే అధికారముగల రెండుమూడుకోర్టులు ఒకటేజిల్లాలోనున్నపుడు ఆయా కోర్టులకు సంబంధపడిన ప్రదేశములలో

జరుగు వ్యవహారములు ఆయాకోర్టులలోనే అసలు దాఖలుచే యబడును. పైచెప్పబడిన జిల్లాకోర్టులును సబుకోర్టులును రాజధానియొక్క ముఖ్యపట్టణములలో తప్ప ఇతర జిల్లాలయందు మాత్రమే ఏర్పడియున్నది. ఒక రాజధానియొక్క ముఖ్యపట్టణము విస్తీర్ణములోను, జన సమృద్ధములోను. నాగరికతలోను, వ్యాపారము మొదలగువానిలోను, వీనిసంబంధమైన వ్యవహారములలో, ఇతర జిల్లాలకంటె ఎక్కువగా నుండునుగదా? ఇదియునుగాక ఒక రాజధానిలోనుండు అనేకజిల్లాలయందుజరుగు గొప్పవ్యవహారములు, ఖూని సంబంధమైన కేసులు, వీనిని గురించి క్రిందికోర్టువారు చేసినతీర్పులమీద అప్పీలు చేయవలసి వచ్చినపుడు ముఖ్యపట్టణములోనుండు హైకోర్టుకు పంపవలెను. కనుక ముఖ్య పట్టణములయందుండు హైకోర్టు ఆపట్టణ సంబంధమైన వ్యవహారముల నన్నిటిని బాగుగావిచారించుటకు అవకాశము గలదిగా నుండదు. ఈ కారణములను బట్టియే ప్రధానపట్టణములో హైకోర్టు ఉండు కట్టడములో గాని లేక దానికి సమీపములోగాని రెండుకోర్టులు ఏర్పాటు చేసియున్నారు. ఈ రెంటిలో ఒకటి ఆపట్టణములో జరుగు చిల్లరవ్యాజ్యములను విచారించుటకు అధికారముగలది. దీనికే స్మాల్ కాస్ కోర్టు (Small Cause Court) అని పేరు. ఇది 2,000 రూపాయల వరకు వ్యాజ్యములను విచారింపవచ్చును. మరియొకకోర్టుకు సిటీ సివిల్ కోర్టు (City Civil Court) అని

పేరు. ఈకోర్టు 2,500 రూపాయలవరకు అసలువ్యాజ్యములను విచారణ చేయవచ్చును. ఈ రెండుకోర్టులమీద హైకోర్టువారికి సర్వాధికారమున్నది. ఈరెండుకోర్టుల అధికారులకు జడ్జీలు అనిపేరు.

ఇప్పుడు చెన్నపట్టణమున ఏర్పడియుండుహైకోర్టు 1861 సంవత్సరమున మాతు శ్రీవిక్టోరియామహారాణిగారి ప్రభుత్వకాలములో స్థాపింపబడినది. ఆసంవత్సరముననే బొంబాయి, కలకత్తా, అలహాబాదు, ఈస్థలములయందు హైకోర్టులు ఏర్పడి ఇప్పుడు అవి అన్నివిధములైన సివిల్ క్రిమినల్ వ్యవహారములను విచారించుటకు అధికారమును బొందియున్నవి.

వీనికి పిదప కాలక్రమమున లోయరు బర్మా, పంజాబు వీనిలోకూడ ఈఅధికాములుగల చీఫ్‌కోర్టులు స్థాపింపబడినవి. ఈ చీఫ్‌కోర్టులకును మీద ఆయారాజధానులలో నుండు ఇతర కోర్టులమీద అధికారమున్నది. చీఫ్‌కోర్టు ఉండు ప్రధానపట్టణమున రు. 2,500 కుపైబడిన అసలువ్యాజ్యములను ఈ కోర్టువారే విచారింపవలెను. అప్పీళ్లు లన్నియు ఈ కోర్టువారేవిచారింతురు.

పైన జెప్పబడిన హైకోర్టు, చీఫ్‌కోర్టు గాక వీనికంటె వేరైన అధికారముగల కోర్టు ఇంకొకటియున్నది. అది ఇండియాలో లేదు. ఇంగ్లాండులోనేయున్నది. అది వెనుకటి అధ్యాయములో చెప్పబడిన ప్రీవి కౌన్సిల్ అనునదే. అది హై

కోర్టు, చీఫ్‌కోర్టు ఈ రెంటియొక్క అసలు వ్యాజ్యముల తీర్పులమీదను, అప్పీళ్లతీర్పులమీదను తీర్పులు చెప్ప సామర్థ్యము కలిగినది. ప్రీవి కౌన్సిల్‌లో అప్పీలు చేయుటకు సదరు వ్యాజ్యము 10,000 రూపాయలు లేక ఎక్కువ మొత్తముగలదై యుండవలెను. సాధారణముగా హైకోర్టువారి అనుమతిని పొంది అప్పీలు చేయవలెను. హైకోర్టువారు అనుమతి ఇవ్వని పక్షమున అప్పీలుచేయుటకు పూర్వము ప్రీవి కౌన్సిల్ వారి అనుమతి పొందవలెను. ఈ ప్రీవి కౌన్సిల్‌కు 1833 సంవత్సరములో ఇండియా అప్పీళ్లను విచారించుటకు అధికారమివ్వబడినది. ఈప్రీవీ కౌన్సిల్ అను న్యాయసభ ఇప్పుడు ఒకకోటి పదిలక్షలచదరపుమైళ్ల విస్తీర్ణముగల ప్రదేశమునందు నివసించు నాలుగువందలకోట్ల జనుల అప్పీళ్లలో పర్యవసానపు తీర్పు నిచ్చుటకు అధికారము గలిగియున్నది. అంత అధికారముగల న్యాయస్థలము ఇదివరకు ఎక్కడనులేదు. పూర్వకాలములో మనుధర్మశాస్త్రము, మితాక్షరశాస్త్రము వీనివలె హిందువులు మహమ్మదీయులు మొదలైన వివిధ తెగలవారి విషయమున ఈ ప్రీవీకౌన్‌సిల్ (Privy Council) ధర్మనిర్ధారణ తీర్పులను చేయుచున్నది. ఈసభలో నుండువారి సామర్థ్యము మిక్కిలి మేలైనదిగా నుండవలెను. వుయిలునామా అనునది నూరుసంవత్సరములక్రిందట ఈదేశములో లేదు. హిందువులయొక్క సౌకర్యముల నుద్దేశించి అది ఈదేశములో ఏర్పాటు

చేయబడినది. (Privy Council) ప్రీవీ కౌన్‌సిల్ అనుసభ వుయిల్ సంబంధమైన చట్టములను బాగుపఱచినందున అది హిందూదేశములో అమలులోనున్నది. ప్రీవీకౌన్సిల్‌లో అప్పీలుచేయుటకు సుమారు 7,500 రూపాయలు ఖర్చుఅగును. ఇంతఎక్కువ ఖర్చుఅయినను ఈసభవారు చేయుపని మిక్కిలి శ్లాఘనీయమైనదిగ నుండును గనుక జనులు ఈఖర్చులను లక్ష్యముచేయుట లేదు.

## V. దేశక్షేమమును గుఱించిన కట్టుబాట్లు.

గడచిన అధ్యాయములో హిందూదేశములో న్యాయసభలు ఏర్పడి ఆసభలయొక్క అధికారులచే న్యాయాన్యాయములు విచారణచేయబడుచున్నవనియు, ఇందువల్ల ఎక్కడను ఒకటేవిధముగ సుఖమును నెమ్మదిని కలిగి ఏవిధమైన కష్టములు లేకుండ మిక్కిలి అల్పమనుష్యులుకూడ మనస్సంతుష్టికలిగి జీవితకాలమునుగడుపుటకువీలుగానున్నవనియును చెప్పియుంటిమి. ఈఅధ్యాయమున పూర్వకాలమునందు ఈదేశస్థులను హింసచేసిన శత్రువులను గురించియు ఆశత్రువులు ప్రవర్తించిన విధములను గురించియు బ్రిటిషు గవర్నమెంటువారు ఏవిధముగా ఈశత్రువులను రూపుమాపి దేశములో నెమ్మదిని కలుగజేసిరో ఆవిధమును గురించియు సంగ్రహముగా వ్రాయబడును.

హిందూదేశముయొక్క పటమును చూచినచో అది యొక పెద్ద ద్వీపకల్పమనియు దాని ఉత్తరభాగమునందు ఒక

ఉన్నతమైన పర్వతపంక్తి గలదనియు తక్కిన మూడుభాగముల యందు సముద్రము గలదనియు విశదమగును. ఆ పటమునే బాగుగా గమనించి చూచిన ఎడల ఉత్తర భాగమునందు వ్యాపించియుండు పర్వతపంక్తియొక్క రెండు కొనలలో పడమటి కొనకు సమీపమున రెండు కనుమలును, తూర్పుచివరయందు ఎక్కువ వెడల్పులేని చదునైన ప్రదేశములలో ఏర్పడియుండు ఒకకనుమయును ఉన్నట్లు తెలియవచ్చును. ఈకనుమలద్వారా అనేకపర్యాయములు చెంగిస్‌ఖాన్, తామురులేన్, నాదర్షా మొదలగు అన్యదేశస్థులు ఇండియాలో ప్రవేశించి పలుమారు కొల్లపెట్టి జనులను హింసించి వచ్చినమార్గముననే మరల వారి వారి దేశములకు పోయినట్లుగా చరిత్రవలన తెలియవచ్చుచున్నది. మఱియు తురుష్కస్థానపు మహమ్మదీయరాజులు ఈ దేశముమీద పలుమారు దండెత్తి జనులను హింసించి వారి ద్రవ్యమును అంతయు అపహరించుకొని పోయినట్లు తెలియవచ్చుచున్నది.

హిందూదేశము ఈవిధముగా ఇతరదేశశత్రువులచేతనే కాక సముద్రమూలకముగాకూడ ఓడదొంగలచే కొల్లపెట్టబడుచుండెను. ఈ దేశమును పరిపాలించుచు వచ్చిన మహమ్మదీయ రాజులు సముద్రతీరమును ఓడదొంగలయొక్క బాధనుండి సంరక్షించుటకు చేసినప్రయత్నములన్నియు విఫలములయ్యెను.

మహమ్మదీయ చక్రవర్తులలో ఔరంగజేబు అనువారు అరాబియాదేశములోనుండు మక్కా అనుపట్టణమునకు యాత్రచేయు మహమ్మదీయులను శివాజియొక్క హింసలోనుండి విడిపించుటకు ఎంతో ప్రయత్నించెను. ఈ ప్రయత్నముల చేత ఓడదొంగలను నిర్మూలము చేయుటకు సాధ్యము లేకపోయెను. కొన్ని సమయములలో ఈ ప్రయాణీకులను రక్షించుటకు పంపబడిన నావికులే ఓడదొంగలై వారిని హింసించుచు వచ్చిరి. దీనిచేత సముద్రమూలకముగా హిందూదేశమునకు ఎక్కువ నష్టమును కష్టమును కలుగుచు వచ్చెను.

హిందూదేశములోనుండు స్వదేశరాజులలో ఐకమత్యము లేనందున ఒకరితో నొకరు పోట్లాడి అన్యదేశపు రాజులను సహాయము కోరినందున సహాయకారులుగా వచ్చిన ఈ అన్యదేశపురాజులు స్వదేశరాజులలో ఐకమత్యములేని విషయమును, బుద్ధితక్కువయును, బలహీనత్వమును బాగుగా తెలిసికొనిరి గాన వారు పెక్కుమారులు హిందూదేశములో ప్రవేశించుటకు కారణమాయెను.

బ్రిటీషువారి రాజ్యపరిపాలనమున ఈ దేశముయొక్క కష్టము లన్నియు తొలగిపోయెను. ఇప్పుడు ఎక్కడను నెమ్మది గలిగి జనులు సుఖముగా జీవించుచున్నారు, ఇప్పుడు హిందూదేశ మనునది ఇంతక్షేమముగా నుండుటకు ముఖ్యకారణము ఆంగ్లేయులచే హిందూదేశములో ఏర్పాటుచేయబడిన పలువిధ

ములగు బందోబస్తులే. ఏరాజ్యములోనైనను నెమ్మదికలుగజేసి పరిపాలన చేయుటకును నాలుగు విధములైన సాహాయ్యములు కావలెను.

(1) భూమిమార్గముగవచ్చు అన్యదేశపు శత్రువులను ఆటంకపరుచుటకు ఒక సాహాయ్యము (2) సముద్రమార్గముగా కలుగుకష్టములను నివర్తించుటకు ఒక సాహాయ్యము (3) దేశములోకలుగు కలహాములు మాన్పుటకు ఒకసాహాయ్యము (4) ప్రజలందరు రాజవిశ్వాసము గలవారై యుండుట. ఈ నాలుగువిధములైన సాహాయ్యమును ఏరాజ్యములో నున్నవో ఆరాజ్యము బాగుపడి అందఱిప్రజలు సుఖము అనుభవింతురనుటకు సందేహాము లేదు.

ఇండియావిషయమున ఈ నాలుగు విధములైన సహాయములు గలిగి ఉన్నవాయని పరిశీలన చేయుదము. మొదటిది భూమిమార్గముగా వచ్చు ఇతరదేశ శత్రువులు—వీరిని ఆటంకపరచుటకు గవర్నమెంటువారు కావలసినంత సైన్యమును ఇండియాలోను ఇంగ్లాండులోను సిద్ధముగాపెట్టియున్నారు. ఈ దేశపుసైన్యమునందు ఇంగ్లీషు సోల్జర్లును స్వదేశ సిపాయిలును గలరు.

1857 సంవత్సరములో జరిగిన గొప్ప కలహామునకు పిదప ఇంగ్లీషువారిసైన్యములో అనేక విధములైన మార్పులను జేసినారు. ఇప్పుడు హిందూదేశములోని బ్రిటిష్ సైన్యమున

సుమారు 75000మంది ఇంగ్లీషుసిపాయిలును(సోల్జర్లు) రెండింతలు స్వదేశి సిపాయిలును ఉన్నారు. ఎప్పుడును ఇంగ్లీషు సిపాయీలు శీమలోనుండే రప్పింపబడుచున్నారు, హిందూదేశములోనుండు అనేక తెగలవారు స్వదేశసిపాయిలుగా ఏర్పడియున్నారు. పటాన్ జాతీయులు, గుర్కాలు. సిక్కులు. (Sikhs) ఇటువంటి మిక్కిలి ఘోరయుద్ధము చేయగలవారుకూడ సైన్యములో నున్నారు. వీరు మిక్కిలి బలవంతులు. ఈ కారణమును బట్టియే ఆంగ్లేయసైన్యము మిక్కిలి బలిష్ఠమైనదని చెప్పబడుచున్నది. ఈ సైన్యమంతయు ఇండియాగవర్నమెంటువారి పరామర్శలో నున్నది. ఈ సైన్యమునకు పైఅధికారియైన (Commander-in-chief) అనువారుఇండియా గవర్నమెంటుయొక్క కార్యదర్శకులలో నొకరు. వీరు ఈ సైన్యముయొక్క లోపములను అప్పుడప్పుడు ఇండియాగవర్నమెంటువారికి తెలియపఱచి సైన్యమును బలపరచుటకు కావలసిన ఏర్పాటులను చేయుచున్నారు. 1857 సంవత్సరమునకుముందు ఇంగ్లాండులోనుండి ఇండియాదేశమునకు ఆఫ్రికాఖండమును చుట్టుకొని సముద్రమార్గముగా రావలసియుండెను. గనుకఇంగ్లాండునుండిఇండియాదేశమునకు ఒకపర్యాయము రావలెనన్నచో సుమారు నాలుగుమాసములు పట్టుచుండెను. ఇప్పుడు సూయజుకెనాల్ ఏర్పడి యావిరి సహాయముచే నడుపబడు పొగయోడలు ఏర్పడినతరువాత ఈదేశమునకుసైన్యము కావలసినప్పుడు తంతి

మూలముగాసమాచారమునుబంపి రెండుమూడువారములలో రప్పించుటకు వీలు ఏర్పడియున్నది. 1857 సంవత్సరమునకు కొంతకాలమునకు మునుపే ఇండియాలో ఇనుపదారులు ఏర్పాటు చేయబడినవి. 1867 సంవత్సరములో ఈ దేశముననాలుగువందలమైళ్ల ఇనుపదారి ఏర్పడియుండెను. ఆకాలములో ఒక సైన్యమును కలకత్తా నగరమునుండి అలహాబాదుకు పంపుటకు రెండు లేక మూడు మాసములు పట్టును. ఇప్పుడన్ననో ఇనుపదారియొక్క సహాయముచే అదేదూరము ఒకరోజులో దాటవచ్చును. గనుకనే కలహమునుసది హిందూదేశమును విడిచి పారిపోయినది.

ఇదియునుగాక హిందూదేశములోనుండు స్వదేశరాజ్యమును 93000 సంఖ్యగల సైన్యమును రక్షించుచున్నవి. బ్రిటీషువారికి ఈసైన్యముయొక్క సాహాయ్యము కావలసినప్పుడు స్వదేశరాజులు దానిని బ్రిటీషువారి స్వాధీనములో బెట్టుటకు ఒప్పుకొని యున్నారు. అవశ్యమైన కాలములయందు ఈసైన్యము బ్రిటీషువారి సైన్యముతో కలిసిపనిచేయును. గవర్నమెంటు వారుకూడా వారిసైన్యమును విభజించి అనేక స్థానములయందు ఉంచియున్నారు. ఫిరంగి తుపాకి మొదలైన ఆయుధములు వారివద్ద సిద్ధముగా నున్నవి. లెక్కలేని ఆయుధములను సీమనుండి స్వల్పకాలములో తెప్పించగలరు. హిందూదేశమునకు ఇతరదేశపు శత్రువులైనను దేశములోనుండు శత్రువులైనను

అన్ని విధములయందును సిద్ధముగనుండు సైన్యము ఉండగా ఏవిధమునను తొందర పెట్టలేరుగదా!

రెండవశత్రువులుసముద్రపుమార్గమునవచ్చువారు:—వీరి నుద్దేశించి గవర్నమెంటువారు చేసియుండు ఏర్పాటులను విచారింతము. సుమారు 300 సంవత్సరములకు ముందు మొట్ట మొదట ఆంగ్లేయులు ఒక చిన్నవర్తక సంఘముగా హిందూ దేశమునకు వచ్చిరి. అప్పుడువారు ఆఫ్రికాఖండమును చుట్టు కొనియే రావలసివచ్చెను. అప్పుడు ఓడలయాత్రలలో వీరికి విశేష అనుభవములేదు. ఆకాలములో పొగయోడ అనునది లేదు. సాధారణ యోడలుగూడ మిక్కిలి చిన్నవిగా నుండెను. ఈ ఓడలు నడపించుటకు వాయుదేవునియొక్క కృపను ఎదురు చూడవలసి యుండెను. గాలినినమ్మి ఓడలు నడుపుచుండు కాలములో హఠాత్తుగా దైవవశమున అది ఎదురు దిక్కుగా వీవ నారంభించిన యెడల జేరవలసిన స్థలమును చేరలేక మఱియొక స్థలమునకు పోయి చేరుచుండిరి. పొగయోడలు ఏర్పడిన తరువాత సముద్రప్రయాణములో ఇట్టికష్టములు బొత్తిగా తొలగి పోయినవి. ఇప్పుడు ఇంగ్లీషు ఓడలు సముద్రమున అన్నిప్రక్కలను సంచరించుచున్నవి. ఓడ ఒకటింటికి సుమారు 1½ కోటిరూపాయలు ఖర్చుచేసి 350 అడుగుల పొడవు 75 అడుగుల వెడల్పుగలిగి 140000 పుట్ల భారము మోయగల అనేక ఓడలు ఆంగ్లేయులయొక్క స్వాధీనములో నున్నవి. ఈగోడలకుగల ఇను

పకవచము 18 అంగుళముల మందము గలది. వీనిలో కొన్నిటి యందుఫిరంగి మొదలగు యుద్ధాయుధములను అమర్చియుంచి సముద్రము మీద యుద్ధము చేయుటకు సిద్ధముగా నుంచు కొనియున్నారు. ఇటువంటిఓడలున్నవని తెలిసినతోడనే ఓడ దొంగలు మొదలగువారు చెప్పక పారిపోవలసిన వారేకదా.

మూడవశత్రువు దేశములో కలుగు కలహము—ఈ దేశము సుమారు 150 సంవత్సరములకు ముందు హైదరు. మొదలగు కొల్లగాండ్రచేతను, తగ్సు (Thugs) అనగా దోవలలో కాచియుండి చంపెడి దొంగలు పిండారీ (బందిపోటు) దొంగల సమూహముచేతను ధ్వంసము చేయబడుటచే దేశమువారికి కలుగునష్టములుఉపద్రవములుఎన్నశక్యము కాక యుండెను. భయమనెడిపిశాచదేవత వారిని ఎప్పుడుఆవేశించి యుండెను. కొన్నిగ్రామములయందు (Look out) 'చూపు స్తంభము' అని చెప్పబడు ఒకపెద్దస్తంభమునునాటిదానిపైని ఒకచిన్న ఇంటిని నిర్మించుకొని అందులో ఒకమనిషి సిద్ధముగా నుండి కొల్లగుంపువారు వచ్చుచున్నారా యని మిక్కిలి భయముతో చూచుచుండెడివాడు. దొంగగుంపులు వచ్చుచున్నట్లు తెలియగానే ఆగ్రామస్థులు వారి సొత్తులు ఎక్కడనున్న అక్కడనే విడిచిపెట్టి ప్రాణములను కాపాడుకొనుటకు మిక్కిలి కలవరముతో నలుదిశలకు పరుగెత్తుదురు. ఇప్పుడుఇటువంటి ప్రమాదములనుగాని కొల్లలనుగానిఎక్కడను

కనము, వినము సరేగదా, చివరకు తలచనైన తలచము. ప్రతి గ్రామములోను పట్టణములోను వీధులయందు ఒక పోలీసుబంట్రోతు సదా పారా యిచ్చుచుండుటను చూచుచున్నాము. పోలీసుసిబ్బంది విశేషముగా ఏర్పడియున్నది. దీనిలో కావలిపనిచేయుటకు ఏర్పడియుండువారు అందఱునుస్వదేశీయులే. స్వదేశీయులలో దృఢగాత్రులును ధైర్యశాలురునుమాత్రమే ఈసిబ్బందితో చేర్పబడియున్నారు. వీరలు కవాతులోను తుపాకి ఉపయోగించుటలోను, కొందఱు గుర్రపు స్వారిచేయుటలోను బాగుగా తేరినవారు. వీరలు కొన్నిగుంపులుగా ఏర్పడి ఆయారాజధాని గవర్నమెంటువారి ఆధీనములో నున్నారు. వీరియొక్క పనులను గుఱించియు అధికారములను గురించియు మూడవ అధ్యాయమున విశదముగా చెప్పియున్నాము. ఇప్పుడు హిందూదేశములో 700000 పోలీసు సిబ్బంది గలదు.

సైన్యము పోలీసు వీటికి గవర్నమెంటువారు కోట్లకొలది ద్రవ్యము ఖర్చుచేయుచు వ్యర్థముగా ఉంచినారనియు, పోలీసువారు జనులను హింసించి లంచముతీసికొని బ్రతుకుచున్నారనియు, వీరివలన జనులకు ఏవిధమైన ఉపయోగములు లేవనియు తెలియనివారుకొందఱు చెప్పుచున్నారు. ఇది తప్పు అభిప్రాయము. వీరియొక్క సహాయమువల్లనే ఇండియా జనులు శత్రువులవల్లగాని కలహకారులవల్లగాని, దోపిడికాండ్రవల్లగాని బాధలులేక సుఖముగా జీవించుచున్నారు. ఈ

మధ్య బొంబాయి, కాకినాడ, తిరునెల్వేలి మొదలగుస్థలముల యందు జరిగిన కలహములను ఆపివేయుటకు పోలీసువారును పటాలములును ఎంతసహాయకారులుగా నుండిరో మనము విని యున్నాముగదా. పటాలముగాని, చాలినంత పోలీసుసిబ్బంది గాని లేనందువల్లనేగదా రెండేండ్లక్రింపట కోటప్పకొండ తిరుణాళ్లలో జరిగినకలహమందు అనేకులు మృతులగుటకు కారణ మయ్యెను.

నాల్గవసహాయము రాజవిశ్వాసముగల ప్రజలు:— పై చెప్పబడిన మూడువిధములగు సహాయము లున్నప్పటికి జనులు రాజవిశ్వాసము లేనివారైనచో రాజ్యమువారికిని జనులకును మనసులు కలియకయుండును. ఇందువల్ల వారిజీవితకాలము సుఖదాయకముగా నుండదు. రాజవిశ్వాసముగలవారైన ఎడల వారు దేశమునకు పలువిధములుగా మేలుచేయగలుగుదురు. అట్టివారికి చట్టములకు లోబడినడుచుకొనుట అనునది మిక్కిలి ప్రియమైనకార్యముగానే యుండునుగాని కష్టముగా నుండదు. చట్టములు నిషేధించునట్టి లంచము మొదలగువానికి లోబడక వారివారివిధులను చేయప్రారంభించి వారలకును ఇతరులకును సహాయభూతులుగానుండి రాజ్యాంగమునకు సహాయకారులగుదురు. జనులు వారివిధులను చేయుచు రాజవిశ్వాసముగలవారై నడుచుకొనినచో కాలక్రమమున పోలీసుపటాలము మొదలగువాని యావశ్యకత క్రమముగా తగ్గుటయేగాక

తుదకు ఇవన్నియు బొ త్తిగాతీసివేయఁబడు ననుటకు సందేహము లేదు. కాబట్టి ఈపోలీసుసైన్యములను, పటాలములను గవర్న మెంటువారు ఆదరించుటచే హిందువులు వ్యర్థముగా ఎక్కువ పన్ను ఇవ్వవలసి వచ్చినది అను తలంపును మనస్సులో నుంచక స్వల్పద్రవ్యమును పన్నుగా నిచ్చుటచే మనోవిచారములేకుండ సుఖముగా జీవించుచున్నామను తలంపుతో ప్రతివారును రాజ్యాంగమువారి యెడల విశ్వాసముగలవారుగానుండి, వారిశక్తి కొలది సహాయముచేయ మనస్సుగలవారై యుండవలెను.

## VI. వ్యాపారము, చేతిపనులు.

వెనుకటిఅధ్యాయమున చెప్పినప్రకారము హిందూదేశము పలువిధములైన తొందరలకు లోబడియుండు కాలమునందు జనులు వారియొక్క ఆభరణములను గుఱించియు వారి ఇతరసొత్తులను గుఱించియు సదా చింతాక్రాంతులై విశ్రాంతి లేకయుండిరి. వారికిని ఇతరులకును మేలును గలుగజేయు వ్యాపారములను గుఱించి యైనను చేతిపనులనుగుఱించి యైనను యోచించుటకు అవకాశమే లేదయ్యెను. ఇప్పుడు దేశసంరక్షణనిమిత్తము బ్రిటీషు గవర్నమెంటువారిచే నెలకొల్పబడిన పలువిధములగు కట్టుదిట్టములవలన ప్రజలకు గాని సొత్తులకు గాని ఇతరులవలన ఏవిధమైన సంకటములు కలుగవను ధైర్యమును నమ్మకముగా గలిగి ఇతరపనులను గూడ నిశ్చింతగా జరుపఁ బూనుకొనుటకు అవకాశము గలిగియున్నది.

ఈదేశముయొక్క నైసర్గికస్వరూపములను బాగుగా తెలిసికొన్నవారు ఇది వ్యవసాయమునకు తగినట్టి దేశ మని చెప్పుదురు. ఉత్తరభాగమునందు హిమాలయపర్వతములలో ఎప్పుడును జలపూరితములైన మూడు గొప్పనదులు ఉత్పత్తియై ఉత్తరహిందూదేశము యావత్తును జలభరితముగా చేయుచున్నవి. మధ్య ఇండియాలో వింధ్యపర్వతములయందును, దక్షిణఇండియాలో తూర్పు కనమలలోను, పడమటి కనమలలోను, నైరుతివాయవ్యమూలల వాన గాడ్పులచే కురియునట్టివర్షముచేత అనేకనదులు వెల్లువలుగా ప్రవహించుచు మధ్య దక్షిణ హిందూదేశములను జలలోపము లేకుండ పోషించుచున్నవి. ఈజల వసతులచేతనే పూర్వకాలమునందు అన్యదేశస్థులు హిందూదేశములో ప్రవేశించుటకు మునుపును దేశముయొక్క జనసంఖ్య ఇప్పటికంటె తగ్గుగానుండు కాలములోను జనులు ఏవిధమైన లోపములు లేకుండ సౌఖ్యముగా జీవించుచుండిరని చరిత్రవలన తెలియుచున్నది. ఆకాలములో జనులు వ్యవసాయమును మాత్రమే నమ్మియుండినందున వారికి ఏవిధమైన బాధలును కలుగలేదు. అయితే ఇప్పుడు హిందూదేశముయొక్కస్థితిఅంతయుబొత్తుగా మారిపోయినది. గ్రీకులు, పారసీకులు, తురుష్కులు, మహమ్మదీయులు, పోర్చుగీసు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు వీరు ఒకరి తరువాత ఒకరు, ఈదేశమునకువచ్చి కాపురము చేరిరి. ఇదియునుగాక హిందూ

దేశములో నుండు స్వదేశజనులయొక్క సంఖ్య క్రమక్రమము గా మునుపటికంటె ఇప్పుడు రెండింతలైనది. జనసంఖ్య ఇట్లు అభివృద్ధియగుటచే అనేక అడవిప్రదేశములు సయితము గ్రామములుగా మారియున్నవి. వర్షమును గుఱించి చెప్పనక్కరనే లేదు. మాసమునకు మూడువర్షములకు బదులుగా మూడుమాసములకు ఒక వర్షము కురియుటకూడ దుర్లభమైనది, కాన ఇక మీద వ్యవసాయమును మాత్రమేనమ్మికొనియుండుటచక్కని మార్గము కాదు. ఒక సంవత్సరము ఆకస్మికముగా వర్షములు క్రమముగ లేకపోయెనేని జీవించుమార్గము ఏదియు లేకజనులు కష్టపడవలసివచ్చుచున్నది. వ్యవసాయమును మాత్రమే నమ్మి యుండక జీవించుటకు వేరుమార్గములను వెదకుట మిక్కిలి ఆవశ్యకము. ఏదైననొకవిధమైన చేతిపనియందు గాని వ్యాపారము చేయుటయందుగాని నేర్పరులు కావలెను. వ్యాపారము చేయుటకు ఇపుడు అనేక ఏర్పాడియున్నవి.

పూర్వకాలమునందు ఒకయూరినుండి మఱియొక యూరికి పోవుటకు సరియైన బాటలు లేవు. ఇప్పుడు అనేక కంకర రస్తాలు వేయబడి ఉన్నందున బండ్లు సులభముగా ఎంతదూరమైనను పోగలిగియున్నవి. ఇనుపదారి మూలకముగా సామానులను ఒకచోటనుండిమఱియొక చోటికి పంపవచ్చును. శాస్త్రజ్ఞాన మభివృద్ధి అగుకొలది క్రొత్తక్రొత్త యంత్రములు ఏర్పడుచున్నందున ఎంత గొప్పపనులు అయినను స్వల్పకాలములో

ముగింపబడుచున్నవి. వాని కయ్యేడు వ్యయప్రయాసములును చాల తగ్గుచున్నవి.

ఈ దేశములో నుండు ధనవంతులు వారి ద్రవ్యమును పూడ్చిపెట్టక అన్యాయపువడ్డికిఇవ్వక ఏదైన నొకవ్యాపారము నకుగాని చేతిపనులకుగాని తమద్రవ్యమును మూలధనముగా ఉపయోగపఱచి వృత్తిపారశాలలను స్థాపింపవలెను. ఇప్పుడు దక్షిణహిందూదేశములో ద్రవ్యమును వ్యాపారమందు ఉప యోగపఱచు వారు నాటుకోటసెట్టులని చెప్పవచ్చును. వా రుకూడ వడ్డిబేరమును విడిచిపెట్టివృత్తిపాటశాలలను వ్యాపార పారశాలలను స్థాపించిన యెడల వీరిని చూచి ఇతరులుకూడ ఆరీతిగనే చేయుదురు. క్రమక్రముగా చేతిపనులును వ్యాపార మును వృద్ధి బొంది దేశమునకు క్షేమము కలుగును.

హిందూదేశమునుండి ప్రత్తి, నీలి, కలపసామానులు, తోళ్లు, మొదలగునవి ఇతరదేశములకు స్వల్పవెలలకుపంపబడు చున్నవి. అన్యదేశస్థులు ఈ సామానులు కొని చేతిపనుల యొక్క సాహాయ్యము చేతను, విశేషముగా యంత్రసాహా య్యము చేతను సొగసైన వస్తువులుగా మార్చి వానిని ఈదేశ మునకు పంపి ఇక్కడఎక్కువవెలలకుఅమ్ముచున్నారు.హిందువు లు వీనినిఎక్కువక్రయమునకు కొనుచున్నారు. ఇండియాలో నుండి ఇతర దేశములకు పంపబడు ప్రత్తిమొదలగు వస్తువులను ఈదేశములోనే చేతిపనులయందు ఉపయోగించి సామానులు

ఏల చేయగూడదు? దీనికి ముఖ్యకారణము ఐకమత్యము లేక పోవుటయే. మూలధనము లేకపోవుట రెండవకారణము. కరువులకును వ్యాధులకును లోబడిన ఈ దేశములోని ప్రజలువ్యవసాయమునే నమ్మి ఇతరవిధములైన ప్రయత్నములను చేయ తలంచక ఆకాశమును చూచుచు వర్షము తప్పిపోయినప్పుడు చేతులను గట్టిగాపూనుకొని పిచ్చిపట్టిన వారివలెనుండుటచే ఏవిధమైన ప్రయోజనమును లేదు.

ఆంగ్లేయ దొరతనము వారిచే వ్యాపార విషయములోను చేతిపనుల విషయములోను హిందూదేశమునకు చేయబడియుండు సాహాయ్యములు అనేకములుగా నున్నవి. మునుపు హిందూదేశమునకు నేలబొగ్గు ఇతరదేశములోనుండి దిగుమతి అగుచుండెను. ఇప్పుడు అన్యదేశస్థుల పెట్టుబడి ధనముయొక్క సాహాయ్యముచే బంగాళాదేశములో నుండు గనులయందుండి నేలబొగ్గు త్రవ్వి తీయబడి ఈ దేశములో అనేకస్థలములయందు ఉపయోగింపబడుచున్నది. ఇదియుగాక ఈ దేశములో అనేక స్థలములయందు ఇనుము చిక్కుచున్నది. ఇనుము నేలబొగ్గు ఈ రెంటిచే పార, గడ్డపార, కత్తి, మొదలగు పనిముట్లును, మానిక, తప్పా, పడి మొదలగు కొలపాత్రలును, మేకులు గొడిములు, ఆడుబందులు, మొదలగు ఇంటిసామానులును, కట్టడమునకు కావలసిన సామానులునుచేయ వచ్చును. పెట్టుబడి ధనము లేదని చెప్పుటవల్ల ప్రయోజనము

లేదు. ద్రవ్యము గలవారు మొట్టమొదట ఇటువంటి పనులను ప్రారంభించవలెను. దినక్రమముగ ఇటువంటి ప్రయత్నములు లాభకరములుగా నుండును. మైసూరులో నుండు బంగారు గనులయందుండి మైసూరు గవర్నమెంటువారు ఒకకాసు ఖర్చు లేకుండ ఒక సంవత్సరమునకు 10 లక్షలరూపాయల వఱకు లాభమును పొందుచున్నారు. ఇదియునుగాక అనేకులు కూలివాండ్రు సుఖముగా జీవించుచున్నారు. ఇవన్నియు ద్రవ్యమును వ్యాపారమునకుగాని చేతిపనులకుగాని పెట్టుబడి ధనముగా ఉపయోగించి ధైర్యముతోను పట్టుదలతోను పనిచేయుటచే కలుగు లాభములగును.

నీలగిరి కొండలయందును నైనాడు ప్రదేశములయందును జరుగు కాఫీ, తేయాకు వ్యాపారములను మఱియొక ఉదాహరణముగా చెప్పవచ్చును. ప్రత్తివ్యాపారమును దాని సంబంధమైన చేతిపనులును రానురాను వృద్ధి యగుచున్నవి. ఇప్పుడు నీటియావిరియొక్క సహాయముచే పనిచేయు దూదియంత్రములు ఇండియాలో సుమారు 150 వరకున్నవి. ఇంతేకాక $1\frac{1}{2}$ కోట్లజనులును, 70 వడ్లుదంచు యంత్రములు ఇండియాలో పని చేయుచున్నవి. అనేక ఇనుపసామానులు చేయుఫ్యాక్టరీలును, తోలు (చర్మము) గిడ్డంగులును, పొగచుట్టల గిడ్డంగులును ఏర్పడి వీనిచే వేలకొలది జనులు జీవించుటకు అవకాశము గలిగియున్నది. పట్టువ్యాపారమును దానికి సంబంధించిన చేతిపనులును వృద్ధియగుచున్నది.

1840 సంవత్సరములో భూమి, సముద్రము ఈ రెంటి మీాద జరిగిన వ్యాపారముయొక్క మదింపు 60 కోట్ల రూపాయలుగా నుండెను. 1908 సంవత్సరమున 275 కోట్ల రూపాయలకు హెచ్చియున్నది. దీనిచే వ్యాపారము వృద్ధి అగుచున్నదని తెలియుచున్నది. హిందువులు ఎక్కువ పట్టుదలతో ఈ వ్యాపారమునందు పని చేయవలెను. ఈదేశములో విశేషముగా దక్షిణ హిందూదేశమునందు అనేకులు సర్కారు ఉద్యోగములుచేయుటకు ఇష్టపడు చున్నారు. హిందూదేశములో నుండు ఈసర్కారు నౌకర్లసంఖ్య ఒక లక్షకంటె ఎక్కువ అయినను, ఒకగుడ్డ నేతవంటి చేతిపని యొకటియే అనేక లక్షలజనులకు జీవనాధారమై యున్నది.

## Co-operative Societies.

ఈ అధ్యాయముయొక్క మొదటిభాగములో ధనవంతులు వ్యాపారశాలలను, చేతిపనుల శాలలను, ప్రారంభించి ఆదరించ వలయునని చెప్పియుంటిమి, ఇప్పుడు అటువంటివారికి కావలసిన మూలధనమును ఒక్కరే పెట్టుకొనక పలువురుచేరి పెట్టుబడిధనమును ఏర్పాటుచేయుటవల్ల కలుగు లాభములు వివరింపబడును.

సాధారణముగా వ్యాపారములో యజమానుడనియు, నౌకర్లనియు, కూలివాండ్రనియు, మూలధనము నిచ్చినవాడని

యు ఇట్లు ఏర్పడి వ్యాపారము జరుగుచున్నది. యజమానులు నౌకర్లకు జీతము లిచ్చి మిగత బాగములో మూలధనమునకు వడ్డిచెల్లించి ఇవన్నియుపోగా మిగిలియుండు మొత్తములనులాభముగా గ్రహించుచున్నారు. ఇట్లు లేక యజమానుడు నౌకర్లయొక్క పనినికూడ తానేచేసిన యెడల నౌకర్ల జీతమును వీరి లాభముతో చేరును. ఈ ఏర్పాటులో యజమానులే నౌకర్లుగాను, యజమానులుగాను ఉండవలెను. బాగుగ పని చేయ నేర్చిన కొందరు కొద్దిగా మూలధనమును పెట్టుకొని వారి వారి సమర్థతకు తగినట్లుగా ఒకపనిని ఒప్పుకొని ఆపనిని బాగుగా చేసినయెడల వారి కష్టమునకు కూలియు వ్యాపారముయొక్క లాభమును వారికే చేరును. ఇటువంటి వ్యాపారశాలలును చేతిపనుల శాలలును అమెరికా, ఐరోపాఖండములయందు బలముగా ఏర్పడి జరుగుచున్నట్లు పుస్తకముల మూలకముగాను వార్తా పత్రికల మూలకముగాను తెలియవచ్చుచున్నవి. ఈ ఏర్పాటులలో ఒక లాభమున్నది. పెట్టుబడి ధనము ఇచ్చువానికి వ్యాపారశాలాసంబంధమైన ఏదైన నౌక పని తెలిసియుండవలెను. ఈలోపము లేకుండ ఇటువంటి సంఘములను ఏర్పాటు చేయవచ్చును కొందఱు జనులు కలిసి కొద్దిగా మూలధనమును పెట్టుకొని ఏదైన నౌక వ్యాపారమునుగాని చేతిపనిని గాని ప్రారంభించి నౌకర్లయొక్క సహాయముచేత జరుపవచ్చును. ఆ నౌకర్లకు వారువారుచేయు పనులను బట్టి ప్రతినెలకును జీత మిచ్చి

తరువాత లాభమును మూలధనము ఇచ్చినవారంటాఖ, వారి వారి మొత్తములకు సరిగా భాగించుకొన వచ్చును.

ఇటువంటి శాలలయందు జరుగు వ్యాపారము రొక్క వ్యాపారముగా నుండవలెను. అప్పు ఇవ్వకూడదు. సంఘములో చేరిన మెంబర్లకు మాత్రమేగాని ఇతరులకు సామానులు అమ్మ కూడదు. ప్రతిరోజును అమ్మబడు సామానులయొక్క క్రయము ను ఒకటిగాచేర్చి శాలకు కావలసిన సామానులను రొక్కమి చ్చి కొనవలెను. ఈరీతిగా సామానులను కొనుటచే అవి శ్లా ఘ్యమైనవిగాను నయముగాను ఉండును. మూలధనమును క్రమక్రమముగా వృద్ధిపఱచుటకు సాధ్యమగును. మూలధమున వృద్ధియైనచో వ్యాపారము బలమగును. సంఘమువారికి కావ లసిన అన్నివిధములైన సరకులను సామానులను అప్పుడప్పుడు ప్రోగగు మూలధనమును పెట్టి మరల మరల కొనుటకు సాధ్య మగును. సామానులను మూలధనమును, లాభమును, కాల క్రమమున వృద్ధియగును. పై చెప్పబడిన లాభములే కాకుండ సంఘములోని సభ్యులకు ఒక్కొక్కరికి లభించు లాభము వా రికి ప్రోత్సాహము గలిగించి వారిని ఎక్కువ పట్టుదలతో పని చేయునట్లు చేయును. ఇందువల్ల వారు తమ మూలధనమును వడ్డియును వృద్ధియగు మార్గమును వెతుకుచుందురు.

రొక్కవ్యాపారము చేయుటచే అప్పులు వసూలుచేయ వలసిన యావశ్యకత లేనందునను, సామానులు అప్పుడప్పుడు

అమ్మబడుటచేతను రొక్కము అప్పటికప్పుడే చేతికి వచ్చుటచే తను, స్వల్పమూలధనములో గొప్పవ్యాపారముచేయవచ్చును. రొక్కమిచ్చి కొనుటవల్ల మొదటిరకము సామానులను చవుకగా కొనవచ్చును. అప్పుతీసి వ్యాపారము చేయుటవల్లకలుగు నష్టములు దీనిలో లేవు.

పెట్టుబడి ధనమునిచ్చువారును ఈ విషయముల నన్నిటిని బాగుగ గమనించి వారియొక్క మూలధనమును వృద్ధిచేయుటకు అనేక విధములయిన చేతిపనులు శాలలుగాని లేక ఇటువంటి సంఘవ్యాపారశాలలనుగాని అనేక స్థలములయందు ఏర్పాటుచేసి భాగస్వాములను అక్కడక్కడ కూర్చి శాలలను స్థిరపఱచి కాలక్రమమున వృద్ధిపఱచ వచ్చును. ఇటువంటి పనులచే కలుగు లాభమువల్ల జనులకు ఉపయోగకరములైన అనేక ఇతర పనులను చేయవచ్చును.

ఇటువంటి సంఘవ్యాపారములలో కొన్ని సమయముల యందు ఒకవిధమైన లోపముకలుగుటగలదు. అదేమనగా, మూలధనమును ఇచ్చువారు వ్యాపారశాలలో పనిచేయుమనుష్యుల కు జీతము మాత్రము ఇచ్చి లాభములో ఏవిధమైన సంబంధము ను వారికి లేకుండునట్లు చేయుచున్నారు. ఇట్లుగాక శాలలో పనిచేయు వారికిగూడ లాభములో కొంతపాలు వారివారి జీతములను బట్టి ఇచ్చుచుండిన యెడల ఆ నౌకర్లు ఎక్కువ శ్రద్ధతో పనిచేసి వ్యాపారమును వృద్ధి బొందించుటకు ప్రయత్నింతురు.

పైన చెప్పిన ప్రకారము హిందూదేశములో నుండు కొందఱు ధనవంతులు ఒకసంఘమును ఏర్పఱచుకొని వ్యవసాయ విషయమునకు కావలసిన పనిముట్లను రప్పించుకొని, కూలీలను ఏర్పాటుచేసి, పని చేసినయెడల దేశమునకు విశేషక్షేమము గలుగును. ఈ రీతిగా చేయబూనుకొనువారు పనియందు శ్రద్ధగలవారుగా నుండిననేగాని వ్యాపారము వృద్ధి యగుటకు అవకాశ ముండదు. ఇతర పనులయందు శ్రద్ధ ఎంతముఖ్యమో వ్యాపారమునందును అంత ముఖ్యము.

## సేవింగ్సు బ్యాంకి.

పైన చెప్పబడిన వ్యాపారశాలలలోను, చేతిపనులశాలలలోను, పనిచేయు స్వల్పజీతగాండ్రకును, ప్రతిరోజుపనిచేసి దినకూలిచే జీవించువారలకును ఏదైన నొక శుభకార్యము తటస్థించి కొంతమొత్తము అప్పు కావలసివచ్చినప్పుడు స్థిరాస్తిలేనివారుగాన వీరలను నమ్మి ఎవ్వరునుఅప్పుఇవ్వరు. ఎవరైననొకరు అప్పుఇచ్చుటకు సమ్మతించినప్పటికిని వారు ఎక్కువవడ్డి కోరుదురుగదా : దీనిచే ఈ బీదజనులు అధిక నష్టములకును కష్టములకును లోనగుదురు.

ఇటువంటి కష్టములకు లోనుగాక యుండుటకును, వలసిన ద్రవ్యములు పొందుటకును ఒకమార్గము కలదు స్వల్పజీతమున జీవించు వారందఱును ఒక సంఘమును ఏర్పాటు

చేసికొని ఆసంఘములో మెంబర్లు కావలెను. ప్రతివారును వారికి మిగిలిన పైకమును ఆసంఘముయొక్క నిధిగా ఏర్పాటుచేసి ఆనిధిని ఒకధనవంతునివద్దనో లేక మఱియొకఖ్యాతి చెందిన నిధిలోనో ఉంచవలెను. ఈ సంఘముయొక్క మెంబర్లలో ఎవరికైనను కొంతపైకము కావలసివచ్చినప్పుడు వీరు ఏర్పాటుచేసిననిధిలోనుండు మొత్తమును చూపియైనను లేక ఆనిధిలో భాగస్వాములుగానుండు ఇతర మెంబర్లలో నొకరియొక్కజామీనుమీదనైనను స్వల్పవడ్డీతో అప్పుతీయుటకు వీలగును. ఈరీతిగా చేయుటవలన తక్కువవడ్డీకి పైకము చిక్కుటయే అప్పు గాక శీఘ్రముగా తీర్చివేయుటకు మార్గమును ఏర్పడును. స్వల్పజీతగాండ్రు ఐకమత్యముచేత ఇటువంటి సేవింగ్సు బ్యాంకును స్వంతముగా ఏర్పాటు చేసికోవచ్చును. ఇటువంటి నిధులకు మెంబర్లను ఏర్పాటుచేయు కాలములో ఎక్కువజాగ్రత్తలో నుండవలెను. మెంబర్లు యోగ్యులుగాను, ఒప్పుకొన్న ప్రకారము పైకము వాపసు చేయగలవారుగాను, ఒకటేపట్టణములో నివసించువారుగాను ఉండవలెను.

ఇటువంటి నిధులు దైవికముగా కలుగుకొన్నినష్టములకు తప్ప గొప్ప నష్టములకు లోబడక బీదజనుల కనేకులకు గొప్పసహాయముగా నుండును. ఇటువంటి సంఘములయొక్క మూలధనము వృద్ధికానుకాను దానితో సంఘవ్యాపారములు ఏర్పాటుజేసి ఎక్కువలాభమును పొందవచ్చును. ఈపనులన్నిటికి

ఐకమత్యము, పట్టుదల, మొదలగు మంచిగుణములు అవశ్యముగా నుండవలెను. ఐకమత్యముగలవారు కూడినంత శీఘ్రముగా ఇటువంటి ఏర్పాటులచే ధనవంతులుగాను మూలధనము గలవారుగాను, గొప్పవ్యాపారములు చేయువారుగాను, ప్రాబల్యము గలవారుగాను, పరోపకారులుగాను అగుదురనుటకు సందేహము లేదు.

పైన చెప్పబడిన కష్టములను తెలిసికొని గ్రామములోను, పట్టణములయందును ఉండు బీద జనులయొక్క స్థితిని గూడ కనిపెట్టి వారివారి స్థితికి దగినట్లుగా నిధులను ఏర్పఱచుకొనుటకొరకు 1904సంవత్సరములో కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీల ఆక్టు (Co-operative Credit Socities Act) అను చట్టమును ఏర్పాటు చేసినారు. సర్కారు ఉద్యోగస్థులకు అప్పుడప్పుడు సంభవించు కార్యములకు కావలసిన పైకము లభించక పోవుటచే వారు పడుపాట్లు ఒకరీతిగా నివర్తికావింప నుద్దేశించి 'జనరల్ ప్రావిడెంటు ఫండు' అను నిధిని ఏర్పాటుచేసినారు. ఈ నిధిలోచేరు ప్రతి ఉద్యోగస్థుడును వాని జీతములో వీసమునకు తక్కువలేకను, పరకభాగమునకు ఎక్కువలేకను ఉంచవచ్చును. ఈ మొత్తమును సర్కారువారే వసూలుచేసి సంవత్సరమునకు నూటికి నాలుగు వంతున వడ్డీకి వడ్డి కలిపి ఇచ్చునట్టుగా ఏర్పాటు చేసియున్నారు. ఇదియుగాక వ్యవసాయమునకు కావలసిన పనిముట్లను కొనుటకును, బావులు

త్రవ్వుటకొరకును, జనులకు అప్పుఇచ్చి సహాయముచేయుటకును 'అగ్రికల్చరల్ లోన్సు' (Agricultural Loans) అని చెప్ప బడు ఒకనిధి వ్యవసాయమున జీవించు బీదకాపులకొఱకు ఏర్పాటు చేసియున్నారు.

## VII. నాణెములు, టంకసాలలు.

పూర్వకాలమునందు ఒకనికి ఏదైన నొక పదార్థముకా వలసినప్పుడు వారివద్దనుండు ఇతరవస్తువును తనకు కావలసిన వస్తువునకు మారుగానిచ్చి యావస్తువునుగొనుట సాధారణమై యుండెను. నాగరికత ఎక్కువకానుకాను ఈ పద్ధతి మంచిది కావని తోచెను. ఒకనివద్ద ఒకవస్తువు అపరిమితముగానుండ వచ్చును. అట్టివస్తువును కోరువారలకు ఇచ్చి ఇతర వస్తువు లను వారివద్ద మారుగా తీసికొనుట వాడు ఇష్టపడవచ్చును. అయితే వారికికావలసిన పదార్థము వారివస్తువులకు మారుగా తీసికొనువారివద్ద లేక పోయినను లేకపోవచ్చును. ఇటు వంటి ఇబ్బందుల నివర్తింపజేయుటకు ఇప్పుడు చెలామణియగు రూపాయవంటి ఒకటే విలువగల ఒకవస్తువు ఉండినయెడల ఆవ స్తువు మూలకముగా మనకు కావలసిన పదార్థములను ఏయి బ్బందియును లేక మనకిష్టమైనచోట కొనుగోలు చేయవచ్చును. ఇట్టి సౌకర్యముకలుగజేయుటకై ఇపుడు అన్నిదేశములయందు ను రూపాయవంటి నాణెములును, అంతకంటె చిన్నవియు పెద్దవియునైన నాణెములును ఏర్పాటు చేసికొని యున్నారు.

(2) నాణెములను వేయునపుడు ఏనాణెమునకు ఏలోహము ఉపయోగింప వలెను ? దీనిని నిర్ణయించునపుడు గమనించవలసిన విషయములు కొన్నిగలవు. నాణెములు సదా వాడబడుచుండునవి గనుక అవి సులభముగా వంగిపోక గట్టిగా నుండవలెను. కొలత, మందిపు వీనిలో తగ్గనిదిగాను, రాశిలో నుండునపుడు సులభముగ విడదీయ సాధ్యమైనదిగాను ఉండవలెను. చూచినమాత్రముననే ఇతరవస్తువులకును దీనికిని వ్యత్యాసము విశదముగ కనబడవలెను. ఈ గుణములన్నియు గలవి బంగారు, వెండి. వీనికి తరువాతివి రాగి, కంచు.

(3) ఈలోహములను యంత్రముల సహాయమున నాణెములుగా ముద్రింతురు. నాణెముయొక్క ఒకప్రక్కన మనలను పాలించు రాజుగారియొక్కగాని లేక రాణిగారియొక్కగాని శిరస్సుమాత్రమైనను లేక విచిత్రములైన చిత్రరేఖలైనను ముద్రింపబడి యుండును మఱియొక ప్రక్కను ఆనాణెముయొక్క మదింపును, అది తయారు చేయబడినసంవత్సరమును, మఱికొన్ని చిత్రాలంకారములును ఉండును. ఈ నాణెములు, వానినిచేయుటకు కావలసిన లోహపదార్థముయొక్క ఖరీదుకంటె రాజుగారి ముద్రమహిమచే కొంచెము ఎక్కువఖరీదుగలవి అగును. దగా నాణెములు (Counterfeit Coins) సులభముగ చేయ వలవి కాక యుండుటకు మంచినాణెములో సూక్ష్మములైన గుర్తులు అనేకము లుండును.

(4) నాణెములు ముద్రించునపుడు గమనింపవలసిన విషయములు కొన్ని గలవు. నాణెముమీఁది ముద్రలు ఇతరులు సులభముగా మార్చి వేయుటకు వీలులేకయు నాణెములు తయారుచేయునపుడు వెండి బంగారులలో కలిపెడు రాగిమొదలగు తక్కువలోహపదార్థము ప్రతినాణెములోను ఒక్కటే రీతిగా నుండవలెను. ఉపయోగ పరచునపుడు అవి యెక్కువగా అరిగిపోకయు చూచుటకు లక్షణముగాను ఉండవలెను. నాణెములయొక్క నుదింపువానిలోనుండు లోహపదార్థముల ఖరీదుకంటె కొంచెమధికముగా నుండుటచే సర్కారువారే నాణెములు సిద్ధపఱచి దేశమునందంతట వ్యాపించునట్లు చేయవలెను. సర్కారువారుతప్ప ఇతరులు నాణెములు ముద్రించగూడదు. చెన్నపట్టణములో నుండినటంకసాలను తీసివేసి బొంబాయి, కలకత్తా ఈరెండు ప్రధాన పట్టణములయందు మాత్రమే ఏర్పాటుచేసి అచ్చట ముద్రించుచున్నారు. ఈటంకసాలలందుకూడ సర్కారువారికి నాణెములు కావలసినకాలములయందుమాత్రమే పనిజరుగునేకాని ఇతరకాలములయందు పని ఉండదు. ఇప్పుడు చెన్నపట్టణమున మింటుస్ట్రీటు Mint Street అని చెప్పబడు వీధికి ఆపేరువచ్చినందుకు కారణము మునుపావీధిలో టంకసాల ఉండినందుననే.

(5) ఈటంకసాలలు సర్కారువారి యాధీనములోనే ఉండవలెనన్నది అవశ్యమే. ఏలనగా ఇతరులు నాణెములు చేయుటకు

ప్రారంభించినయెడల వారు తక్కువజాతి లోహములను యెక్కువగా కలిపి జనులను మోసపుత్తురు. దేశము లన్నిటిలోను ఎప్పుడును నాణెములు ప్రభుత్వమువారిచేతనే ముద్రింపబడుచున్నవి. నాణెములను పరీక్షచేయుటలో సమర్థతగలవారిని ఏర్పాటుచేసి నాణెములు ముద్రించునపుడు ఏవిధమైన లోపములు కలుగకుండ జేయుటకు సర్కారువారికే సాధ్యమగును. తప్పు నాణెములను చేయువారికి కఠినదండన విధింపబడుచున్నది.

(6) నాణెములను రెండువిధములుగా భాగింపవచ్చును. (1) ఇంగ్లాండులో ఉపయోగింపబడునవి. (2) హిందూదేశములో ఉపయోగింపబడునవి. ఇంగ్లీషునాణెములలో పౌను, అరపౌను, ఇవి రెండును బంగారునాణెములు; షిల్లింగు, క్రౌను, అరక్రౌను, ఫ్లారిన్, ఆరుపెన్ని, మూడుపెన్ని, రెండుపెన్ని, వెండి నాణెములు. పెన్ని, పార్తింగు అరపెన్ని, ఇవి కంచునాణెములు. బంగారునాణెములలో 11 భాగములు బంగారును ఒక భాగము రాగియును, వెండి నాణెములలో 93 భాగములు వెండియును 7 భాగములు రాగియును అయియున్నవి. కంచు నాణెములలో 95 భాగములు రాగియు 4 భాగములు తగరమును 1 భాగము తుత్తునాగమును అయియున్నవి. ఇండియా నాణెములలో సవరన్, అరసవరన్ ఇవి బంగారునాణెములు. రూపాయ, అర్ధరూపాయ, కాలురూపాయ, పరకరూపాయ, ఇవి వెండి నాణెములు. నిక్కెల్ నాణెము ఒక

అణా. రాగి నాణెములు:—అర్ధణా, కాలణా, దమ్మిడీ. వీనిలో కూడ లోహ మిశ్రము పైనచెప్పినట్లు ఇంచుమించుగా ఒకటే రీతిగా నుండును.

1893 సంవత్సరమునకు మునుపు టంకసాలకు వెండిని దీసికొని పోయినయెడల నాణెములును, నాణెములను తీసుకొనిపోయినయెడల వెండియును, ఎత్తుకెత్తు ఇచ్చుచుండిరి. 1893వ సంవత్సరమున ఈయేర్పాటు మార్చబడినది. అదిమొదలురూపాయనాణెము దానిలోనుండు లోహముయొక్క ఖరీదుకంటెను ఎక్కువ ఖరీదున మదింపు చేయబడుచున్నది.

ఇప్పుడు ఒకరూపాయ 180 గ్రెయినుల తూనికగలిగి యుండవలెననియు, ఒకసవరన్ 15 రూపాయలకు సమాన మనియు తీర్మానింప బడియున్నది. తప్పు నాణెములను సర్కారు ఖజానాలో ఇచ్చినయెడల దానిని వారు రెండుగా నఱికివేసి వాపసు చేయుదురు. ఇంతేకాక ఆ నాణెములను చేసినవారిని కనిపెట్టి దండించుటకు ప్రయత్నింతురు. అరిగిపోయిననాణెములను ఇచ్చినపుడు వానినికూడ నఱికి తిరిగి ఇచ్చివేయుదురు.

తూనికగుండ్లు, మానికలు, పళ్లు, మొదలగు కొలపాత్రలు, గజముబద్ద, వీనిని సర్కారువారే పరిశీలించి ముద్రలువేసి హెచ్చు తగ్గులు లేకుండ జాగ్రత్తగా చేయించుచున్నారు. ఈ విధముగానే నాణెమునుకూడ ఒకకొలతగా నుపయోగింపబడు

చున్నవి. గనుక వానినిగూడ సర్కారువారే ముద్రింపవలసినది అత్యావశ్యకము

కరెన్సినోట్లు:—నాణెములను ఒకచోటనుండి మఱియొకచోటికి పంపుట మిక్కిలి కష్టమైన పనిగదా? ఈకష్టమును సాధ్యమైనంతవఱకు తగ్గించుటకునోట్లు ఏర్పాటుచేసియున్నారు.

పేపరుకరెన్సీ యిలాకాయొక్క ప్రధానాధికారికి హెడ్ కమిషనర్ అనిపేరు. వీరి వాసస్థానము కలకత్తా. ఈ పేపరుకరెన్సీకిగాను ఈదేశము కొన్ని భాగములుగా (సర్కిల్సు) విభజింపబడి యున్నది. ఈభాగములలో కలకత్తా, బొంబాయి, చెన్నపురి, రంగూను ఇవి ముఖ్యమైనవి. కలకత్తాసర్కిలు అనునది హెడ్ కమిషనర్ యొక్క అధీనములో నున్నది. తక్కిన మూడు సర్కిల్సులోను వేఱే కమిషనర్లు నియమింపబడియున్నారు. వీరలకు డిప్యూటీ కమిషనర్లు అనిపేరు. తక్కినవి చిన్న సర్కిళ్లు. అన్నియు పైచెప్పబడిన నలువురు కమిషనర్లకు లోబడియున్నవి. ప్రతి సర్కిలులోను ముఖ్యపట్టణమందు 'కరెన్సీఏజెన్సీ' అని చెప్పబడు ఒక ఆఫీసు స్థాపింపబడి యున్నది. ఈ ఆఫీసు అధికారికి "కరెన్సీఏజెంటు" అనిపేరు, వీరా సర్కిలు కమిషనరుకు లోబడినవారు. హెడ్ కమిషనరు ఇతర కమిషనర్లకును, కరెన్సి ఏజెంట్లకును, కావలసిన కరెన్సీ నోట్లను సప్లయి చేయుదురు. ఈనోట్లయందు హెడ్ కమిషనర్, కమిషనర్, డిప్యూటీ కమిషనర్, వీరలలో నెవరైన

నౌకరియొక్కగాని, లేక వీరిచే నుత్తర్వుపొందిన వారియొక్క గాని చేవ్రాలు ఉండవలయును. సర్కిలు కమిషనర్లు ఈదేశము యొక్క జమాఖర్చు లెక్కలపై అధికారియైన కంట్రోలరు జనరల్ యొక్క ఉత్తరువు ప్రకారము సర్కారు ఖజానాలకు కావలసిన కరెన్సీ నోట్లను సప్లయి చేయుచుందురు.

కరెన్సినోటు అనునది సాధారణ ప్రో నోటు పత్రము వంటిదే. ఈ నోట్లను పెట్టుకొని యుండువారికి వారు కోరు నపుడు దానిలో గుర్తింపబడియుండు మొత్తమును ఇచ్చుటకు సర్కారువారు ఉత్తరవాదులై యున్నారు. కరెన్సి నోట్లను తయారు చేయునపుడు ఒక్కొక్క దానికిని నెంబరు ఇచ్చి ఆనోటుయొక్క మొత్తమును జనులకు తెలియు నిమిత్తము, అరవము, తెలుగు, మళయాళము, కన్నడము, హిందూస్థాని, మొదలగు భాషలలో అక్షరములతోను, అంకములతోను ముద్రింతురు. నోట్లకు నాణెములవలె నిజమైన విలువ యొకటిగాను మదింపు విలువ వేరొకటిగాను లేక రెండును ఒకటిగానే యున్నవి. కరెన్సి నోట్లను సర్కారువారి కివ్వవలసిన పన్ను, శిస్తు మొదలగు బాకీలకును, రైలు చార్జీలకును, తపాలాఫీసు సేవింగ్సు బ్యాంకు, మణి ఆర్డర్లకును, చెల్లించ వలసిన పైకమునకు బదులుగ నివ్వవచ్చును. ఈనోట్లు, 5, 10, 20, 50, 100, 500, 1000, 10,000, రూపాయల నోట్లని పలువిధములై యుండును. నోట్లను సర్కారువారి ఖజానాలో నాణెములుగా మార్చవచ్చును.

సర్కారువారికి చెల్లించవలసిన మొత్తమును తపాలుమూలక ముగా, నోట్లుగా చెల్లించవలసినఎడల ఒక సగమును మొదట పంపి అది చేరిన తరువాత మఱియొక సగమును పంపవచ్చును.

ఈకరెన్సినోట్లను పోగొట్టుకొన్నప్పుడు అవి వాస్తవము గానే పోగొట్టుకోబడినవనియు అవిమరల దొరకుటకు హేతు వులేదనియు పోగొట్టుకొన్నవారు ఋజువు పఱచినయెడల ఆనో ట్లుఏసర్కిలులోనుండి బయలువెడలెనో ఆసర్కిలుకు దరఖాస్తు చేసికోవలెను. కరెన్సినోటు ఆఫీసు అధికారియైన హెడ్ కమీ షనర్ ఇట్లు పోగొట్టుకొనబడిననోట్లనుగుఱించి గెజట్టులోప్రచు రించి రెండుసంవత్సరములు గడచినతరువాత ఆ నోటులో కనప ఱచియుండు మొత్తమును సేవింగ్సుబ్యాంకిలో నుంచుటకు ఉత్తర్వుచేయును. ప్రచురించిన తేదిమొదలు 20 సంవత్సరము లవరకు పోగొట్టుకోబడిన నోట్లు ఏఖజానాలోను హాజరుచేయ బడకపోయినవని తెలిసినపక్షమున పైకమును పోగొట్టుకొన్న వారికిగాని, వారివారసులకుగాని బ్యాంకులోనుండి వడ్డీతోసహా వాపసు ఇచ్చుటకు ఉత్తర్వు చేయబడును. 1905 సంవత్సర మునకుతరువాత రు 100 లకు తక్కువగాని కరెన్సినోట్లు 40 సంవత్సరములవరకును, 100 రు లకు పైబడినవి 100 సంవత్స రములవరకును మార్పబడకుండ నుండినయెడల అవి తరువాత చెలామణి కాదగినవిగా నుండవు.

## VIII. పన్నులు.

హిందూదేశమునకు అనేక శత్రువులుండిరనియు ఆశ

త్రువులను బ్రిటీషు గవర్నమెంటువారు నిర్మూలముచేసిరనియు, ఆ కారణమువల్ల జనులు ఇప్పుడు సుఖముగా జీవించుటకు వీలుగానున్నదనియు ఇదివరలో చెప్పబడెను. దేశమును కాపాడుటకును జనులను పరిపాలించుటకును చట్టములుఏర్పడవలెను. జనులయొక్క క్షేమము నుద్దేశించి కట్టడములు, రాజమార్గములు. జలాధారములు. పాఠశాలలు, ఇనుపదారులు, తపాలు, న్యాయస్థలములు మొదలగునవి చక్కగా ఏర్పడి రక్షింపబడవలెను. చట్టములను అనుష్ఠానములోనికి తెచ్చుటకును, పైన చెప్పబడిన వానిని పరిపాలించుటకును సిబ్బంది ఎక్కువగా నుండవలెను. ఈఏర్పాటులకన్నిటికి కోట్లకొలది ద్రవ్యము కావలెను. ఈ పైకమును గవర్నమెంటువారు జనులవద్దనుండి పన్నుమూలకముగా వసూలు చేయుచున్నారు.

బజారులో ఒక వస్తువు మనకు కావలసి వచ్చునప్పుడు ఆ వస్తువునకు కొంతద్రవ్యము ఖర్చుచేయక అది మనకు లభింపదు. ఇటులనే మనలో కొల్ల, కూని, మోసము మొదలగు తొందరలు కలుగకుండ మన రక్షణకొఱకే కొంతపైకము ప్రభుత్వమువారి కిచ్చుచున్నాము. దీనికి పన్ను అనిపేరు. ఒక మనుష్యుడు మరియొకనికిగాని, లేక అనేకులకుగాని ఒక పనిని చేసినపుడు దానికి బదులుగా వారిచ్చునట్టి రొక్కమునకు కూలి అనిపేరు. సర్కారువారు జనులకు క్షేమము కలుగజేసినందులకు జనులవద్దనుండి వసూలుచేయుపైకమునకు పన్ను అని

పేరు. అయినను కూలికిని పన్నుకును ముఖ్యవ్యత్యాసమొకటి కలదు. ఒకపని జేయించుటకు మనము ఒకనితో కూలిమాట్లాడి నిశ్చయించిన తరువాత వానిచే ఆ పని చేయించుటకు ఇష్టము లేనిపక్షమున మఱి యొకనిచే దానిని పూర్తి చేయించు చున్నాము; లేదా ఆపనిని పూర్తిచేయక ఆపి యువేచున్నాము, లేక కొంతకాలము గడచిన పిదప ఆ పనిని మొట్టమొదట మాట్లాడిన కూలివానిచేతనే చెయించుచున్నాము. అనగా ఒక కూలిపనిని మనము మన ఇష్టప్రకారము చేయించుకొన్నట్లు మనము గవర్నమెంటు పన్నును మన ఇష్ట ప్రకారము ఆపివే యుటకుగాని మార్చుకొనుటకుగాని వీలుకాదు. ఏలనగా, గవర్నమెంటువారు ఈ పన్నును అనేకులవద్దనుండి వసూలు చేయవలసి యున్నందునను ఈపైకమునకు ముందుగానే ఏర్ప డియుండు ఖర్చులు అవశ్యమైనవిగాను, స్థిరమైనవిగా నున్నందు నను, పన్ను వసూలు చేయుటకు కాలమును మొత్తమును నిర్ణ యింపబడి ఒకపద్ధతిప్రకారము సరిగా వసూలు చేయవలసియు న్నది. కాన గవర్నమెంటువారు మనవద్దనుండి పన్ను తీసుకొనుట అన్యాయమనియు మనము పన్ను చెల్లించుటకు చేయు ఖర్చు అన్యాయమైన ఖర్చులనియు తలంచగూడదు. పన్ను వసూలు చే యుటలో గమనింపబడు విధులు ఏవనగా (1) సర్కారువారికి ఇవ్వవలసినపన్ను మొత్తము ఇంత యని ప్రతివానికిని విశద ముగా తెలియబఱచుట (2) జనులయొక్క క్షేమము నుద్దే

శించి రాజ్యమును పరిపాలించుటకు ఎంతఖర్చుఅగునో ఆఖర్చు ను బట్టి కావలసిన మొత్తమును లెక్కజేసి జనుల వద్దనుండి ఎంతవరకు తగ్గించి వసూలు చేయవచ్చునో అంత మొత్తమునే వసూలుచేయుట (3) పన్నువసూలు చేయుటలో బీదవాడని యు, ద్రవ్యవంతుడనియు, ప్రాబల్యముగలవాడనియు, వ్యత్యాసము లేకుండుట.

ఇంగ్లీషువర్తకులు హిందూదేశమునకు వ్యాపారముచే యుటకు వచ్చినప్పుడు స్వదేశరాజులు భూములకు స్వంతదారులుగానుండుటయును, వారుజనులకు వ్యవసాయముచేయ అనుమతి ఇచ్చుటకు మారుగా పన్ను వసూలు చేయుటయును చూచిరి. ఆంగ్లేయులు ఈదేశమును క్రమక్రమముగా వశపఱచుకొన్నప్పుడు గడచినశతాబ్దపు పూర్వభాగమున స్వదేశరాజులు ఏరీతిగా జనులవద్దనుండి పన్నువసూలు చేయుచుండిరో ఆపద్ధతిని ఆదారముగా గై కొని భూమిశిస్తు విధించిరి. అయినను స్వదేశరాజు వసూలుచేసిన మొత్తమునకంటె బ్రిటీషు గవర్నమెంటువారు వసూలుచేయుచువచ్చిన మొత్తము తక్కువగానే యుండెను. ఈతక్కువ మొత్తమునుకూడ రానురాను తగ్గించుటకు ఆరంభించిరి. గడచిన శతాబ్దముయొక్క మధ్య భాగమున భూమిని సరిగాకొల్చి భూమియొక్క తరమునుబట్టి శిస్తు నిర్ణయించిరి. ఇప్పుడువర్షము లేకపోయిన కారణమునను, సామానులయొక్క వెల అధికమైన కారణమునను, భూమిలోపండు

పంట ధాన్యములకుగూడ వెలహెచ్చెను. కాబట్టి, ఈవెలకు తగినట్లుగా తీర్వయేర్పాటు చేయుచున్నారు.

భూమిశిస్తు పలువిధములు:—(1) జమీన్ శిస్తు (2) ఇనాము శిస్తు (3) తరంవారి శిస్తు లేక రైతువారి శిస్తు.

(1) జమీనుశిస్తు—తీరువను ఒక్కొక్క పట్టాదారుని వద్దనుండి సర్కారువారు స్వయముగ వసూలుచేయక, ఒకగ్రామమునుగాని లేక అనేక గ్రామములనుగాని జమీన్దారు అని చెప్పబడు ఒకనికి శాశ్వతతీరువకు విడిచిపెట్టి వానివద్దనుండి వసూలుచేయబడుశిస్తు మొత్తమునకు జమీన్ శిస్తు అనిపేరు. దీనికి పేష్కబ్ అనియు పేరుకలదు. పైచెప్పబడిన మక్తా మొత్తమును భూములయొక్క వివరముగలసన్నదు "మిల్కియత్ ఇస్తిమిరారు" అను అధికార పత్రమును జమీన్దారికి ఇచ్చియున్నారు. శిస్తు వివరము దానిలో వివరింపబడి యుండును. దానిలోనుండు నిబంధనలకు లోబడి జమీన్దార్లు సర్కారువారికి తీరువ చెల్లించుచున్నారు. జమీన్దార్లు వారికి లోబడి యుండు భూములను కాపులకువిడిచి వారివద్దనుండిపన్ను వసూలు చేయుచున్నారు, ఈపద్ధతి విశేషముగా బంగాళా రాజధానిలో నున్నది. 1793 సంవత్సరమున కారన్ వాలీసు అనుగవర్నరు జనరల్ గారిచే ఇది ఏర్పాటు చేయబడినది. దక్షిణ హిందూదేశములో కొన్ని స్థలములయందు జమీన్ భూములు గలవు. మన రాజధానియందు తెలుగు జిల్లాలోనుండు కాళ

హస్తి, వెంకటగిరి, విజయనగరము, బొబ్బిలి, పర్లాకిమిడి, మొదలగునవి జమీనులు.

(2) ఇనాముభూములశిస్తు:—దేవళము మొదలగు మతసంబంధమైన స్థలములను,సత్రములు పాఠశాలలు మొదలగు ధర్మస్థలములను కట్టుటకును, వానిని తగువాత కాపాడుటకును, రాజులకును ప్రజలకును కొన్ని నౌఖరీలు చేయుటకును,పూర్వపురాజులు కొందరికి ఎక్కువభూములను తీరువలేక విడిచియుండిరి. ఈ విషయములను మాత్రమేగాక రాజులకు కొందఱు చేసిన గొప్ప ఉపకారములకు మారుగాకూడ భూములను తీరువలేకయే ఇచ్చియుండిరి. ఈరీతిగా నివ్వబడినభూములకు మాన్యములనియు ఇనాముభూములనియు పేరు. హిందూదేశము ఆంగ్లేయ దొరతనమునకు లోబడిన తరువాత గవర్నమెంటువారు పైని చెప్పబడిన ఇనాము భూములయొక్క ఆధారములను పరిసీలించుటకు ఇనాము కమీషనర్లు అను ఉద్యోగస్థులను ఏర్పాటుచేసిరి. మత విషయముగాను, ధర్మ విషయముగాను యేర్పడిన ఇనాముభూములే పనులకు ఏర్పడినవో ఆపనులు సరిగా నడచుచుండుటవలన ఇప్పుడుకూడ ఇనాములుగానే విడిచియున్నారు. ఏపనుల నుద్దేశించి ఇనాములు ఇవ్వబడినవో ఆపనులు సరిగా జరగనిపక్షమున ఆ భూములకు పూర్తితీరువ ఈక్రిందచెప్పఁబడు తరంవారి భూములకు వలెనే ఏర్పాటుచేయుచున్నారు. గ్రామ నౌకర్లకు మాన్యములుగా

ముద్రించియున్నారు. సర్వేచేయబడిన భూములు విస్తారము పెద్దవిగానున్నప్పుడు వానిని అనేకభాగములుగా భాగించి ప్రతి భాగమునకును నంబరు ఇచ్చియున్నారు. (ఉదాహరణము) 64-వ నెంబరు పొలములోని భాగములకు 64-1,64-2,64-3, అని నంబర్లు ఇవ్వబడును. 64-1, లో భాగములుండినయెడల ఆ భాగములు 64-1-4 64-1-5, అనిగుర్తింపబడును. ఈనంబర్ల యొక్క సహాయముచేత ఈపొలము ఈస్థలములోనున్నదని రివిన్యూ సర్వేపటమునుచూచి చెప్పుటకు సాధ్యమగును. ఈ సర్వేపటములో రోడ్డు, జలాధారములు మొదలగువాని వివరము గుర్తింపబడి యుండును. తయారు చేయబడిన సర్వేపటముల లో కనబఱచియుండు సర్వేనంబర్లుగల పొలములను అనేకభాగ ములుగా చేయవలెనన్నచో డివిజనల్ ఆఫీసర్లయొక్క అను మతిని బొందవలెను. భాగములు సరిగా భాగింపబడియున్నవా యనియు, ప్రతిసర్వేనంబరుకును డిమార్కేషన్ (సరిహద్దు)రా ళ్ళుస్థలముమారకుండ ఉన్నవా యనియు, తనిఖీచేయుటకుప్రతి జిల్లాలోను ల్యాండురికార్డు తహశ్శీల్ దార్లను, ల్యాండురికార్డు ఇన్ స్పెక్టర్లను నియమించి యున్నారు. ఇటువంటి సర్వేనంబ ర్లను ఒకసర్వేనంబరులోని భాగములయొక్క నంబర్లను వాని యొద్దనుండు లెక్కపుస్తకములో వ్రాసియుంచవలెను. తరం తీర్మానించి విస్తీర్ణము లెక్క వేసి నంజ పుంజ వివరములతో భూమిశిస్తు నిర్ణయింపబడి, సర్వేప్లానులోనుండు నంబర్లుగల

పై చెప్పబడిన సెటిల్ మెంటురిజస్టరే ల్యాండురిజస్టరు అని చెప్ప బడును. దీనికి (Diglot) డిగ్లాటు రిజస్టరనియు పేరు. ఈ పదమునకు ద్విభాష యని అర్థము. ఈరిజస్టరు కాపులకు విశద మగునట్లు గ్రామముయొక్క భాషలోను, ఇంగ్లీషుభాషలోను వ్రాయబడియుండుటచే దీనికి ఈపేరువచ్చెను. ఈరిజస్టరు గ్రామ వారిగా తయారు చేయబడి ప్రతిగ్రామకరణమువద్దను ఉండును. ఈరీతిగా చెన్నపురి బొంబాయి రాజధానులలోను ఆస్సాము బర్మాదేశములలోను భూములను కాపులవద్ద ఒప్పజెప్పి వారివద్ద నుండి స్వయముగనే సర్కారువారు కార్యస్థులమూలకముగా భూమిశిస్తు వసూలుచేయుచున్నారు. ఇటువంటి భూములన్ని యు తరంవారి భూములనబడును.

1 పట్టా అనగానేమి?—దక్షిణహిందూదేశములో సా ధారణముగా ప్రతికాపును భూమిని తానే సేద్యముచేసి సర్కారు వారికి స్వయముగా పన్ను చెల్లించుచున్నాడు. గవర్నమెంటు వారు ప్రతికాపువానియొద్దనుండు భూములయొక్క నంబర్లను, విస్తీర్ణమును వాడు చెల్లించవలసిన తీరువ మొత్తముయొక్క వివరమును ఒకకాగితములో వ్రాసి సర్కారుసీలువేసి కాపునకు ఇచ్చుచున్నారు. ఈదస్తావేజునకు పట్టా యనిపేరు. కాపుపట్టాలో కనుపఱచి యుండు మొత్తమును ప్రతిసంవత్సరముఏకకాలమునం దు చెల్లించుట కష్టసాధ్యమగును; గనుక ఆ మొత్తమునునాలుగు పర్యాయములు ఇచ్చుటకు ఏర్పాటు చేసియున్నారు. ఈనాలు

గుపర్యాయములను నాలుగు కి స్తీలు అని వాడుదురు. జిల్లాల యొక్క కోతకాలమునకు తగినట్టుగా కి స్తీలు మారుచుండును. సాధారణముగా అనేక జిల్లాలలో జనవరి ఫిబ్రవరి మార్చి ఏప్రిల్ అనునాల్గుమాసములు శిస్తుకి స్తీలు చెల్లించుటకు ఏర్పడి యుండు మాసములు.

ఒకపర్యాయము కాపునకు పట్టాఇవ్వబడిన తరువాత అతడు తన భూమిని అమ్మివేయుటవల్లగాని లేక మరియొకరికి వ్రాసి ఇచ్చుటవల్లగాని మార్పులు గలిగినప్పుడు క్రొత్తపట్టా తీసికొనవలెనే గాని ఇటువంటి మార్పులు ఏవియు లేనపుడు క్రొత్తపట్టా తీసికొనుట అవశ్యముకాదు. తీరువ విధింపబడిన అన్ని భూములయొక్క వివరము గ్రామకరణమువద్దనుండు అడంగల్ అను పుస్తకములో వ్రాయబడి యుండును. ప్రతిపట్టాదారునికి వాని స్వాధీనములోనుండు భూములను, అమ్మివేయుటకును, మఱియొకనికి వ్రాసి ఇచ్చుటకును అధికార మున్నది. అయితే ఇటువంటిమార్పులన్నియు అప్పుడప్పుడే పైచెప్పబడిన అడంగల్ పుస్తకములలో వ్రాయించబడవలెను. ఈరీతిగా ఈ రిజష్టరులో దాఖల్ చేయువఱకు, ఆభూములకు ఏర్పడినతీరువను అదివరకు ఇచ్చుచుండిన పట్టాదారుడే ఇచ్చుచుండవలెను.

సర్కారు భూములయందుండు చెట్లను అనుభవించుటకు మాత్రము ఇవ్వబడు పట్టాలకు చెట్లపట్టా యనియు,ఖాళీ భూముల మీద ఉత్తర్వునుపొంది ఇల్లు కట్టుకొన్న పక్షమున

వానిని అనుభవించుటకు ఇవ్వబడు పట్టాలకు ఇంటి పట్టాయని పేరు. వీనిలో భూములకు తీరువయును, ఇండ్లకు పన్నులును విధింపబడును.

తరంవారి భూములకు ఏర్పడి యుండు పట్టాల వలెనే జమీన్దార్లును ఇనాందార్లును వారివద్ద నుండు భూములను కాపులు సేద్యము జేయునపుడు ఆభూముల యొక్క విస్తీర్ణమును, పట్టాదారుని యొక్క పేరును, శిస్తు మొత్తమును శిస్తుచెల్లించవలసిన కాలమును, పట్టా ఏర్పడిన తేదియును మఱికొన్ని షరత్తులును ఒక కాగితములో వ్రాసి సీలువేసి కాపులకు ఇత్తురు. ఈదస్తావేజులకు పట్టాలు అనిపేరు. కాపు తన కిచ్చినభూమిని సరిగా సేద్యము చేయుననుటకు ఋజువుగాను క్రమముగా శిస్తుచెల్లించు ననుటకు జామీనుగాను ఎదురుదస్తావేజు ఒకటి వ్రాసి ఇచ్చును. దానికి ముచ్చలికా అనిపేరు.

(౭)పట్టానుమార్చుట:—పట్టాలు మార్చుట మూడు విధములు ౧. ఎవరైనను తన భూములను క్రయముచేసిగాని, దానముచేసిగాని మఱియొకని పేరు పట్టాను మార్చ వచ్చును. ౨. కోర్టుడిక్రీలకుగాను వేలంవేయబడు భూములనువేలములో కొన్న వానిపేరట మార్పు చేయవలెను. ౩. తనకు పిత్రార్జితముగా వచ్చిన భూముల పట్టాను తనపేరిటమార్చుకో వచ్చును. భూములయొక్క పట్టా మార్పుదల విషయమున విక్రయించువాడును, కొనువాడును కలిసి పట్టా మార్చవలసిన భూమిని

గురించి రివిన్యూ ఇన్‌స్పెక్టర్లు గ్రామమునకు వచ్చు కాలములయందు మనవి చేసికొన్న పక్షమున తక్షణమే ఉత్తర్వు పొందవచ్చును. లేనిపక్షమున ఈ మార్పువిషయముగా తహశ్శీల్ దార్, డిప్యూటీతహశ్శీల్ దార్, వీరు గ్రామములోనుండు నపుడుగాని లేనపుడుగాని వారికి అర్జీ పెట్టుకొని ఉత్తర్వు పొందవచ్చును. ఈవిషయము కరణముగూడ తనవద్దనుండు గ్రామఅడంగులలో తక్షణమే నమూదు చేయనలయును. ఈఅర్జీలో గ్రామకరణముగాని గ్రామాధికారిగాని చేవ్రాలు చేయవలెను.

కక్షీదారులలో ఒకడు మాత్రమే వానికి ఆధారమైన దస్తావేజుల సహా అర్జీ పెట్టుకొన్నప్పుడు ఈవిషయము జిల్లా గెజట్టులో ప్రచురము చేసి ఇతర కక్షీదారునికి నోటీసుపంపి ఆక్షేపణలు లేనిచో పట్టా మార్చుటకు ఉత్తర్వు కావచ్చును. ఆక్షేపణలు కలిగినపుడు విచారణచేసి రుజువు అయిన రీతిగా ఉత్తర్వు చేయబడును.

కక్షీదార్లు ఇరువురును పట్టామార్పుదల విషయములో అశ్రద్ధ కలిగి ఉండినఎడల జమాబంది కాలములో డివిజనల్ ఆఫీసరుగాని, లేక తహశ్శీల్ దారుగాని వీరిని పిలిపించి విచారణచేసి ఆక్షేపణలు ఏమియు లేకుండినయెడల తక్షణము మార్చుటకు ఉత్తర్వుఇచ్చి కరణమువద్దనుండు అడంగులు లెక్కలో ఈవిషయమును వ్రాయుటకు ఉత్తర్వు చేయుదురు.

ఆక్షేపణ లుండినయెడల పైనచెప్పిన ప్రకారము జిల్లా గెజెట్టులో ప్రచురముచేసి విచారించి తీర్మానముచేయుదురు.

ఆడుమానము (తాకట్టు) మొదలగు మార్పులకు కక్షీదార్లు ఇద్దరునుకలిసి అర్జీపెట్టుకోవలెను. కరణముయొక్కగాని గ్రామాధికారియొక్క గాని చేవ్రాలు ఈయర్జీలో నుండవలెను. అప్పుడు తక్షణమే మార్పులు చేయుదురు.

కోర్టుడిక్రీలమీద పట్టామార్పులు చేయవలసినయెడల వాదియొక్క అర్జీ ఆధారముమీదను, డిక్రీనకలు ఆధారము మీదను తక్షణమే మార్పునకు ఉత్తర్వుచేయబడును.

సంతతివారికి పట్టామార్చిఇచ్చుట:—ఒక పట్టాదారుడు చనిపోయినపుడు ఆగ్రామాధికారులు ఆపట్టాదారుల భూముల జాబితా తయారుచేసి వారసులు ఫలానివారని విశదముగా వ్రాసి తహశ్శీల్ దారునకైనను డిప్యూటీ తహశ్శీల్ దారుకైనను రిపోర్టు చేయవలెను. వారు దానిని విచారించి ఆక్షేపణలు లేనియెడల తక్షణమే పట్టామార్చుటకు ఉత్తర్వుచేయవచ్చును. ఆక్షేపణలుండినయెడల జిల్లాగెజట్టులో ప్రచురముచేసిన తేదిమొదలు మూడుమాసములలో ఆక్షేపణచేయువారు వారిబాధ్యత విషయమై కోర్టులో దావాచేసియుండునట్లు తెలియపఱచి, ఆదావాయొక్క నకలును పంపుకోవలెను. ఇవన్నియు పంపని పక్షమున ప్రచురము చేయబడినతరువాత మూడుమాసములు గడచిన వెంటనే మునుపు విచారణచేసినపుడు తీర్మానముచేయ

బడినసంతతివానికే ఉత్తర్వు ఇవ్వబడును. ఆక్షేపణఅర్జీయున్ను దావానకలున్ను పంపబడినచో సివిల్‌కోర్టువారి విచారణ ముగియువరకు వ్యవహారమును నిలిపి కోర్టువారి తీర్పుప్రకారము బాధ్యతగలవానిపేరట పట్టా ఇయ్యబడును.

ఈపైన చెప్పబడిన విధములనేగాక వేఱువిదముగా కూడ పట్టా మార్చబడవచ్చును. సాధారణముగా క్రయశాసన పత్రములు రిజస్టరు ఆఫీసులో రిషస్టరు కావలసినది అవశ్యముకదా. ఆరీతిగా రిజిస్టరుచేయుటకు ఇరువురు కక్షిదార్లును రిజస్టరు ఆఫీసుకు వచ్చినపుడు రిజస్ట్రారుగారు చేయుటకుమునుపే క్రయదస్తావేజు సంబంధమైన పట్టాలను మార్చుటకువారి వద్దనుండి ఒక అర్జీని తీసుకోవలెను. దానిలో ఇరువురు కక్షిదార్లును చేవ్రాలుచేసి యుండవలెను. ఈ అర్జీని తహశ్శీల్‌దార్లకుగాని డిప్టీ తహశ్శీల్‌దార్లకుగాని పంపి వేసిన ఎడల వారు దీని ఆధారము మీాద పట్టామార్పును ఉత్తర్వుచేయవచ్చును. పట్టామార్పు అర్జీలకు ఒకఅణాబిళ్ళ అంటించవలెను. పట్టామార్పువిషయములు సర్కారునౌకర్లు బాగుగా గమనించవలెను. ఏలయనగా రిజస్టరులోకనబడిచియుండు పట్టాదారుని వద్దనుండియే శిస్తు వసూలు చేయవలసియున్నది.

3. భూములు విడుదల పెట్టుట.(Relinquishment of land). పట్టాదారులు కొన్నిసమయములందు వారి స్వాధీనములోనుండు భూములను సేద్యముచేయుటకు శక్తిలేనివారై వారి

బాధ్యతను తొలగించు కొనుటకు ప్రయత్నింతురు. అటువంటి వారు భూములవిషయమై ఇస్తిభాలు ఇచ్చుటకు నిర్ణయింపబడియుండు తేదులలో ఇస్తిభా దాఖలు చేసికోవలెను. ఏ భూముల నుద్దేశించి ఇస్తిభా దాఖలు చేయబడునో ఆభూమి మఱి యొక కాపు సేద్యముచేయుటకు అనుకూలముగానుండవలెను. అనగా ఒకడు తన స్వాధీనములోనుండు భూములలో మధ్యనుండు కొంతభాగమునకు మాత్రము ఇస్తిభా దాఖలు చేసినయెడల ఆ దరఖాస్తు అంగీకరింపబడదు. ఇస్తిభా అర్జీ సరియైన నమూనాలో వ్రాసి అందు విస్తీర్ణము, శిస్తువ మొదలైనవి ఉదాహరించి గ్రామాధికారి కరణమువీరియొక్క చేవ్రాళ్లు చేయించుకొనవలయును. ఈ అర్జీ గ్రామాధికారివద్ద గాని కరణమువద్దగాని ఇచ్చినచాలును. ఈ అర్జీని తహశ్శీల్దారు లేక డిప్యూటీ తహశ్శీల్దారు అంగీకరించవలెను. భూముల సంబంధమైన ఇస్తిభా అర్జీకి బిళ్ళ అంటించవలసిన పనిలేదు. విడుదలపెట్టబడు భూములు మాగాణియైనచో రెండు యకరములకును, మెట్టయినచో ఒక్క యకరమునకునను తక్కువ విస్తీర్ణముగలవిగానున్న ఎడల ఇస్తిభా అంగీకరింప బడదు. కాని ఒకపొలము ప్రవాహములవల్లగాని, అసాధ్యమైన ఇతర కారణములవల్లగాని నిష్ప్రయోజనమైనదని ఋజువు పఱచబడినయెడల దాని విస్తీర్ణమును గమనించకయే ఇస్తిభా అంగీకరింపబడును. తపాలుమూలకముగా ఇస్తిభా అర్జీలు పంపబడిన

ఎడల అవి అంగీకరింపబడవు. అనేకులకు ఇవ్వబడియుండు పట్టాలోని భూములయొక్క యొక భాగస్థుని భాగమునకు మాత్రము ఇస్తిభా అంగీకరింపబడదు.

(4) శిస్తు ఏరీతిగా నిర్ణయింపబడుచున్నదను విషయము:—ప్రతిపట్టాదారుడును (Diglot) డిగ్లాటు రిజస్టరులో కనబఱచియుండుశిస్తుతోసహా, పుంజభూములు సర్కారువారి జలాధారములసహాయముచే సాగుబడి చేయబడినయెడల వానికి నీటితీర్వకూడ ఇవ్యవలెను. భూమిశిస్తు సేద్యఖర్చుపోగా మిగిలిన పంట ఆదాయములో సగమునకు ఎక్కువగాక ఉండవలెను.

నీటితీరువవివరము:—శాశ్వతముగా నంజయని ఏర్పడియుండు భూములకు మొదటిపంటకు నీటితీరువలేదు. ఈనీటి తీరువ భూమిశిస్తుతో కలుపబడి యున్నది. రెండవపంటకు సాధారణముగా నంజపైరైనచో మొదటిపంటకు ఏర్పడియుండు తీర్వాలోసగమును మెట్టపైరు నంజభూములలో సాగుబడి చేయబడినఎడల పైరునుబట్టి నీటితీర్వా విధింపబడును. మూడవపంటకు తీర్వాలేదు. ఒకతేపంటపెట్టబడు భూములయందు తమలపాకుమొదలగు తోటపైరులు పెట్టబడిన ఎడల రెండుపంటల తీర్వావసూలు చేయబడును.

| | మొదటితరగతి జలాధార ములచేసాగు చేయబడినవి | రెండవతరగతి జలాధారముల చే సాగుచేయ బడునవి. |
|---|---|---|
| మెట్ట. | | |
| (1) మెట్ట భూములలో సాగుచేయబడిన మాగాణి పైరులకు ఒక పంటకు ఒక యకరమునకు. | 4 రూపాయలు. | 3రూపాయలు |
| (2) రెండవ పంటకు. | 2—0—0 | 1—8—0 |
| (3) సాధారణ మాగాణి పైరులకంటే ఎక్కువ కాలము నీరు కావలసియుండు చెఱకు, తమలపాకు అరటి మొదలగు తోటపంటలకు. | 8—0—0 | 4—0—0 |
| (4) మొదటి పంటయైనను రెండవ పంటయైనను నీరుకట్టిన మెట్టపైరునకు. | 2—0—0 | 1—8—0 |

N B, అడవి వాఁగులయొక్క నీటిని శిస్తు లేకయే ఉపయోగపఱచుకోవచ్చును. నారుమళ్లకు నీటితీరువ లేదు. పైచెప్పబడిన రేట్లు మారుటయునుకలదు. ఇటువంటి మార్పులను గవర్నమెంటువారే చేయవలెను. తీరువవిధింపబడని భూములు అనగా పోరంబోకు భూములు సేద్యముచేయబడి పైరుపెట్టబడిన యెడల వానినిగూడ తీరువవిధింపబడిన భూములవలెనే శిస్తు లెక్కచేయవలెను, ఉత్తర్వుపొందక పోరంబోక భూములను సాగుబడిచేసిన యెడల అపరాధతీరువ వసూలుచేయబడును. ఉత్తర్వు లేక సాగుబడి చేసినందుకు దండనకూడ విధింపబడును.

రస్తాలు క్రొత్తగావేయుటకును అదివరలో వేయబడి యుండు రస్తాలను బాగుచేయుటకును ఎక్కువడబ్బు ఖర్చు అగుచున్నది. ఈఖర్చునుద్దేశించి భూమి శిస్తుతోసహా రూపాయకు ఒక అణావంతున రోడుసెస్సుఅని చెప్పబడు ఒకపన్ను వసూలు చేయుచున్నారు.

పై చెప్పబడిన భూమిశిస్తు, నీటితీరువ, రోడ్డుసెస్సు, వీనితోసహా వృక్షములపన్ను వీని నన్నిటిని కలిపి ప్రతి పట్టాదారుడున్ను ప్రతిసంవత్సరము సర్కారు వారికి పన్ను చెల్లించవలయును. ఈమొత్తమున కే కిస్తిఅని పేరు. దీనిని ప్రతిసంవత్సరమును జనవరిమొదలు ఏప్రిల్ వరకు నాలుగుమాసములలో నాలుగు నాయిదాలుగా గ్రామమునిసిఫ్ వద్ద చెల్లించవలయును.

(5) తీరువతోసి వేయుట (రిమిషన్లు):—వ్యవసాయము చేయుటకు భూమిని దున్నవలెను. ఎరువు వేయవలెను విత్త వలెను. ఈపనులకన్నిటికి రైతు అధికముగా ద్రవ్యము ఖర్చు పెట్టును. వర్షమునునమ్మి కాపులు ఇట్టిపనులను చేయుచున్నారు. వర్షము కురియక మోసముచేసిన ఎడల పైరుపెట్టువారలు రెండు విధములైన నష్టమునకు లోబడుచున్నారు. ఖర్చుపెట్టిన ద్రవ్యము వ్యర్థమగుట ఒకటి. కిస్తి చెల్లించుట రెండవది. రెండవనష్టము కలుగకుండ రైతులు ఒక విధముగా తప్పించుకో వచ్చును. మాగాణి భూములలో చేసిన వవ్యసాయము వర్షములేని కారణముచే పండదని తెలిసినచో కోతకాలమునకు

ముందే, రివిన్యూఇన్‌స్పెక్టరు, డిప్యూటీ తహశ్శీల్ దారు, తహశ్శీల్ దార్, డివిజనల్ ఆఫీసరు, వీరలలో ఎవరికైనను భూమి తీరువ రద్దుచేయవలయునని అర్జీ, జిల్లా కలక్టరువారిచే నిర్ణయింపబడు తేదులకు మునుపే పంపుకోవలెను. సర్కారు ఉద్యోగస్థులు అజిమాయిషి చేయుటకు మునుపు పయిరును కోయగూడదు. ఈఅర్జీలో చెప్పబడియుండు సంగతులు వాస్తవమని అజమాయిషీ చేయు అధికార్లకు తోచిన ఎడల తీరువ రద్దుచేయబడును. ఈరీతిగా తోసివేయబడు తీరువ ఒక నంబరు అంతకును ఇవ్వబడునేగాని ఆ నంబరుయొక్క ఏదైనా ఒక భాగమునకు మాత్రమే ఇవ్వబడదు. ప్రవాహములవల్ల కలుగు నష్టమునకును, నీరు లేకపోవుటవల్ల సాగుబడి చేయబడక బీడుగా విడువబడియుండు భూములకును పైన చెప్పినప్రకారము తీరువ తోసివేయుదురు.

సాధారణముగా మాగాణి భూములకు ముజరా ఇవ్వబడదు. కాని మిక్కిలి కరువుగానున్న సంవత్సరములలో కలక్టరు వారు బోర్డువారివద్దనుండి ప్రత్యేకముగా అనుమతిబొంది కొన్ని విధులప్రకారము మాగాణిభూములకు ముజరా ఇచ్చుటకలదు.

మొదటికిస్తి వసూలుచేయబడిన తరువాత రిమిషను ఉత్తర్వు అయిన ఎడల వసూలుచేయబడిన మొత్తమువాపసుచేయబడును. నాడుమళ్లకు తీరువ తోసివేయుట కలదు. కాని శిస్తుతోసహా చెల్లించవలసిన రోడ్డుసెస్సు మొదలగు చిల్లర

పన్నులుతోసి వేయబడవు. అప్పటికి నిలిపి తరువాత వసూలు చేసినను చేయవచ్చును.

దరఖాస్తుచేయుపద్ధతి:—గ్రామములో సెటిల్‌మెంటు వారిచే తీరువఏర్పాటుచేయబడనివియు, తీరువఏర్పాటుజేయబడి ఉపయోగింపబడనివియు అయిన ఖాళీభూములు అనేకము లుండును. వీనికేగ్రామబంజర్లు లేక గ్రామపోరంబోకలనిపేరు.

సాగుబడి చేయుటకు వీలైనవిగానుండి ఒకనిస్వాధీనములోలేక తీరువమాత్రము ఏర్పాటు చేయబడియుండు భూమికి గ్రామబంజరు అనిపేరు. అటువంటిదానిని సాధారణముగా సర్కారువారు సాగుబడిచేయుటకు సెలవుఇత్తురు.

పోరంబోక:—సాగుబడిచేయుటకు అర్హమైనదయినను కాకపోయినను చెరువు, తటాకము గ్రామకంఠము మొదలగు వానికి గాను ప్రత్యేకముగా నుంచబడియుండుస్థలమునకును పోరంబోకలనిపేరు. దీనినిసర్కారువారు సేద్యముకొఱకు రైతుల కివ్వరు. కాని వీనిలో గ్రామమునకు అవశ్యముగా కావలసి యుండు స్థలమునకంటె ఎక్కువ పోరంబోక స్థలములున్న పక్షమున అవి ఇతరులకు ఇవ్వబడును. ఇటువంటి ఈరెండు రకముల భూములకొరకు యివ్వబడు అర్జీలకు దరఖాస్తు లని పేరు. దరఖాస్తుచేయుటకు కాలనిర్ణయమేదియులేదు. బిళ్ళ అంటించవలసిన అవసరమునులేదు.

ఈ దరఖాస్తు గ్రామాధికారి యొద్దనైనను తహశ్శీల్

దారువద్దనైనను పెట్టుకోవచ్చును. తహశ్శీల్ దారు దరఖాస్తును తీసికొన్నతోడనే గ్రామాధికారికి పంపివేయును. గ్రామాధికారి తనవద్దనుండు రిజస్టరులో దరఖాస్తును దాఖలుచేసికొని గ్రామములోదండూరా(టమటమా)మూలకముగా ఈవిషయమును వెల్లడిచేయవలెను. గ్రామచావడిలో దరఖాస్తులో కనపఱచియుండు భూమివిషయమై ఆక్షేపణ గలవారు 15 రోజులలో ఆక్షేపణలను తెలుపుకొనవలయునని ఒక నోటీసు గ్రామచావడినందుంచవలెను. 15 రోజులైన తరువాత నోటీసును గ్రామాధికారి, కరణము, సమీపమందుండు ఇతర పట్టాదారులు, వీరిచే వ్రాళ్లతో సహా దరఖాస్తుచేయబడియుండు భూముల యొక్క వివరము వ్రాయబడియుండు మిమోరాండమును కూడ తహశ్శీలుదారునకు పంపవలెను. దరఖాస్తు చేయువాడు ఒక్కడే అయిన ఎడలను, ఆక్షేప మేమియు, లేనిపక్షమునను, దరఖాస్తు వెంటనే అంగీకరింప బడును. దరఖాస్తు చేసిన వారు ఇద్దరు లేక ముగ్గురు అయిన ఎడల భూమిమీద నుండు చెట్ల పట్టాదారుడు ఎవరో వానికి ఇవ్వబడును. చెట్ల పట్టా ఎవరికిని లేని పక్షమున ప్రక్కనుండు (హంసాయి, లేక అతరాపు) రైతు దరఖాస్తు చేసిన ఎడల వానికిగాని వానికి అక్కరలేని పక్షమున గ్రామములోనుండు ఇతర పట్టాదార్లకుగాని ఇవ్వబడును. ఇదియు సాధ్యము కానిపక్షమున మొట్టమొదట దరఖాస్తు చేసిన వారికే ఇవ్వబడును, ఉత్తరువు అయిన తక్షణమే దరఖాస్తు

దారునికి తెలియ పఱచవలెను. తహశ్శీలుదారుని తీర్మానము మీాద 30 రోజులలో డివిజనల్ ఆఫీసరునకు అప్పీలు ఉన్నది. వీరి తీర్మానముమీాద అప్పీలు లేదు.

పోరంబోకు దరఖాస్తు:—తహశ్శీలుదారుని వద్దనుగాని డివిజనల్ ఆఫీసరు వద్దనుగాని పోరంబోకు దరఖాస్తులు పంపుకోవలెను. వారు తత్ క్షణమే విచారించి దరఖాస్తులో కనపఱచియుండు భూమి, కాలవ, గ్రామకంఠము, బీడు, మొదలగువానిలో చేరినట్లు తెలిసిన ఎడల దరఖాస్తును త్రోసి వేయుదురు. అట్లు లేక దరఖాస్తు చేయబడిన భూమి గ్రామమునకు ఏవిధముగాను పనికిరాదని తోచి రైతు అధీనము చేయుటకు ఏవిధమైన అభ్యంతరము లేకుండిన యెడల తత్ క్షణమే కలెక్టరుకు తెలియపఱచి ఆభూమిని తీరువ భూమిగా మార్చి దరఖాస్తు దారుడు స్వాధీన పఱుచుకొనుటకు ఉత్తరవిత్తురు.

ఈరీతిగా దరఖాస్తు చేయబడిన భూములకు దరఖాస్తు చేసికొన్నవారు ఉత్తవారు వచ్చిన తేది మొదలు తీరువ చెల్లించవలెను, ఇండ్లు మొదలగు కట్టడములుకట్టుకనుకొనుటకు గ్రామకంఠమని చెప్పబడు పోరంబోకు భూములను దరఖాస్తు పెట్టుకొన్న వారికి ఇచ్చుటయును గలదు. 50 రూపాయలకు ఎక్కువగాతీరువ చెల్లించు పట్టాదార్లకు పదిసెంట్లును, ఇతరపట్టాదార్లకు అయిదు సెంట్లును, ఇతరులకు నాలుగు సెంట్లును, ఇవ్వవచ్చును. ఇటువంటి భూములలో పైరులు వేసికొన

గూడదు. దరఖాస్తు విధుల ప్రకారము ఈభూములు మంజూరు చేయబడును. సర్కారువారి ఉపయోగమునకు గాని, గ్రామ ఉపయోగమునకు గాని ప్రత్యేకముగా ఉంచబడియుండు పోరంబోకు భూములు కలక్టరు వారియొక్క ఉత్తర్వు లేక దరఖాస్తు మీదనే ఇవ్వబడవు. ఇనుపదారికి ఇరుప్రక్కలను అరమైలు దూరమువరకు రివిన్యూ బోర్డువారిఉత్తర్వు లేక ఇవ్వకూడదు. ఏరులయొక్క కట్టలు, చెరువు లోతట్టు భూమి, వీనినిగుఱించి దరఖాస్తు పెట్టుకొనం గూడదు.

పన్ను వసూలుచేయు ఉద్యోగస్థులు:—తీరువ వసూలు చేయుట గ్రామ మునిసిపుయొక్క ముఖ్యమైనపని. వసూలు చేయబడిన మొత్తము వాని స్వాధీనములోనే యుండును. కరణము పైకమును ఏకారణమును బట్టియు తీసికోగూడదు. గ్రామచావడిలోగాని లేక గ్రామస్థులుచేరుటకు ఏర్పడియుండు ఇతరస్థలముల యందుగాని పన్నువసూలు జేయవలెను. గ్రామాధికారియు కరణమును హాజరైయుండి, చెల్లించబడుమొత్తములకు తమ సంతకముతో తక్షణము రశీదు ఇవ్వవలెను. గ్రామాధికారి మొత్తమును తీసికొన్నందుకు కరణము లెక్కలో జమ వ్రాసినందుకును ఇద్దరును చేవ్రాలు చేయుట మంచిది. మణియగారు ఉండుగ్రామమైన ఎడల వీరును గ్రామ మునిసిపును గలసి పన్నువసూలు చేయవలెను. ఇరసాలనామా అనిచెప్పబడు 15-వ నెంబరు లెక్కలో కరణము; గ్రామమునిసిపు

ఇరువురును చేవ్రాళ్లుచేసి ఇరసాలుతో సహాపంపవలెను. తహశ్శీల్ దారు యొక్క వ్రాత డిమాండులయొక్క ఉత్తరువులను అనుసరించి తీరువబాకీ వసూలుచేయు నిమిత్తము బాకీదారుని చరస్థిరసొత్తులను జప్తు చేయుటకును, అమ్ముటకును మునిసిపునకు అధికారము కలదు. వ్యవసాయపుపనిముట్లు దున్నుటకుపయోగించు ఒక జత ఎద్దులు, వీనినిమాత్రము జప్తుచేయగూడదు. తీరువబాకీకొరకు చరాస్తిని అమ్మవలసినప్పుడుతహశ్శీల్ దారు ఒక డిమాండు పంపవలెను. ఆ డిమాండు ఆధారముమీద మహసూలునుగాని, పశువులగాని జప్తుచేయవచ్చును. చరాస్తిని అమ్మవలసి వచ్చినపుడు 15 రోజులునోటీసు ఇవ్వవలెను. భూమిని జప్తుచేయవలసిన ఎడల తహశీల్ దారువారు పంపిన డీమాండులోనుండు మొత్తమును నోటీసులో కనపఱచి దానిని బాకీదారుని ఇంటికి అంటించవలెను. సొత్తును జప్తుచేసి డిస్ట్రిక్టుగెజెటులో ప్రచురముచేసి వేలము వేయవచ్చును.

తీరువ వసూలువిషయము మాత్రమెగాక గ్రామమునిసిపులు గమనింపవలసిన ఇతరపనులు ఏవనగాదరఖాస్తులు,భూమివిడుదలలు,పట్టామార్పులు,పన్నుగ్రోసివేయుట, వీనివిషయమై గ్రామకరణము గ్రామాధికారి వీరిద్దరును చేయవలసిన పనులను ఇదివరలోనే వివరించి యున్నాము. పొలములలో డిమార్కేషన్ రాళ్లుసరిగా నున్నవా యనియు, త్రవ్వితీయబడిన నిధులను

గుఱించి తహాశీలుదార్లకు తెలియపఱచుట, లోకల్ ఫండు, యూనియనులయొక్క హద్దులలోనుండు ఇంటిపన్ను వసూలు చేయుటలో సహాయము చేయుటయు, లోకల్ ఫండు సంబంధముగా భూమిశిస్తు వసూలుచేయుటయు, పశువులసంబంధమైన పౌండు (బందెదొడ్డి) పనులను చూచుటయు, పశువులుపౌండు లోనికి వచ్చినపుడు అపరాధము వసూలుచేయుటయు వీరి యొక్క ఇతరపనులలో ముఖ్యమైనవి.

బందెదొడ్డిలో తోలబడిన పశువులకు చెల్లించవలసిన అపరాధములు:—

| | రూ. అ. పై. |
|---|---|
| ఏనుగ | 2—0—0 |
| ఒంటె, దున్నపోతు | 0—8—0 |
| గుఱ్ఱము, ఎద్దులు, ఆవులు, కంచరగాడిద | 0—4—0 |
| దూడ, గాడిద, | 0—2—0 |
| మేక, గొఱ్ఱె | 0—1—0 |

జననమరణ లెక్కలు తయారుచేయుట గ్రామమునిసిపు యొక్కపని. ఇనాముభూములు ఏయేపనుల నుద్దేశించి ఇవ్వబడినవో ఆయాపనుల ఆయాఇనాముదార్లచే సరిగాచేయ బడు

చున్నది లేనిది తెలిసికొని ఏమైనా లోపములున్నప్పుడువాసిని తహశ్శీలుదారునకు గ్రామమునిసిపు తెలియపఱచవలెను సర్కారు వృక్షములను జాగ్రత్తగా చూచుకొనవలెను. ఇన్‌కం టాక్సు (ఆదాయపు పన్ను) విధించు విషయములో సర్కారు ఉద్యోగస్థులకు కావలసినంత సహాయము చేయవలెను. దొంగ తనముగా ఉప్పుచేయువారిని కనిపెట్టియుండవలెను. సర్కారు చెట్లలోనుండి లైసెన్సు పొందినవారుతప్ప ఇతరులు కల్లుతీయ కుండ చూచుకొననలయును. తపాలు పెట్టెలుండు గ్రామ ములకు గ్రామతపాలవాడు ప్రకటనచేయబడిన దినములలో క్రమముగా వచ్చిఉత్తరములను తపాలాఫీసుకుతీసికొని పోవు చున్నాడాయని కని పెట్టియుండి వాడుక్రమముగా రాని ఎడల తపాలాఫీసు అధికారులకు తెలియపఱచవలెను.

సర్కారుపన్ను విషయమై గ్రామాధికారి, కరణము, వీరలకు వెంబడి పై అధికారి రివిన్యూ ఇన్ స్పెక్టరు. రివిన్యూ విషయమున ప్రతితాలూకా అనేక ఫిర్కాలుగా భాగించి ప్రతిఫిర్కాకును ఒక రివిన్యూఇన్ స్పెక్టరును నియమించి యు న్నారు. ఈఉద్యోగస్థులను ఏర్పాటు చేయుట, తీసి వేయుట, సస్పెండుచేయుట, ఇవన్నియు కలక్టరుచేతిలోనున్నవి. వీరి ముఖ్యపుపనులు (1) మహాసూలు, సరిహద్దురాళ్లు, వీని పరిశోధిం చుట (2) తీరువపన్ను వీని సంబంధమైన లెక్కలను తనిఖీచేయుట. (3) అజమాయషీచేయుట అనగా సాగుబడీ చేయబడుపొలము

లను పైరులయొక్క స్థితిని పరిశీలనచేయుట. ఈ ఉద్యోగస్థులు రివిన్యూ లెక్క పరీక్షలో తేరినవారుగ యుండవలెను. వీరు ఆరు వారములు ల్యాండు రికార్డుతహశ్శీలుదార్ల వద్దను నాలుగు వారములు సర్వేసూపరింటెండెంటుగారి వద్దను పనిచేసి సర్వేచేయు విధమును పొలములను అనేక భాగములుగా భాగించుపద్ధతిని, కనబడని సరిహద్దురాళ్లు వేయు పద్ధతిని నేర్చుకో వలెను. దరఖాస్తు, పట్టామార్పుట, రజా, భూమి యిస్తిఫా, ఈ సంబంధములైన కాగితము లన్నియు ఈ ఉద్యోగస్థునిద్వారా తహశ్శీలుదారునకు పంపవచ్చును.

రివిన్యూ ఇన్ స్పెక్టరుకు పై అధికారులు డిప్యూటీ తహశ్శీల్ దారును, తహశ్శీల్ దారును. సాధారణముగా ఒక తాలూకాకు ఒక తహశ్శీల్ దారు నియమింపబడి యున్నాడు. తాలూకా గొప్పదైన ఎడల దానిని రెండు భాగములుగా చేసి రివిన్యూ సంబాధముగా పెద్ద భాగమునకు తహశ్శీల్ దారును, చిన్న భాగమునకు డిప్యూటీ తహశ్శీల్ దారును నియమింపబడు చున్నారు. డిప్యూటీ తహశ్శీలుదారు తహశ్శీలు దారునకు లోబడి పనిచేయు అధికారి. ఇదివరలో చెప్పియుండు ప్రకారము వీరు నేరములను విచారణ చేయుటకు గూడ అధికారము గలిగియున్నారు. వీరుచేయవలసిన పనులు ఏవి యనగా:—వారి తాలూకాలో నుండు గ్రామములను చుట్టి చూచుట. ఇనాము జమీను గ్రామములలో కొన్నిటిని తనిఖీచేయుట. గ్రామకర

ణము యొక్క లెక్కలను పరిశోధన చేయుట, తకరారు భూములను కొలిచి వీరి అభిప్రాయములను పైయధికార్లకు రిపోర్టుచేయుట, గ్రామములో నుండు ధనికులయొక్క ఇన్ కంటాక్సు (ఆదాయపు పన్ను) నిర్ణయించుట, తటాకము, బావి, చావడి, ఇవి గ్రామములకు అవశ్యమైనపుడు సిపార్సుచేయుట. గంజాయి, గంధకము ఇటువంటి వస్తువులను వ్యాపారముచేయు స్థలములను పరీక్షచేయుట. వసూలయిన శిస్తంతయు సర్కారు వారి ఖజానాకు చేర్చుటకు కలక్టరు గారికి జవాబుదారులు వీరలే. తాలూకా హెడ్ అకౌంటెంటు తహశ్శీల్‌దారునకు లోబడి పని చేయవలెను.

తహశ్శీలుదార్లకు పైఅధికారి డివిజనరల్ ఆఫీసరు. తహశ్శీల్‌దార్లయొక్క తీర్మానములమీద చేయబడు అప్పీళ్లు వీరిచే విచారింపబడి ముగింపు చేయబడును. సబుకలక్టరు, అసిస్టంటు కలక్టరు, డిప్యూటికలక్టరు, వీరు డివిజనల్ ఆఫీసర్లు. వీరికి వారి వారి డివిజనులో కలక్టరుకు ఉండునంత అధికారమున్నది. వీరుచేయవలసిన పనులు:—వారివారి డివిజనులలోనుండు గ్రామములయొక్క సంవత్సరాంతపు లెక్కలను ముగించుట. బాధ్యతసంబంధమైన కాపులయొక్క వ్యవహారములను, పొలముల యొక్క సరిహద్దు రాళ్లసంబంధమైనవియు, నీటిపారుదల విషయములలో కలుగుపోట్లాటలను, విచారణచేసి తీర్మానము చెప్పుట, పట్టాలిచ్చుట ప్రవాహమువల్లగాని వర్షములేకపోవుట

వల్లగాని పండకపోవునపుడు భూమిశిస్తు తోసివేయుట, జలాధారములను కాలవలను మరమత్తుచేయించుట.

వీరికి పైఅధికారి జిల్లాకలక్టరు. జిల్లాఅంతయు వీరి అధికారములోనున్నది. వీరే జిల్లాకు అన్నివిషయములలోను జవాబుదారి.

వీరికిపైన అధికారులు రివిన్యూబోర్డువారు. హిందూదేశమంతయు రాజ్యపాలన విషయమున రాజధానులుగా భాగింపబడి యున్నది. ఈరాజధానులలో ఈబోర్డువారికి రివిన్యూ సంబంధమైన విషయములలో సర్వాధికార మున్నది. ఈ బోర్డుకు పైఅధికారి రాజధానిని పరిపాలించు ఆలోచనసభలోని గవర్నరుగారు. సాధారణముగా రివిన్యూబోర్డువారి అభిప్రాయము ననుసరించి లోకల్ గవర్నమెంటువారు ప్రవర్తింతురు. ఈ బోర్డులో నలుగురు మెంబర్లుగలరు. ఇద్దరు శిస్తుసంబంధములైన విషయములను గమనించుచున్నారు. మఱియొకరు సర్వే సెటిల్మెంటు విషయములను, నాల్గవవారు చిల్లరపన్నులు, ఉప్పు, సారాయి, ఎగుమతిదిగుమతులు, ఆదాయపుపన్ను, మొదలగువానిని గమనించుచుందురు. ఈ మెంబర్లకు సహాయముచేయుటకు ముగ్గురు శెక్రటరీ లున్నారు. రాజధాని సంబంధమైన సర్కారు వరుమానమంతయు ఈ ఆఫీసులో తనిఖీచేయబడుచున్నది గనుక గుమస్తా లనేకులు పనిచేయుచున్నారు. ఈనలుగురు మెంబర్లును వ్యవసాయము, భూములలెక్కలు, అడ

ఇలాకా మొదలగు సర్కారువారికి నేరుగా సంబంధించిన అప్పీళ్లను విచారించి తీర్మానింతురు. కలక్టరు ఉద్యోగముచేసి, మిక్కిలి అనుభవశాలులైనవారు మాత్రమే ఈసభకు మెంబర్లుగా నియమింపబడుదురు.

లోకల్ గవర్నమెంటు:—రివిన్యూబోర్డునకు పైఅధికారులు లోకల్‌గవర్నమెంటువారు. ఈ రాజధానిలో సర్కారు సంబంధమైన పనులన్నియు చెన్నపట్టణములోనుండు గవర్నరు దొరవారిచే జరుపబడుచున్నవి. ఈదొరవారికి సహాయముగా రెండువిధములగు సభలు ఏర్పడియున్నవి. రాజ్యాంగ విషయములలో దొరవారు చేయవలసిన పనులన్నియు రెండుభాగములుగా నున్నవి. (1)చట్టనిర్మాణము (2)చట్టపరిపాలనము. ఈరెండు విధములయిన పనులనుచేయుటకుగాను (1)చట్టనిర్మాణసభ (2) కార్యనిర్వాహకసభ అనబడు రెండు సభలు ఏర్పడి యున్నవి.

చట్టనిర్మాణసభ:—ఈ సభలో రూల్సు ప్రకారముగా ప్రజలచే ఎన్నుకొనబడిన వారును, సర్కారుతరపు వారును సుమారు నలుబది అయిదు మంది మెంబర్లున్నారు. ఇది ఈరాజధానిని సరిగా పరిపాలించుటకు కావలసిన చట్టములును నిర్మాణించుటలో గవర్నరుగారికి సహాయముచేయును. సంవత్సరములో 2 లేక 3 పర్యాయములు అవశ్యమైనప్పుడు గవర్నరుగారిచే ఈసభ చేర్చబడును. మెంబర్లు వారివారి జిల్లాలయందు జనులకు కలుగు కష్టములను ఈసభ జరుగు కాలమునందు విశదముగా తెలియ

పఱచి జనులకు కావలసిన సౌకర్యములను కలిగించుటకు ప్ర యత్నించుచున్నారు. ఈసభామూలముగా జనులయొక్క కష్ట సుఖములను గవర్నమెంటువారు తెలిసికొనుటయేకాక వారిచే రాజధాని విషయమై అప్పుడప్పుడు నిర్మాణముచేయబడు చట్ట ములను జనులు ఏరీతిగా అంగీకరింతురను విషయమునుకూడ మెంబర్లు మూలకముగా తెలిసికొనుటకు వీలుగానున్నది.

కార్య నిర్వాహక సభ:—ఈసభలో ముగ్గురుమెంబర్లు గలరు. వీరిని మనచక్రవర్తిగారే నియమింతురు. వీరును గవ ర్నరుగారును కలిసి లోకల్ గవర్నమెంటువా రనబడుదురు. వీరు గవర్నరుగారికి సలహా నిత్తురు. ఒక్కొక్కరికి దాదాపుగా అయిదువేల రూపాయల జీతము. ఆసభలో ఇండియనులుకూడ మెంబర్లుగా నుండవచ్చునని చక్రవర్తిగారు 1910 సంవత్సరము తీర్మానించి బొబ్బిలి మహారాజు గారిని కవున్సిలు మెంబరుగా జేసినారు. ఆ ఆఫీసులో పనిజరుపు వారిలో ముఖ్యమైనవారు (Chief Secretary) ప్రధాన కార్యదర్శి. వీరికి సహాయము చేయుటకు ఈ రాజధాని పనులను నాలుగు భాగములుగా భాగించి ప్రతి భాగమునకు ఒక శెక్రటరీని నిర్మించియున్నారు. ఒకరు రాజధాని వరుమాన సంబంధమైన పనులను, మఱియొ కరు పబ్లికు వర్క్సుయిలాకాపనులను, మరియొకరు లోకల్ ఫం డు, మునిసిపాలిటీ, విద్య ఇలాకా, శాసననిర్మాణ సభా సంబం ధమైన పనులను, మరి యొకరు ఇనుప దారుల సంబంధమైన

పనులను గమనించు చుందురు.

వరుమానము సంబంధమైన పనులు రివిన్యూ బోర్డు వారిమూలముగా జరుపబడును. ఇనుపదారి సంబంధమైన కార్యములు దానికిగాను ఏర్పడియుండు సూపరింటెండింగు ఇంజనీరు మూలకముగా అమలుకు తీసుకొనిరాబడును. లోకల్ బోర్డు మునిసిపాల్టీ, విద్య, చట్ట నిర్మాణ సభ, వీని కార్యములలో మొదటి మూటియొక్క పనులు ఆయా ఇలాకాలకు ప్రధాన ఉద్యోగస్థులయిన ప్రెసిడెంటు, చేర్‌మన్, డైరక్టరు వీరి మూలకముగాను, చట్ట నిర్మాణ సభలయొక్క పనులు చీఫ్ శెక్రటరీ చేతను వారికి సహాయకారిగానుండు కార్యదర్శిచేతను జరుపబడుచున్నవి.

పైన చెప్పబడిన చీఫ్ శెక్రటరీకిని, తక్కిన నలువురు శెక్రటరీలకును సహాయముగా అసిస్టంటు శెక్రటరీలు ఏర్పడియున్నారు. పోలీసును, సైన్యము, న్యాయ స్థలములు, సముద్ర సంబంధమైన విషయములు, ద్రవ్య సంబంధమైన విషయములు, మొదలగు నవి చీఫ్ శెక్రటరీ చేతను వారియొక్క అసిస్టంటు శెక్రటరీల చేతను గమనింపబడును. ఈ రాజధానియొక్క జమా ఖర్చులు పైనచెప్పబడి యుండు ఉద్యోగస్థులచే సరిగా లెక్క చేయబడిన పిమ్మట సదరు లెక్కలన్నియు గవర్నరు గారి చట్ట నిర్మాణ సభయందు సభ్యులందఱికి ప్రచురపఱచి వాని విషయమై వారికిగల యభిప్రాయ

ములను, ఆక్షేపములను గమనించి కూడినంత వరకును చేయ దగిన సవరణలను జేసి కడపట వానిని ఇండియా గవర్నమెంటు వారికి తెలియ బఱచి వారి తీర్మానము ప్రకారము జఱుపుచు న్నారు.

## రివిన్యూనమూనాలు.

(1) శెటిల్‌మెంటు డిగ్లాట్ రిజష్టరు నమూనా:—

............జిల్లా.........తాలూకా.........గ్రామము. రీసర్వే శెటిల్ మెంటు రిజష్టరు.

(1) రీసర్వేనంబరు.
(2) సబుడివిజన్ (1) లెటర్.
(2) దిక్కు.
(3) ప్రాతసర్వేనంబరును, లెటరును ఉండినఎడల అది.
(4) గవర్నమెంటు లేక ఇనాము.
(5) మాగాణి, మెట్ట లేక పొరంబోక.
(6) నీరుపారుటకు జలాధారములు.
(7) ఒకపంట లేక రెండుపంటలు.
(8) భూమియొక్క తరగతి సాయిల్.
(9) తరం.
(10) యెకరము ఒకటింటికి తీరువ రేటు.
(1) రూపాయి.
(2) అణా.

(11) విస్తీర్ణము (1) ఎకరములు.
(2) సెంట్లు.

(12) తీరువ రూపాయలు- అణాలు.

(13) పట్టాదారుడు లేక ఇనాముదారునిపేరు; లేక పొలము దేనికిచేరినదో సత్రం గుడి మొదలగు. వానియొక్క మేనేజరు పేరు.

(14) షరా.

(11.) దరఖాస్తు నమూనా.

| పొలముయొక్క నంబర్లు. | విస్తీర్ణము. | | తీరువ. | | | ఎల్లలు. |
|---|---|---|---|---|---|---|
| | యెకరం | సెంట్లు, | రు. | అ. | పై. | |
| | | | | | | |

సంవత్సరం.....మాసం..... తేది.....

చేవ్రాలు.

## (III) ఇ స్తిభా నమూనా

జిల్లా.................తాలూకా.................

పట్టాదారుని పేరు.................................

గ్రామము పేరు.................................

| సర్వే నెంబరు. | సర్వే నెంబరు యొక్క భాగముల ను దెలుపు అక్షరము లు లేక అంకెలు. | విస్తీర్ణము. | | తీరువ. | | | మెట్ట లేక మాగాణి. | షరా. |
|---|---|---|---|---|---|---|---|---|
| | | యెకరములు. | సెంట్లు. | రు. | అ. | పై. | | |
| | | | | | | | | |

సం నెల తేది

చేవ్రాలు.

## (IV) పట్టానమూనా.

ఫసలీపట్టా......జిల్లాకలక్టరైన.. ...దొరవారిచే......
తాలూకా.....గ్రామకాపు అయిన.....వానికి సం.... .నెల .....
తేది...లో ఇవ్వఁబడినపట్టా.

ఈ పట్టాలో కనపఱచియుండు మొత్తము ఈ క్రింద వివరింపబడియుండు కిస్తీ బంది ప్రకారము మణియగారుని వద్ద చెల్లించవలెను.

మాసాలతరం కిస్తీ.

| మాసముపేరు. | వంతున. | | |
|---|---|---|---|
| | రు. | అ. | పై. |
| (1) ............ | | | |
| (2) ............ | | | |
| (3) ............ | | | |
| (4) ............ | | | |

## స్వాధీనములో నుండు పొలములయొక్క వివరము.

| మెట్ట లేక మాగాణి. | సర్వే నంబరు. | సర్వేనంబరులోనిభాగములు | తరం లేక తరగతి. | విస్తీర్ణము. | | తీరువ. | | | షరా. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | యెకరములు | సెంట్లు | రు. | అ. | పై. | |
| | | | | | | | | | |

పట్టాలో దాఖల్ చేయబడియుండు తీరువ ఐనది భూమియొక్క ఉపరిభాగమునందు చేయబడు సాగుబడిమహాసూలులో గవర్నమెంటువారి భాగముయొక్క మదింపును మాత్రమే తెలియపఱచుచున్నది. భూమిలో లోహపదార్థములు త్రవ్వి తీయబడిన ఎడల అప్పుడు ఈభూమి వేఱువిధములైన తీరువలకు లోబడును.

కలక్టరు.

## (V) పట్టాట్రాన్సుఫరు నమూనా.

...జిల్లా......తాలూకా......గ్రామములో నివసించు ... ...
యొక్క కుమారుడు లేక కుమారులు అయిన నేను ఈ క్రింద ఇవ్వ
మేము

బడియుండు షెడ్యూలలో కనపరచబడ్డ భూములను వాని ను
ద్దేశించి నాపేర నుండు పట్టాను......గ్రామములో నివసించు
మాపేర

......కుమారుడు......యొక్క పేరట మార్చుటకు అనుగ్ర
హింతురని ఇందుమూలకముగా వేడుకొనుచున్నాను. (లేక వే
డుకొనుచున్నాము.)

సం...నెల...తేది...

చేవ్రాలు.

పట్టామార్చుకొను వారల యొక్క స్టేటుమెంటు.

పైన చెప్పబడిన నేను షెడ్యూలలో కనబరచియుండు భూముల
మేము

సంబంధమైనపట్టాలను నాపేరట లేక మాపేరట మార్చుకొను
టకు పైనచెప్పిన నేను లేక మేము ఇందుమూలముగా ఒప్పుకొను
చున్నాను లేక ఒప్పుకొనుచున్నాము.

సం...నెల...తేది...

చేవ్రాలు.

షెడ్యూలు.

| తాలూకా | గ్రామము | సర్వే నంబరు | మెట్ట లేక మాగాణి. | విస్తీర్ణము. | తీరువ మొత్తం. | షరా. |
|---|---|---|---|---|---|---|
| | | | | | | |

19......సం......మాసం......తేది అయిన ఈదినము ఉభయపార్టీలును మాయెదుట వారివారి చేవ్రాళ్లు చేసినారు.

మొదటిభాగములో చేవ్రాలు చేసియుండువారు పట్టాదార్లు.

సం... మాసం... గ్రామాధికారి చేవ్రాలు.

## IX ఇతర వచ్చుబడులు.

(1) ఉప్పు:—ఇది సర్కారు వారికి ముఖ్యమైన వచ్చుబడి. మిక్కిలి బీదవాడు కూడ ఈపన్ను చెల్లించుచున్నాడు. బీదజనులు వారి క్షేమరక్షణలకు బదులుగా ఈపన్ను సర్కారువారికి ఇచ్చుచున్నారు. సూర్యకిరణముల సహాయముచే సముద్రపు నీటినుండి ఉప్పు తీయుచున్నారు. రాజపుత్రస్థానములోనుండు ఉప్పునీళ్ళచెరువులలోనుండికూడ ఉప్పు తీయబడుచున్నది. పంజాబు మాగాణములలో ఱాతిఉప్పు గనులలో చిక్కుచున్నది. చెన్నపట్టణములో సెంట్రల్ స్టేషన్‌కు ఒక మైలు దూరములో నుండు సాల్టు కొఠారులు అని చెప్పబడు స్థలములో విశేషముగా ఉప్పువ్యాపారము జరుగుచున్నది. ఇటువంటి స్థలములు ఈ రాజధానిలో సుమారు 70 వఱకు ఉన్నవి. ఉప్పు ప్రతి సంవత్సరమును నాలుగుకోట్లు మణుగులకు ఎక్కువగా ఖర్చు అగుచున్నది. ఇటువంటి ఉప్పుకొఠారులు సుమారు 20 వఱకు సర్కారు వారి అధీనములోను, సుమారు 50 వఱకు స్వదేశవర్తకుల అధీనములోను ఉన్నవి. సంవత్సరమునకు సాధారణముగా ప్రతిమనిషియును రూ0-5-0 వంతున ఇచ్చుచున్నాడు. ఇది బీదజనులకు మిక్కిలి భారముగా నుండు ననితలంచి పన్నును తగ్గించుటకు సర్కారువారు ప్రయత్నపడి 1903 వ సంవత్సరములో ఒక మణుగుఉప్పుఖరీదు రూ 2- 8- 0 లనుండి రూ 2-0-0 లకును, తరువాత $1\frac{1}{2}$

రూపాయకును తగ్గించి కడపట 1908. సంవత్సరములో మణుగు ఒకటికి 1 రూపాయు చొప్పున ధరను ఏర్పాటుచేసిరి.

(2) అబ్కారీ:— సారాయి, కల్లు, గంజాయి మొదలగునవి సర్కారువారి ఉత్తరువు లేక అమ్మకూడదు. ఈ ఉత్తరువుకు లైసన్సు అనిపేరు. లైసన్సుపొందగోరువారు కొంత పైకము చెల్లించవలెను. పైచెప్పబడిన సామానులను అమ్మువారు లైసన్సు కొఱకు ఖర్చుచేసిన మొత్తమును సరుకుల యొక్కఖరీదుతో కలిసి, వానివెలను కొంతవఱకు హెచ్చించి లైసెన్సు కొఱకు చెల్లించిన మొత్తమును జనులవద్ద నుండి రాబట్టుకొనుచున్నారు. జనులు ఇటువంటి చెడ్డ వస్తువులను సులభముగా కొనకుండుటకే ఈవస్తువుల వ్యాపారము చేయువారు లైసెన్సు పొందవలయునని సర్కారువారు విధించియున్నారు. అయినను జనులు మూఢత్వముచేతను మనోదార్ఢ్యము లేనికారణముచేతను దురభ్యాసములకు లోబడి మత్తుపదార్థములను ఎక్కువగా ఉపయోగించి చెడిపోవుచున్నారు. ఈసరుకుల వ్యాపారముయొక్క వచ్చుబడిసర్కారువారి ఎన్నికకంటె అధికముగానే వచ్చుచున్నది. ఈయిలాకా వచ్చుబడి వసూలు చేయుటకును ఈవ్యాపారము జరుగునట్టి స్థలములను పరీక్షించుటకును అనేక తరగతుల ఉద్యోగస్థులు ఏర్పడియున్నారు. ఉద్యోగస్థులపేర్లు:—సబు ఇన్‌స్పెక్టరు, అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు, ఇన్‌స్పెక్టరు, అసిస్టెంటుకమీషనర్, డిప్యూటీక

మిషనర్. వీరందఱును రివిన్యూ బోర్డు మెంబర్లలో ఒకరైన సాల్టుఅండ్ అబ్కారీ కమిషనర్‌కు లోబడి పనిచేయవలెను.

3. ఆదాయపుపన్ను (Incometax):— 1857 సంవత్సరములో జరగిన గొప్పకలహముచే సర్కారువారికి విశేషముగా ద్రవ్యనష్టము ఏర్పడెను. ఈనష్టమును రాబట్టు కొనుటకుఒకవిధమైన పన్ను విధించుట అవశ్యమైనందున 1860 సంవత్సరములో ఆదాయపుపన్ను (ఇన్కమ్‌టాక్సు) అనిచెప్పబడు ఒక పన్ను ఏర్పాటుచేసిరి. ఇప్పుడు సంవత్సరము 1. కి రూ1000 లకు పైన 2000 రూ. ల వఱకు వచ్చుబడి గలవారు రూపాయకు రూ 0-0-4 వంతునను రూ 2000 లకు ఎక్కువ ఆదాయము గలవారు రూపాయకు రు0-0-5 పైసల వంతునను పన్ను చెల్లించవలయునని విధించియున్నారు.

4. ఎగుమతి దిగుమతి సరకులు:—హిందూ దేశమునుండి ఇతరదేశములకు పంపబడు సరకుల మీదను ఇతరదేశములనుండి ఈదేశమునకు దిగుమతి చేయబడు సరకుల మీదను సర్కారువారుపన్ను విధించి యున్నారు. ఈరెండు పన్నులును వ్యాపారము చేయువారి వద్దనుండి వసూలు చేయబడినప్పటికిని వాస్తవమున వీనిని చెల్లించువారు జనులే. ఎట్లనగా వర్తకుడు తాను చెల్లించు పన్నును సామానులయొక్క ఖరీదుతో కలిపి, కొన్న వెలకంటె ఎక్కువ వెలకుఅమ్ముటచేత జనులవద్దనుండి ఈపన్ను కూడ వసూలు చేయబడుచున్నది.

ఇండియాలోనుండి ఇతరదేశములకు పంపబడు ప్రత్తిని ఉదాహరణముగా తీసికొనెదము, ఇతరదేశములనుండి వర్తకులు ఈ దేశమునకు వచ్చి ప్రత్తిని ఖరీదుచేసి, ఆసరకుమీద విధింపబడు సర్కారు పన్నును చెల్లించి, వారిదేశమునకు తీసికొని పోవుచున్నారు. అక్కడ చేతిపనుల సహాయము చేతను, యంత్రముల సహాయము చేతను, దానిని వస్త్రములుగా మార్చి, వానిని హిందూదేశమునకు పంపుచున్నారు. ఈ సరకులమీద విధింపబడు దిగుమతి పన్నును స్వదేశ వర్తకులే చెల్లించి, దానిని సరకుల ఖరీదుతో కలిపి జనులకు అమ్మునపుడు వారివద్ద నుండి వసూలు చేయుచున్నారు. ఈ ఎగుమతి దిగుమతి పన్నులను సర్కారువారు క్రమముగా తక్కువచేయుచున్నారు. ఇప్పుడు ఇతర దేశముల నుండి వచ్చు దూదిసరకులకును, ఈదేశములో యంత్రశాలలలో నేయబడు వస్తువులకును నూటికి $2\frac{1}{2}$ వంతున పన్ను విధించియున్నారు. సీమ వస్త్రములు, కిరుసనాయిలు, వెండి, తుపాకి, తుపాకిమందు సారాయి, చక్కెర మొదలగు కొన్నిటికి మాత్రమే పన్ను వసూలు చేయుచున్నారు.

5. నల్లమందు:—ఇది పాపీ అని చెప్పబడు ఒకవిధమైన చెట్టుయొక్క పాలనుండి చేయబడుచున్నది. ఈచెట్లను విశేషముగా బేహారు, బంగాళము, ఆగ్రా, అయోధ్యా, పంజాబు, మాళ్వ మొదలగు దేశములలో సర్కారువారి ఉత్తరువును

పొంది పైరు చేయుచున్నారు. నల్లమందు హిందూదేశములో విశేషముగా ఖర్చులేదు. చీనావారు నల్లమందును అపరిమితముగా ఉపయోగించుచున్నారు. వారు దీనిని ఉపయోగింపకయుండు కొఱకు సర్కారువారు దీనిమీద పన్ను విధించియుండియు ఆ దేశమునందు ఈ నల్లమందు విశేషముగా ఖర్చు అగుచునేయున్నది. దీనిచే సర్కారువారికి ఒకవిధమైన వచ్చుబడి కూడ లభించుచున్నది.

6. ఇనుపదారులు:—ఇనుపదారు లన్నియు ఇంగ్లీషు కంపెనీ వారలచే నిర్వహింపబడి వానిసంబంధమైన పనులన్నియు వారివల్లనే జరుపబడుచున్నవి. హిందూదేశములో అనేక స్థలములయందు ఇనుపదారులు వేయబడియున్నవి. ఇనుపకమ్ములు, పెట్టెలు, ఇంజనులు మొదలగునవి అనేకములు కావలసియుండును. స్టేషనులు, వంతెనలు కావలసినన్ని కట్టవలెను. బండ్లు కాలము తప్పకుండ పోవునట్లుచేయుటకు కావలసినంత సిబ్బంది ఉండవలెను. ఇనుపదారులు వేయుటకును, స్టేషన్లుకట్టుటకును కావలసినస్థలములను డబ్బు పెట్టి కొనవలెను. ఇటువంటి ఖర్చులకు కావలసిన పెట్టుబడిధనమును సర్కారువారు కంపెనివారికి అప్పుగానిచ్చి రైలుప్రయాణికుల మూలమునను, సరకుల మూలమునను, కంపెనివారికి వచ్చిన ఆదాయములో వారివద్ద నుండి కొంచెముకొంచెముగా వసూలుచేసి అసలుకును వడ్డీకిని చెల్లుపెట్టుకొనుచు కొద్దిలాభమును కూడ పొందుచున్నారు.

ఇదియే సర్కారువారికి ఇనుపదారులవల్ల లభించువచ్చుబడి.

7. తపాలు-తంతి:—ఈ సంబంధమైన కార్డులు, తపాల్ బిళ్ళలు మొదలగువానివల్లను, మణిఆర్డర్, రిజష్టరుచేయుట, ఇన్‌ష్యూరెన్సు చేయుట, వీనివల్ల వచ్చు రుసుములచేతను, పార్సలుకూలి, తంతికూలి, ఇంకనుకొన్ని చిల్లర వ్యాపారముల చేతను సర్కారువారికి కొంతవచ్చుబడి ఏర్పడుచున్నది.

8. స్టాంపులు.—స్టాంపుబిళ్ళలనియు, స్టాంపుకాగితము లనియు, స్టాంపులు రెండువిధములు. తపాలాఫీసు మూలక ముగా పంపబడు జాబులమీదను, తంతినమూనాలమీదను, కోర్టులో దాఖలుచేయబడుఫిర్యాదు, వకాల్తు మొదలగు దస్తా వేజులమీదను అంటించవలసిన బిళ్ళలు ఒకవిధమైనస్టాంపులు. క్రయదస్తావేజులు, తాకట్టుపత్రములు, పారీకత్తులు మొదలగు పత్రములువ్రాయుటకు ఉపయోగింపబడు సర్కారుముద్రగల కాగితములు రెండవవిధమగుస్టాంపులు. కోర్టుడిక్రీలవంటిసర్కారు దస్తావేజులయొక్క నకళ్లు తయారుచేయుటకు 0-2-0 ముద్రలు గలకాగితములకు (Copy Stamps) కాపీస్టాంపులనిపేరు. పైచెప్పబడిన స్టాంపులు ఇంగ్లాండులో చేయబడి హిందూదేశము నకు పంపబడుచున్నవి. ప్రతిరాజధానిలోను స్టాంపులవిషయము లను గమనించుటకు ప్రత్యేకముగా ఒక ఆఫీసు ఉన్నది. దీనికి అధికారి సూపరింటెండెంటు. ఈ ఆఫీసును, దీని అధికారి యును ప్రధానపట్టణములో నుండవలెను. స్టాంపుల వచ్చుబడి

అంతయు రివిన్యూబోర్డువారి ఆధీనములో నున్నది. ప్రతి జిల్లాలోను స్టాంపులవచ్చుబడి లెక్కలను జిల్లాకలక్టరు తనిఖీ చేయవలెను. వారు ట్రెజరీ కలక్టరుగారి స్వాధీనములో స్టాంపు పనుల నన్నిటిని ఒప్పజెప్పుదురు. ప్రతిసంవత్సరమును స్టాంపు సంబంధమైన జమాఖర్చు లెక్కల రిపోర్టును స్టాంపుసూపరింటెండెంటువారు రివిన్యూబోర్డువారికి పంపవలెను.

స్టాంపు సూపరింటెండెంటు రాజధానికి కావలసినస్టాంపులను ముందుగానే తెప్పించిపెట్టుకొని, జిల్లాకలక్టర్లకు కావలసినంతవరకు సప్లయి చేయవలెను. ప్రతిఖజానాలోను స్టాంపులు అమ్ముటకు కావలసిన ఏర్పాటులు చేసియున్నారు. ఏబది రూపాయలకు పైబడిన కోర్టుఫీస్టాంపులను స్వయముగా ఖజానాలోగాని, స్టాంపుసూపరింటెండెంట్లవద్దగాని పుచ్చుకోవలెను. తాలూకాఖజానాలోనిస్టాంపులు తహశ్శీల్‌దారు, డిప్టి తహశ్శీల్‌దారు వీరిస్వాధీనములోనుండును. వీరికి కావలసిన స్టాంపులను జిల్లాకలక్టరువద్దనుండి తెప్పించుకోవలెను. తాలూకా ఖజానాలోనుండి స్టాంపులను కొని అమ్ముటకు కలక్టరువారి అనుమతి బొందవలెను. ఈరీతిగా స్టాంపులను అమ్ముటకు అధికారము పొందియుండువారలకు స్టాంపువెండర్లుఅని పేరు. స్టాంపులు అమ్ముటకు నూరు రూపాయలకు రూ. 6-4-0 కంటె హెచ్చకుండ కమీషన్ ఏర్పాటుచేసి యున్నారు.

స్టాంపుల ఖరీదు వాపసు:—కోర్టుఫీస్టాంపులు గాని

స్టాంపుపత్రములు గాని వ్రాయునపుడు చెడిపోయినను, కొన్న తరువాత వానిని ఉపయోగించుటకు అవశ్యము లేక పోయినను రూపాయకు ఒక అణావంతున తగ్గించుకొని, క్రొత్త స్టాంపును గాని లేక దాని క్రయమును గాని తిరిగి ఇచ్చివేయుదురు. అయితే స్టాంపులు కొన్న తేది మొదలు ఆఱుమాసముల లోపల జిల్లా కలక్టరుగారికి మనవి చేసికొనవలెను.

ఈ స్టాంపు లన్నియు సర్కారువారు మనకు చేయు ఉపకారమునకు బదులుగా మనము వారికి ఇచ్చునట్టి పైకము అని చెప్పవచ్చును. తపాలు, తంతి వీనిమూలకముగా సమాచారములను పంపవలసి నప్పుడు బిళ్లలు అంటించ వలసి యున్నది. ఈ బిళ్లల వచ్చుబడివల్ల ఈ ఇలాకా సిబ్బంది సమూహములను నిర్వహించుచున్నారు. స్టాంపు పత్రముల వచ్చుబడివల్ల న్యాయస్థలములను, న్యాయాధికారులను నెలకొల్పుచున్నారని చెప్పవచ్చును. ఈ కారణము చేతనే రిజస్టరు చేయుటకును డబ్బు తీసికొనుచున్నారు. పైన చెప్పబడిన వచ్చుబడిలో ఖర్చుపోగా మిగిలియుండు పైకమును దేశము యొక్క ఇతర ఖర్చులకు ఉపయోగించుచున్నారు.

## 1907—08 సంవత్సరములలో ఇండియా గవర్నమెంటు వారి జమాఖర్చు వివరము.

| | విషయము. | జమ కోట్లు | జమ లక్షలు | ఖర్చు కోట్లు | ఖర్చు లక్షలు |
|---|---|---|---|---|---|
| 1. | భూమి శిస్తు. ... ... | 28 | 7 3/4 | 5 | 25 |
| 2. | నల్లమందు. ... ... | 7 | 8 | 2 | 50 |
| 3. | ఉప్పు. ... ... | 5 | 3/4 | 4 | 50 |
| 4. | స్టాంపులు. ... ... | 6 | 39 | — | 5 |
| 5. | ఆబ్కారీ. ... ... | 9 | 34 | — | 44 1/4 |
| 6. | రోడ్డు శెస్సు. ... ... | — | 78 3/4 | — | 3/4 |
| 7. | ఎగుమతి దిగుమతులు. ... | 7 | 50 | — | 31 |
| 8. | వచ్చుబడిపన్ను. ... ... | 2 | 25 1/3 | — | 3 |
| 9. | అడవిఇలాకా. ... ... | 2 | 60 | 1 | 46 3/4 |
| 10. | రిజస్ట్రేషన్. ... ... | — | 62 1/4 | — | 32 |
| 11. | తపాల్. ... ... | 2 | 73 | 2 | 56 3/4 |
| 12. | తంతి. ... ... | 1 | 49 | 1 | 28 |
| 13. | చట్టములు నీతివిషయములు. ... | — | 77 3/4 | 5 | 82 |
| 14. | పొలీసు. ... ... | 2 | 23 | 5 | 71 1/4 |
| 15. | విద్య. ... ... | — | 21 3/4 | 2 | 22 |
| 16. | వడ్డీ. ... ... | 1 | 40 | — | — |
| 17. | వైద్యము. ... ... | 0 | 7 3/4 | — | — |
| 18. | స్వదేశరాజుల కప్పములు. ... | 0 | 87 1/2 | — | — |
| 19. | ఇతరవచ్చుబడులు.... ... | 28 | 28 | 2 | — |
| 20. | రాజధాని పరిపాలన ఖర్చు. ... | — | — | 5 | ... |
| 21. | పెన్షన్ ... ... | — | — | 1 | 26 |
| 22. | కలము కాగితము గుడ్డ మొదలై | — | — | 4 | 1 |
| 23. | కరువు రిలీఫ్ ఫండు.... (నవి. | — | — | — | 93 |
| 24. | నీరు పారించుట ... ... | — | — | 4 | 25 |
| 25. | సైన్యము. ... ... | — | — | 24 | 75 |

| | | | | కో | ల |
|---|---|---|---|---|---|
| 26. | ఇతర ఖర్చులు. వడ్డి, వైద్యము మొదలగునవి. | — | — — — | 39 | 35 |
| | | 106 | 51 3/4 | 106 | 4 |

1907—08 సంవత్సరములలో చెన్నపురి గవర్న మెంటు వారి జమాఖర్చు వివరము

| విషయములు. | జమా | | ఖర్చు | |
|---|---|---|---|---|
| | కోట్లు | లక్షలు. | కోట్లు | లక్షలు. |
| 1 భూమిశిస్తు. ... ... | 5 | 37 | 1 | 18 1/2 |
| 2 నల్లమందు ... ... | ఇండియా గవర్న మెంటు వారి జమా ఖర్చులతో కలుపబడియున్నది. | | | |
| 3 ఉప్పు. ... ... | 1 | 22 | 0 | 20 1/2 |
| 4 స్టాంపులు ... ... | 1 | 5 | 0 | 4 |
| 5 ఆబ్కారీ. ... ... | 2 | 30 | 0 | 10 |
| 6 రోడ్డు శెస్సు ... ... ...... | 0 | 75 | ఇతర ఖర్చులతో కలుపబడియున్నది. | |
| 7 ఎగుమతి దిగుమతులు. ... | 0 | 64 | — | 3 |
| 8 వచ్చుబడిపన్ను ... ... | 0 | 30 | — | 1/3 |
| 9 అడవిఇలాకా. ... ... | 0 | 39 | — | 27 3/4 |
| 10 రిజష్ట్రేషన్. ... ... | 0 | 19 | — | 10 |
| 11 తపాల్. ... ... | ఇండియా గవర్న మెంటు జమాఖర్చులతో కలుపబడి యున్నది. | | | |
| 12 తంతి. ... ... | డిటో | | డిటో | |
| 13 చట్టము. ... ... | 0 | 13 0 | | 65 |
| 14 పోలీసు. ... ... | 0 | 4 3/4 | | 65 |
| 15 విద్య. ... ... | 0 | 5 1/2 | | 46 1/2 |
| 16 వడ్డి. ... ... | ఇండియా గవర్న మెంటు వారి జమా ఖర్చులతో కలుపబడియున్నది. | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 17 వైద్యము. | ... | 0 | 2 | 0 | 36 |
| 18 స్వదేశరాజులకప్పము... | | 0 | 45 | 0 | |
| 19 ఇతర వచ్చుబళ్లు గడచిన సంవత్సరం మిగిలినదానితో సహా. | | 4 | 32 | | |
| 20 రాజ్యపరిపాలన ఖర్చు. | | — | — | — | 17 1/2 |
| 21 పెన్షను. | ... [నికి. | | | | 23 |
| 22 కలములు కాగితములు మొదలగువా | | | | | 19 |
| 23 కరువు రిలీఫ్ ఫండు | ... | ఇతరఖర్చులతో కలుపబడియున్నది. | | | |
| 24 నీరుపారించుట. | ... | — | — | — | 59 |
| 25 సైన్యము. | ... | ఇండియా గవర్నమెంటువారి ఖర్చులతో కలుపబడియున్నది. | | | |
| 26 ఇతరఖర్చులు, రోడ్డు సెస్సు రైలు మొదలగునవి. | | — | — | 3 | 81 1/4 |
| మొత్తము. | | 16 | 33 1/4 | 9 | 6 |

పైన కనబఱచియుండు ప్రకారము జమలో ఖర్చుపో గా మిగత పైకములో కొంతభాగము ఉంచుకొని తక్కిన పైక మును ఇండియా గవర్నమెంటువారికి ఈరాజధానికొఱకు వా రిచే వ్యయముగా చేయబడు తపాల్, తంతి, రైలు, సైన్యము, ఐరోపా ఉద్యోగస్థుల పెన్షన వీనిఖర్చుల కొఱకు ఇచ్చి వేయు చున్నారు.

1907—08 సంవత్సరములలో చెన్నపురి రాజధానిలో విద్య ఇలాకాయొక్క జమ పిల్లలజీతములు మొదలగునవి కలిపి $5\frac{1}{5}$ లక్షలు. ఈ విద్య ఇలాకావిషయముగా ఈ రాజధానిలో సర్కారుమూలకముగాను లోకల్ ఫండు మూలకముగాను చేయబడు ఖర్చులవివరము.

| నెం. | వివరము. | ఖర్చు లక్షలు. |
|---|---|---|
| | సర్కారు వారిచే. | |
| 1 | సర్వకళాశాల. ... ... | 3 1/2 |
| 2 | డైరక్టరు - వారిసిబ్బందులు. ... ... | 1/8 |
| 3 | ఇన్స్పెక్టరు మొదలగు అధికారులు. ... | 5 1/5 |
| 4 | కాలేజీలు. ... ... | 2 |
| 5 | చేతిపనుల కాలేజీలు. ... ... | 2 |
| 6 | సర్కారు సాధారణపాఠశాలలు. ... | 2 |
| 7 | సర్కారు చేతిపనుల పాఠశాలలు. ... | 2 1/2 |
| 8 | ద్రవ్యసహాయము. ... ... | 7 |
| 9 | బీదవిద్యార్థుల కివ్వబడు ద్రవ్యసహాయము. ... | 1/2 |
| 10 | ఇతరఖర్చులు. ... ... | 3/4 |
| | లోకల్ బోర్డువారిచే. | |
| 1 | పరీక్షాధికారులు_సిబ్బందిఖర్చు. ... | 1 1/2 |
| 2 | సాధారణపాఠశాలలు. ... ... | 9 1/2 |
| 3 | చేతిపనుల పాఠశాలలు. ... ... | 3/4 |
| 4 | గ్రాంట్లు. ... ... | 8 1/4 |
| 5 | ఇతర ఖర్చులు. ... ... | 1/ |
| | మొత్తము. | 46 1/4 |

పాఠశాలల తనిఖీచేయు అధికారులలో క్రిందిఅధికారులైన సూపరువైజర్లయొక్క ఖర్చు లోకల్ బోర్డువారిది.

## X. (Forest Department) అడవిఇలాకా:—

పూర్వకాలములో హిందూదేశము అనేక భాగములుగా భాగింపబడి స్వదేశ రాజులచేపరిపాలింపబడెను. ఒక దేశమునకును మఱియొక దేశమునకును అడవులే ఎల్లలుగా ఏర్పడియుండెను. వీనిలోని అపరిమితములగు దుష్టమృగములను రాజులు సర్వదా వేటాడుచుండువారు. అడవులవలన ఈదేశమునకు అనేకవిధములైన ప్రయోజనములు కలుగుచుండెను. అడవులలో గొప్పవృక్షములు, చిన్నచెట్లు, మొదలగునవి క్రిక్కిరిసి ఉండుట భూమి ఎండిపోక చల్లగానుండుటకు కారణమైయుండెను. వృక్షముల యొక్క వేరులు నీటిని పీల్చుకొను స్వభావముకలవి గనుక భూమి మట్టమునకు క్రిందఎప్పుడును చెమ్మగానే ఉండును. దీనిచే ఊటలు కలుగుచుండెను. ఈ అడవులయొక్క చల్లదనముచే మేఘములు చల్లనిగాలిని పొందుగాన అప్పుడప్పుడు చక్కగా వర్షములు కురియుచుండెను. క్రీస్తుపుట్టుటకుసుమారు 2000 సంవత్సరములకు ముందె మధ్య ఆశియాలోనిజనులు హిందూదేశములో కాపుర ముండుటకై హిమాలయపర్వతములయొక్క పశ్చిమోత్తరకనుమలగుండ వచ్చిరి. మొట్టమొదటవచ్చిన జనులకు తురేనియనులు అని పేరు. తరువాత ఆర్యులు వచ్చిరి. వీరే

మనయొక్క పితామహులు. వీరు మొదట ఉత్తరహిందూదేశ మునకు వచ్చి ఉనికిపట్లు ఏర్పాటుచేసికొనిరి. కాలక్రమమున దక్షిణ హిందూదేశమంతయు వ్యాపించిరి. వీరికి తర్వాత పశ్చిమములోనుండి పారసీకులును, తర్వాత ఐరోపాలోనుండి గ్రీకులును, ఆఫ్గనిస్థానములోనుండి మహమ్మదీయులును, తరువాత డచ్చివారు, డేనులు, ఫ్రెంచివారు, అంగ్లేయులు మొదలగు ఐరోపాఖండవాసులును ఒకరివెంబడి నొకరుగా ఈదేశమునకు వచ్చిరి. ఈరీతిగా జనులు ఎక్కువ కాను కాను వారు నివసించుటకు స్థలముకూడ ఎక్కువ కావలసివచ్చెను. అప్పుడు చాల అడవులను నాశముచేసి వానిని ఇండ్లు కట్టుకొని నివసించుటకు అర్హమైనప్రదేశములుగా చేసికొనిరి. చాల అడవులు ఈ రీతిగా నశించుటతోడనే క్రమేణవర్షములుకూడ తగ్గిపోయెను. వర్షము లేనికారణముచే కఱవులును, గొప్పవ్యాధులును ప్రబలమయ్యెను. అడవులను నాశము చేయుటవల్ల వర్షకారణమునకు ముఖ్యసాధనములయిన వానిలో నొకటి లేకపోవుచున్నది అనువిషయము గమనింపరైరి. కాలక్రమమున అడవులు వర్షము కలుగజేయుటకు ముఖ్యసాధనమని కనుగొని ఇప్పుడు వానిని సంరక్షించుటకు ఏర్పాటులు చేయబడి యున్నవి. ఈ అడవులను సర్కారువారు ఎక్కువగా వృద్ధిచేసి, ఎక్కువ జాగ్రత్తతో రక్షించుటకు ముఖ్యకారణ మేమనగా మునుపటివలె దేశము చల్లబడుటకును, సర్కారువారికిని ఇతరులకును కావల

సినచెట్లు కష్టము లేకుండ పెంచుటకును అని చెప్పవచ్చును.

ఈ దేశములోనుండు అడవులను రెండు భాగములుగా భాగింపవచ్చును. (1) సర్కారువారు అడవి ఇలాకావారి స్వాధీనములో నుంచి రక్షించు అడవిప్రదేశములు. (2) గ్రామములను ఆనుకొనియుండు చిన్నతోపులు, అడవులు. ఇవి గ్రామాధికారులయొక్క స్వాధీనములో నున్నవి. సర్కారు పన్ను వసూలుచేయు ఇతర అధికారులుకూడ ఈ చిన్న అడవులను గమనించుచు తగినవారికి గుత్తగా ఇచ్చి సర్కారువారికి వచ్చుబడి వచ్చునట్లుగా ఏర్పాటు చేసియున్నారు. సర్కారు అడవి ఇలాకా స్వాధీనములో నుంచబడు గొప్ప అడవులలోనుండి సర్కారు కట్టడములకు కావలసిన టేకు మొదలగుచెట్లు చిక్కుచున్నవి. జనులకు కావలసిన వంటకట్టెలు సమృద్ధిగా అల్పఖరీదుకు ఇవ్వబడుచున్నవి. కొండల ప్రదేశములలో 3 పైసలు ఇచ్చినయెడల ఒక మనిషి మోయఁగలిగినన్ని కట్టెలు తీసికొనిరావచ్చును. అడవులలో అనేకవృక్షములు వానియంతట అభివృద్ధియగుచున్నవి. పనస, మామిడి, చింత మొదలగుఉపయోగములైన పండ్లదినుసులు దొరకుచున్నవి. తేనె,అడవిమృగములయొక్క చర్మములు, అనేకదినుసుల విత్తనములు ఇవి అన్నియు చిక్కును. పశువులకు ముఖ్యమైన పచ్చిమేత సమృద్ధిగా నుండును. మాగాణిభూములకు ఎరువుగా కావలసిన ఆకు అలములు లభించుచున్నవి. అడవులలో చెట్లను కొట్టుటకును, పశు

వులను మేపుటకును సర్కారువారు పన్ను విధించియున్నారు. కొన్ని సమయములందు అడవులు కాలిపోవుటవల్ల నష్టములు కలుగుచున్నవి. ఇటువంటి నష్టములను నివారణ చేయుటకును, అడవులను రక్షించుటకును సిబ్బందులను ఏర్పాటు చేసియున్నారు.

అడవి ఇలాకా ఉద్యోగస్థులయొక్క వివరము:—

ఈరాజధాని అడవి ఇలాకా సంబంధముగా ఉత్తరసర్కిలనియు, మధ్యసర్కిలనియు, దక్షిణసర్కిలనియు మూడుభాగములుగా భాగింపబడి యున్నది. ప్రతి సర్కిలును ఫారెస్టుకన్‌సర్‌వేటర్ అని చెప్పబడు ప్రధానోద్యోగస్థుని అధీనములోనుండును. ఫారెస్టు కన్‌సర్‌వేటర్లకు పై అధికారులు రివిన్యూ బోర్డువారు. ప్రతిసర్కిలును పెక్కు జిల్లాలుగా భాగించియున్నారు. ఈ జిల్లాలు ఒక్కొకటియు విస్తీర్ణములో రివిన్యూ జిల్లాకు సమానమని చెప్పవచ్చును. ప్రతిజిల్లాయును ఒకఫారెస్టు ఆఫీసరు ఆధీనములో నున్నది. ఒక్కొక్కజిల్లాను అనేక రేంజీలుగా భాగించి యున్నారు. ఈ రేంజీల అధికారికి రేంజర్ (Ranger) అని పేరు. ఈ రేంజర్లు ఫారెస్టుఆఫీసరకు లోబడి పనిచేయవలెను. ఈ రేంజర్ల స్వాధీనములో [illegible] ప్రదేశములను సంరక్షణ చేయుటకును వానిని తనిఖీ చేయుటకును సహాయకారులుగా ఫారెస్టర్లనియు గార్డులనియు పిలువబడు కొందఱిని చిల్లర ఉద్యోగస్థులను నియమించి యున్నారు. రేంజరు ఉద్యోగములోనున్న దా

నికి పైబడిన ఇతర ఉద్యోగములోను ప్రవేశించుటకు ఇష్టపడు వారు ప్రత్యేకముగా వీరికొఱకు ఏర్పడి యుండు ఒక పాఠశాలలో తర్ఫీయతు పొంది పరీక్షలో తేరివచ్చిన వారిని మాత్రమే ఈ ఇలాకాలో గొప్ప ఉద్యోగస్థులుగా నియమించి యున్నారు. ఈ దేశములో నుండు అడవులయొక్క విస్తీర్ణము సుమారు 87000 చదరపుమైళ్లు.

## XI. లోకల్ సెల్ఫ్ గవర్నమెంటు.

### Local Self Government.

ఈదేశములో పూర్వకాలమునుండి జనులు ఒక పెద్దకు లోబడినడచుకొనుటయు, ఒక కుటుంబము వారు ఆ కుటుంబములో పెద్దవారికి లోబడియుండుటయు, ఒక మతసిద్ధాంతమును అనుష్ఠించువారు ఆమతగురువునకు లోబడియుండుటయు ఈరీతిగా లొంగినడచుకొను స్వభావము ఈదేశీయులకు పారంపర్యముగా నేర్పడియున్నది.

పూర్వకాలమందె ఒక గ్రామమునకును దానికి మిక్కిలి సమీపములోనుండు మఱియొక గ్రామమునకును ఏవిధమైన సంబంధము లేకయుండెను. గ్రామములో పెద్దకాపు అన్ని విషయములలోను పై[illegible]ధికారి[illegible]ండెను. అతడే గ్రామమునకు కలక్టరు[illegible]పరిం[illegible], మేజస్ట్రీటు, న్యాయాధికారి. [illegible]లోను[illegible] ఇతర పెద్దమనుష్యుల సహాయము [illegible] ఆ గ్రామముయొ[illegible]పనులన్నిటిని నడపించుచుండెను.

ఈరీతిగా ప్రతిగ్రామములోను పంచాయతీ అనుసభ ప్రబలముగా నుండెను. ఈసభ వారికిలోబడి చాకలి, మంగలి, వడ్రంగి, కమ్మరి మొదలగు చిల్లరనౌకర్లు గ్రామమునకు ఉపయోగకరములైన పనులనుచేయుచుండిరి. కనుక కొంతవఱకు గ్రామములో ఒకవిధమైన స్వతంత్రము కలిగియుండెను. కాని, గ్రామములు ప్రత్యేకముగా నున్నందునను, సులభముగా రాకపోకలు చేయుటకు కావలసిన సాధనములు లేనందునను, రాజు వసించుపట్టణమునకును ఈగ్రామములకును అధికసంబంధము ఏర్పడక యుండెను. మిక్కిలి బలిష్ఠుఁడైన ఒకశత్రువుచు రాజ్యమునుండి వెలుపలికి తఱిమి వేయుటకు గ్రామస్థులు సర్కారువారికి సహాయము చేయుటకు వీలు లేకయుండెను. ఇటువంటి అసౌకర్యములు స్వదేశ రాజుల కాలములోను మహమ్మదీయరాజులకాలములోను ఉండెను.

ఆంగ్లేయులు రాజ్యభారము వహించిన తరువాత ఇనుపదారులు, తంతి, రాజబాటలు మొదలగు రాకపోకలకు సాధనములు వృద్ధినొంది హిందూదేశమంతయు రాజధానులుగాను, గొప్పమాగాణములుగాను, భాగింపబడి, ఇవి మరల జిల్లాలుగాను తాలుకాలుగాను గ్రామములుగాను విభజింపబడి ఎల్లలు నిర్ణయింపబడి యున్నవి. 1884 సంవత్సరమున గవర్నర్ జనరల్ గారైన లార్డు రిప్పన్ దొరవారికృపచే గ్రామములలో యూనియనులనియు, తాలూకాలలో తాలూకా

బోర్డు అనియు, జిల్లాలలో జిల్లాబోర్డు అనియు, పట్టణముల యందు మునిసిపాల్టీ లనియు స్థానిక స్వతంత్రపరిపాలన సభలు ఏర్పడెను.

యూనియన్లు:—ఈపేరుగల గ్రామ స్వతంత్ర పరిపాలన సభల నిర్వహించుటకు సర్కారువారు గ్రామస్థులలో సరియైన అంతస్థు గల వారిని నియమించు చున్నారు. ఈసభలకు పంచాయితీ అని పేరు. ఇప్పుడు ఈసభలో గ్రామముయొక్క విస్తీర్ణమును బట్టియు, చేయవలసినపనులను బట్టియు 5 మొదలు 10 వఱకు సభికులు ఏర్పాటు చేయబడుదురు. వీరిలో గ్రామాధికారి ఒకరు. ఇతర సభికులు కొన్నివిధుల ప్రకారము సర్కారువారిచేతను, తీరువచెల్లించు గ్రామస్థులచేతను నియమింప బడుచున్నారు. ఈసభయొక్క అగ్రాసనాధిపతి గవర్నర్ వల్లగాని లేక వారివద్దనుండి అధికారముపొందిన కలక్టరువంటి ఇతర ఉద్యోగస్థులవల్లగాని లేక ఆసభలోని ఇతరమెంబర్లవల్లగాని ఏర్పాటు చేయబడును. యూనియన్ పంచాయితీ వారు గమనించవలసిన విషయము లెవ్వి యనఁగా రస్తాలు, జలదారులు, గుంటలు, బావులు వీనిని మంచిస్థితిలో నుంచుట, వీధులను శుభ్రముచేయించుట, రాత్రివేళ వీధులయందు దీపములు పెట్టించుట. ఈ ఖర్చులకు కావలసిన పైకమునకు వచ్చుబడు లెవ్వియనఁగా: ఇంటిపన్ను, పందిళ్లపన్ను, బండ్లమిట్టపన్ను, పెంటను అమ్ముటచే వచ్చుద్రవ్యము మొదలగునవి.

అధికద్రవ్యము కావలసినప్పుడు ఈక్రింద వివరింపబడియుండు రీతిగా లోకల్ బోర్డువారివద్దనుండి తీసికోవచ్చును.

లోకల్ బోర్డు:—ఇది 1. జిల్లాబోర్డు 2. తాలూకాబోర్డు అని రెండువిధములు.

(1) జిల్లాబోర్డు:—ప్రతిజిల్లాకును ప్రత్యేకముగా ఒక స్వతంత్రపరిపాలన సంఘము గలదు. ఈసంఘములకు అగ్రాసనాధిపతి జిల్లాకలెక్టరు. ఈ అధికారమును వహించుకాలములో వీరికి డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు అనిపేరు. వీరికి సహాయముగా బోర్డుంలో జిల్లాయొక్క విస్తీర్ణమునుబట్టియు చేయవలసిన పనులను బట్టియు 24 గురు మొదలుకొని 40 వఱకు, సభికులు నియమింపబడుదురు. ఈసభికు లందఱు ఎక్కువ అనుభవముగల వారుగాను, గొప్ప ఉద్యోగస్థులుగాను, ఎక్కువవచ్చుబడి గలవారుగాను, చక్కగా చదువుకొన్న వారుగాను ఉందురు. ఈసభ సంవత్సరమునకు నాలుగు పర్యాయములు జరుగును.

ఈసభ జరుగు సమయములందు మెంబర్లుకానివారు సయితము ఇష్టమున్న యెడల హాజరుకావచ్చును. డిస్ట్రిక్టు బోర్డువారికి, లోకల్ గవర్నమెంటువారు పై అధికారులు.

తాలూకాబోర్డు:—జిల్లాలు తాలుకాలుగా భాగింపబడియున్నవి. లోకల్ ఫండు విషయముగా ఒకటి లేక రెండు తాలూకాలకు ఒక అధికారియుండును. ఆయాతాలూకాల డివిజనల్ ఆఫీసరులే తాలూకాబోర్డులకు ప్రెసిడెంట్లు. ప్రెసిడెం

టుకు సహాయము చేయుటకు ఒకసభయున్నది. ఈసభలో 12 మొదలు 15 వఱకు సభికులుగలరు. తాలూకావిషయములలో అనుభవముగల ఉద్యోగస్థులును, పెద్దకాపులు ఈసంఘములలో మెంబర్లుగానుందురు. ఈ సభ నెలకొక పర్యాయము కూడును. జిల్లాబోర్డుకును, తాలూకాబోర్డుకును అగ్రాసనాధిపతులైన కలక్టరుగాని, డివిజనల్ ఆఫీసరుగాని సర్క్యూటులో నుండునపుడు బోర్డులయొక్క పనులను నిర్వహించుటకై వైస్ ప్రెసిడెంటు అనబడు అధికారికూడ ఏర్పడియున్నాడు.

సర్కారువారిచేతను, జనులచేతను ఏర్పాటుచేయబడు ఈమెంబర్లు మూడుసంవత్సరములకు నియమింపబడుచున్నారు. అనగా మూడుసంవత్సరములకు ఒకపర్యాయము మెంబర్లను క్రొత్తగా ఏర్పాటుచేయుచుందురు. వీరికి జీతములేదు.

లోకల్ బోర్డువారు గమనింపవలసిన విషయము లెవ్వియనగా, రస్తాలను క్రొత్తగావేయుట, ప్రాతరస్తాలను మరమ్మతుచేయుట, రస్తాయొక్క ఇరుప్రక్కలలోను చెట్లువేయించి వానిని పెంచుట, ఆసుపత్రులు, సత్రములు, పశువులను చంపుచోట్లు, బండ్లమిట్టలు, మరుగుదొడ్లు, చిన్నవంతెనలు, నీటితొట్లు, వీనిని కట్టించుట, గ్రామబళ్లకు కావలసిన కట్టడములను కట్టించుట. లోకల్ బోర్డువారి వచ్చుబళ్లుపవన:—ఇంటిపన్ను, బండ్లపన్ను, పందిళ్లపన్ను, సంతచేరుకాలములోను, ఉత్సవకాలములోను, ఉమ్మడిస్థలములను ఉపయోగపఱచుటకు విధింపబడు కొద్దిపన్ను.

ఈరాజధానిలో 23 డిస్ట్రిక్టుబోర్డులును, 82 తాలూకా బోర్డులును, 350 యూనియన్లును ఉన్నవి. సర్కారువారిచే ఉపయోగింపబడు H. M. S. అనిముద్రవేయబడిన తపాలుబిళ్లలను, సర్వీసుబిళ్లలను లోకల్ ఫండుసంబంధమున ఉపయోగింపగూడదు. సాధారణముగా జనులచే ఉపయోగింపబడు తపాలాబిళ్లలను లోకల్ ఫండువారు L. F. B. గుర్తులను సూదితో బిళ్లలమీద పొడిచి ఉపయోగపఱతురు.

మునిసిపాల్టీలు:—ఒకపట్టణముయొక్క జనసంఖ్య, దాని వచ్చుబడి, నాగరీకత, ఆపట్టణములోనుండు విద్యావంతులు, ధనికులు, వీనినిబట్టియు, ఆపట్టణముయొక్క ఆరోగ్యస్థితినిబట్టియు జనులయొక్క అభిప్రాయములనుబట్టియు ప్రతి పట్టణములోను ఒకసంఘమును ఏర్పాటుచేసియున్నారు. ఈసంఘములు పట్టణముయొక్క క్షేమము నుద్దేశించి ఏర్పడినవేకాని సర్కారు వచ్చుబడినిమిత్తము ఏర్పడినవికావు. ఈసంఘముయొక్క ప్రధానాధికారికి చేర్మెన్ (అగ్రాసనాధిపతి) అనిపేరు. ఇతరసభికులకు కౌన్సిలర్లు అనిపేరు. ఈకౌన్సిలర్లు మునిసిపాల్టియొక్క విస్తీర్ణమునుబట్టి 12 గురు మొదలు 24 గురువఱకు ఏర్పాటుచేయబడుదురు. కొందఱు కౌన్సిలర్లు గవర్నరువారిచేతను, మఱికొందఱు పన్ను చెల్లించు పట్టణవాసులచేతను నియమింపబడుదురు. వీరు చదువుకొన్న వారుగాను, ధనికులుగాను, పరోపకారము చేయుటయందు ఆసక్తిగలవారుగాను, ఎక్కువ ప్రాబల్యముగల

వారుగాను,25 సం॥ లవయస్సుకు పైబడినవారుగాను, అనుభవ శాలురుగాను ఉందురు. అగ్రాసనాధిపతియైన చేర్మన్ గవర్నరు గారివల్లనైనను, కౌన్సిలర్లవల్లనైనను నియమింపఁ బడును. చేర్మన్, సాధారణముగ అన్నివిషయములలోను కౌన్సిలర్ల యొక్క అభిప్రాయమునుబట్టి నడుచుకొనును. ఈసంఘము నకు పైఅధికారి గవర్నరుగారియొక్క ఆలోచన సభయే. ఒక సంవత్సరము నియమింపబడినచేర్మన్, కౌన్సిలర్లు వీరు మూడు సంవత్సరములవఱకు పనిచేయవచ్చును. ఈసభ మాసమునకొక పర్యాయము చేరును. ఈసభలో ఏమైన లోపము లున్న యెడల జిల్లా కలక్టరు సవరింపవచ్చును. అట్లు సవరించుటకు సాధ్యము కానియెడల పైఅధికార్లకు తెలుపవలెను. ఈసంఘమునకు కావలసిన సిబ్బందిగుమాస్తాలను ఈసభవారే నియమింపవచ్చును.

ఈమునిసిపల్ సంఘముయొక్క వచ్చుబళ్ల వివరము:—

1. టోలుగేటుపన్ను 2. వృత్తిపన్ను 3. ఇంటిపన్ను 4. భూమిపన్ను 5. నీటిపన్ను 6. బండ్లపన్ను 7. జలదారుల పన్ను మొదలగునవి.

ఖర్చులవివరములు:—

1. వీధులయందు వంతెనలు, వైద్యశాలలు, మార్కెట్లు, జలదారులు, సత్రములు వీనినికట్టించుట, మరమ్మతుచేయించుట. 2. టీకాలువేయించుట 3. ఆరోగ్యవిధులనుఅనుసరింప జేయుటకు కావలసిన ఉద్యోగస్థులను తర్బీయతు చేయించుట.

4. జననమరణపులెక్కలను సిద్ధముచేయించుట. 5. పట్నములో మంచినీళ్ల లోపము లేకుండ ఏర్పాటుచేయుట. 6. దీపములను వెలిగించుట 7. మురికికాలువలు, మరుగుదొడ్లు, వీనిని శుభ్రముచేయించుట. 8. రస్తాలలో వృక్షములు పెంచుట, తోటలను వృద్ధిచేయించుట 9. ప్రథమవిద్య, సెకండరీవిద్య ఈ రెంటిని వృద్ధిచేయుట.

వీరు గమనింపవలసిన ఇతర విషయములు:—

ఇండ్లు కట్టువారు సర్కారు స్థలమును ఆక్రమణ చేయకుండఁ జూచుకొనుట, వీధులయొక్క పేర్లను బల్లలమీఁద వ్రాసి ప్రతి వీధియందును బహిరంగమైన స్థలమునందుంచుట, ఇండ్లకు నంబర్లువేయుట, అపాయకరములైన పురాతన కట్టడములను పడగొట్టుట, తోలుగిడ్డంగులు, మందుశాలలు, రంగువేయు స్థలములు, ఇటువంటివి పట్నమునకు వెలుపల ఉండునట్లు చేయుట, కసాయి స్థలములు (Slaughter houses) కట్టించుట, కలరా మొదలగు అంటు వ్యాధులు పట్నమునకు వ్యాపించక యుండుటకు కావలసినంత ప్రయత్నముచేయుట, ఈ మొదలగునవి వీరు చేయవలసినపనులు. సుఖాధార విషయములను అతిక్రమించి నడుచువారిని కనిపెట్టువిషయమున పోలీసువారు ఛేర్మెనుకు సహాయము చేయవలెను.

ఈరీతిగా జనులయొక్క ఆరోగ్యవిషయముల నుద్దేశించి పట్టణములయందు మునిసిపాల్టీలను, జిల్లాలయందు డిస్ట్రిక్టు

బోర్డులను తాలూకాలయందు తాలూకా బోర్డులను, గ్రామములయందు యూనియన్లను ఏర్పాటుచేసి జనులవద్ద నుండి వీని మూలకముగా వసూలుచేయు పైకమును గవర్న మెంటువారు మరల జనులయొక్క క్షేమము కొఱకు ఖర్చు చేయుచున్నారు. ధనవంతులను, పెద్దకాపులను, రాజకీయ విషయములలో బాగుగ తర్ఫీయతునొంది ఎక్కువసామర్థ్యము గలవారై యుండుటకు గవర్నమెంటువారు వీరికి స్వతంత్ర పరి పాలన విషయములలో ఎక్కువ అధికారములను ఇచ్చుటకు ఏర్పాటు చేయుచున్నారు. ఈరాజధానిలో ఇప్పుడు సుమారు 62 మునిసిపాల్టీలును, హిందూదేశమందంతకు 750 మునిసిపాల్టీ లును ఉన్నవి.

పైనచెప్పినప్రకారము గ్రామములలోను, తాలూకాల యొక్కయు జిల్లాలయొక్కయు ప్రధాన పట్నములలోను ఉండు విద్యావంతులను ధనికులను కొందఱిని ఏర్పాటుచేసి ఆయా స్థలములయొక్క ఆరోగ్య విషయములు, ప్రథమవిద్య మొదలగు విషయముల సంబంధమైన కొన్ని కార్యములను జరుపుటవల్ల కలుగులాభములు అనేకములు గలవు:—1. జను లకు కలిగియుండు లోపములను స్వయముగా చూచి సాధ్యమై నంతవఱకు వానిని నివర్తించుటకు వీలుగా నుండును. (2) కొంత వఱకు ఇతరులను పరిపాలించుటలో కలుగుశ్రమము ఇంత యనియు ఈ అధికారమును వహించుటకు ఈసభవారు ఎంత

వఱకు అర్హులనియు జనులు తెలిసికొనుటకు కారణమై యుం డును. (3) ఇటువంటి సభలయందు కార్యములను నిర్వహిం చుటచే రాజ్యపరిపాలన చేయుటకు శక్తియు, పట్టుదలయు అనుభవమును కలుగుచున్నవి. (4) ఈరీతిగా ఇటువంటి సామ ర్థ్యముకలవారు ఎక్కువ కానుకాను సర్కారువారికి రాజ్య పరిపాలన విషయమైన శ్రమము కొంతవఱకు తగ్గుచున్నది. (5) పంచాయతి, తాలూకాబోర్డు, డిస్ట్రిక్టుబోర్డు, మునిసిపాల్టీ, ఇటువంటి చిన్నసభలయందు మెంబర్లుగానుండి, కొద్దిభాగము లోనుండు జనులయొక్క కొన్నివిషయములను మాత్రము గమ నించుటయందు కలుగు ప్రయాసములును, ఈకార్యములను నిర్వహించి చక్కగా జరుపుటకు కావలసిన ఓర్పును, ఇట్టివి అని బాగుగా తెలిసికొనుచున్నారు. (6) ఇదియునుగాక గవర్న మెంటువారియొక్క పాలనలోనుండు దేశములయొక్క విస్తీర్ణ ములను, వారు దేశముకొఱకు చేయు పలువిధములైన పను లను, ఈపనులను చేయునపుడు గవర్నమెంటువారికి కలుగు ప్రయాసములను జనులుబాగుగా తెలిసికొనవచ్చును. గవర్న మెంటువారు ఎంత ఓర్పు గలిగియున్నారను విషయముగూడ వెల్లడియగును. కనుక ఈమెంబర్లు చేయుపనులను, పడుపాటు లను, గవర్నమెంటువారి కష్టములతో పోల్చుటకుగూడ సాధ్య ము లేదని తెలిసికొని గవర్నమెంటువారికి లోబడి అధికరాజ విశ్వాసము గలవారై యుండునట్లు చేయుచున్నది.

## XII ఇంజినీరింగ్ డిపార్టుమెంటు.

ఈ ఇలాకా, ఈస్టు ఇండియా కంపెని అనుపేరు వహించిన తూర్పుఇండియా సంఘమువారి అధీనములో హిందూదేశముండిన కాలమందు సైన్యశాఖతో కల్పబడి సైన్యములకు కావలసిన కట్టడపుపనులను మాత్రము చేయుచువచ్చెను. ఆంగ్లేయాధికారమునకు లోబడినదేశములు వృద్ధి కానుకాను సైన్యమును వృద్ధిచేయవలసినది అవశ్యమాయెను. జనులను చూడ సరిగా పరిపాలింపవలసివచ్చెను. పరిపాలనవిషయమునకు సంబంధించిన కట్టడపుపనులు అధికముకానుకాను సైన్యమునకు కావలసిన పనులను ఆ అధికారులవద్దనే ఒప్పగించి ఈశాఖను ప్రత్యేకముగా నుంచిరి.

నీటి ఆధారములు:— దక్షిణ హిందూదేశములో నైఋతి వాయవ్యమూలల వానగాడ్పుల సహాయముచేతను ఉత్తరఇండియాలో హిమాలయపర్వతపంక్తులచేతను హిందూదేశమంతయు జలలోపములేక నదులచే పోషింపబడుచున్న దని పూర్వము చెప్పియున్నాము. ఈ నదులు సాధారణముగా వర్షఋతువునందు మాత్రమే ప్రవహించును. ఈవర్ష జలమును ఒకచోట సంగ్రహించి కావలసిన కాలములయందు వ్యవసాయమునకు ఉపయోగించుకొనుటకు గొప్ప సరస్సులును, తటాకములును కావలెను. నదులయందు ప్రవహించునీరు వ్యర్థముగా

సముద్రములో చేరక ఉండునట్లు ఆటంకపఱచి కాలువలమూలకముగా సేద్యము చేయబడు భూములకు తీసికొనిపోవలెను. నదులకు ఆనకట్టలను కట్టి వానిలో తూములు ఏర్పాటుచేసి నీటి మట్టమును ఎక్కువచేసి పొలములకు నీరు పారించవలెను.

పడమటి కనుమలయొక్క ఉపరిభాగమునందు కురియు వర్షజల మంతయు అరాబియా సముద్రములో చేరక వ్యవసాయమునకు పనికి వచ్చుటకై ఆకనుమలయొక్క క్రిందిభాగమున గొప్పసొరంగము త్రవ్వించి దానిద్వారా ఆనీటినంతయు మధుర జిల్లాయొక్క వ్యవసాయమునకు తీసికొనిపోవుచున్నారు. దీనికే పెరియారు ప్రాజెక్టు అని పేరు. ఇట్లే కావేరి నదియొక్క నీటిని కొల్లడమని చెప్పబడు శాఖానదిగుండ కావలసినంతవఱకు ప్రవహింపచేయుటకు తిరుచినాపల్లికి సమీపమున గొప్ప ఆనకట్టయొకటియును, ఈ కావేరి నదియొక్కనీరు తంజావూరు జిల్లాయావత్తు పారునట్టుచేయుటకు తిరుచినాపల్లికి కొంచెము తూర్పున చిన్న ఆనకట్ట యొకటియును, అనేక లక్షలరూపాయలు ఖర్చుచేసి కట్టియున్నారు. కృష్ణా,గోదావరినదులయందు గూడ ఇటువంటి ఆనకట్టలు బెజవాడ, ధవళేశ్వరములవద్ద కట్టబడియున్నవి. నదులయొక్క నీటిని ఆనకట్టల సాహాయ్యమున మాత్రమేగాక యంత్రములయొక్క సాహాయ్యముచేతగూడ మెరకప్రదేశములకుపారించుచున్నారు ఉ॥దివిసీమలోని ప్రాజెక్టు.

ఈ రాజధానిలో పడమటి కనుమలయందు ఉత్పత్తి

యగునదు లనేకములుగలవు. ఇవన్నియు తూర్పుగాపారి తూర్పుసముద్రములో సంగమించుచున్నవి. ఈనదులను దాటుటకు వంతెనలుకట్టనియెడల వ్యాపారమునకును జనులయొక్క ప్రయాణములకును ఎంతో భంగము కలుగుచుండును. ఈనదులు వర్షఋతువులయందు సమృద్ధిగా ప్రవహించును. వీనికి అడ్డముగా వంతెనలుకట్టుట సాధారణమైన పనికాదు. ఈదేశమంతయు రైలు మార్గములచే నిండియున్నది. ఈ మార్గముల మీద బండ్లుపోవునప్పుడు వంతెనలు ఇనుముచే కట్టబడి దృఢమైనవిగా నుండవలెనుగదా.

వ్యవసాయముకొఱకు నదులజలమును ఉపయోగించుకొనుటకు ఆనకట్టలు మొదలగునవి మాత్రమేగాక గొప్పకాలువలు గూడ త్రవ్వబడి యున్నవి:—(1) గోదావరికాలువలు సుమారు 2400 మైళ్లుపొడవుగలిగి 2,000000 యకరముల భూమికి నీటిపారుదల గలిగించుచున్నవి. (2) కృష్ణ, కావేరి కాలువలు ఒక్కొక్కటియు సుమారు 200 మైళ్లపొడవుగలిగి 48 లక్షుల యకరములను ఫలవంతముగ జేయుచున్నవి. ఇంతేగాక వ్యాపార విషయమైన పడవల రాకపోకలకు వీలైనకాలువలు కొన్ని ఏర్పడియున్నవి:—(1) బకింగ్ హాంకాలువ:—ఇది గుంటూరుజిల్లా మొదలుకొని నెల్లూరు చెంగల్పట్టు దక్షిణార్కాడు జిల్లాలవఱకు పోవుచున్నది. దీనిపొడుగు సుమారు 260 మైళ్లు. (2) కూవమునది: దీనితో సంబంధపడి యున్నది. (3) తంజా

వ్యూరుజిల్లాలో స్వేతారణ్యము కాలువఅని చెప్పబడు ఒకకాలువ యున్నది. వ్యాపారవిషయముగా కావలసిన వంతెనలు, ఓడరేవుపట్టణములు, దీపములు (లైటుహౌసులు,) మొదలగునవి అనేకములు కావలసియుండును.

రస్తాలు(రోడ్లు):—ముఖ్యమైన పట్టణములద్వారా ఇనుపదారులు పోవుచున్నవి. ఇనుపదారులద్వారా తీసికొనిరాబడు సామానులు గ్రామములకు రోడ్లమీాద పంపబడుచున్నవి. ఎద్దులబండ్లు, గుఱ్ఱపుబండ్లు మొదలగునవి పోవుటకు రస్తాలు మిక్కిలి ఉపయోగించుచున్నవి. ఈ రాజధానిలోనుండు రస్తాలయొక్క పొడవుసుమారు 20 వేలమైళ్లని చెప్పవచ్చును. కొన్నిస్థలములయందు క్రొత్తగా రస్తాలు యేర్పాటుచేయవలసియున్నవి. మఱికొన్ని స్థలములయందు ప్రాతరస్తాలను మరమ్మతుచేయ వలసియున్నది. ప్రయాణీకులును, బండ్లును, రస్తాలమీాద పోవునప్పుడు ఎండతగులనియ్యక నీడనిచ్చుటకై ఇరుప్రక్కలను వృక్షములను నాటి పెంచవలసియున్నది.

కట్టడములు:—న్యాయ విమర్శనచేయుటకై ఈ దేశములో ఏర్పడియుండు న్యాయస్థలములు, విద్యాసంబంధమైన కలాశాలలు, పాఠశాలలు, వ్యాధిగ్రస్తులకు వైద్యశాలలు, సర్కారువారిచే వసూలుచేయబడు రివిన్యూ సంబంధమైన పలువిధము లగు కట్టడములు, ఖయిదీలను ఉంచుటకు చెఱశాలలు, ప్రయాణీకులకు ఉపయోగముగా సత్రములు, నావికులకు

అత్యావశ్యకమైన ఉన్నతదీపస్తంభములు చూచుటకు ఆనందము కలుగచేయు వినోదవస్తుశాలలు, (Museums) రైలుస్టేషను మొదలగునవి అనేకవిధములగు కట్టడములు నూతనముగా కట్టించుటయేగాక ఈకట్టడములను అప్పుడప్పుడు మరమ్మతుచేయవలసి యుండునుగదా. పూర్వకాలమునందు స్వదేశరాజులు అనేక దేవళములను నగరులను కట్టియుండినప్పటికిని బ్రిటిష్ గవర్నమెంటువారివలె కట్టడముల విషయముగా ప్రత్యేకమైన ఒక యిలాకాను ఏర్పాటుచేసి యుండలేదు. ఇదివరలో చెప్పబడియుండు పలువిధములగు కట్టడములను చూచుకొనుటకు ఏర్పడియుండు ఇలాకాకు పబ్లిక్ వరుక్సు డిపార్టుమెంటు అని పేరు.

రైల్వే:—పబ్లిక్ వరుక్సు ఇలాకా ఉద్యోగస్థులను గురించి విచారించుటకు మునుపు తపాలు, తంతి వీనికి ఎక్కువ సాధకమైన ఇనుపదారి బండ్లయొక్క నీటి యావిరి యంత్రము ఏరీతిగా పనిచేయుచున్నదో విచారింతము.

ఈ యంత్ర మనునది నీటి యావిరి సాహాయ్యముచే ఇతర బండ్లను లాగుచున్నది. ఈయంత్రముయొక్క మొదటిభాగములో ఎక్కువ వెడల్పు గలిగి నిడుపుగా నుండు ఒక ఇనుపగొట్టము కానబడుచున్నది గదా. ఈ గొట్టముయొక్క లోపలివైపున అనేకములగు చిన్న ఇనుప గొట్టము లున్నవి. ఈ చిన్న గొట్టములమధ్య నిరు పారుచుండును. బండి నడపువాడు

కూర్చుండు స్థలమునకు సమీపముననుండు నిప్పుసెగ ఆగొట్ట
ములకు వ్యాపించి వానిని చుట్టియుండు నీటిని నీటి యావిరిగా



ఈ పటము ఇంజనుయొక్క లోపలిభాగమును చూపుచున్నది. 1. ని
ప్పువేయు పెట్టె. 2. మంటపోవు గొట్టములు. 3. నీరు. 4. నీటి ఆవిరి. చక్ర
ముల త్రోయు దండము గల గొట్టములోనికి పోవు మార్గము. 5. కావలసిన
వైపునకు ఆవిరిపోవునట్లు చేయు ఏర్పాటు. 6. చక్రముల త్రోయు దండము
గల పెట్టె. 7. చక్రముల త్రోయు దండము. 8. పొగయును ఆవిరియును
బయటికి పోవు మార్గము.

పెద్ద ఇంజనుయొక్క యెత్తు 180 మొదలు 460 పుట్లవరకు నుండును.
ఖరీదు డెబ్బదియయిదు వేల రూపాయలు. చిన్న ఇంజనుయెత్తు 150 మొద
లుకొని 270 పుట్లవరకు నుండును. ఖరీదు ఏబది వేల రూపాయలు.

మార్చుచున్నది. ఈనీటియావిరి ఈ చిన్నగొట్టములను ఆను కొని యుండు చిమ్నీకి క్రిందిభాగమున నుండు ఒక గొట్ట ములో వ్యాపించి ఆ గొట్టముయొక్క రెండు శాఖల ద్వారా పారి ఇనుపకడ్డీలమీద మోదును. ఈ రీతిగా నీటి ఆవిరి ఆకడ్డీ లను అదుమునపుడు అవి వానితో సంబాధపడి యుండు చక్ర ములను నెట్టును. మీరందఱు కుట్టుయంత్రమును చూచి యున్నారుగదా. కుట్టుపనివాఁడు యంత్రముయొక్క అడుగు భాగమున అమర్చియుండు ఒక పలకను రెండుపాదములతోను అదుముచునప్పుడు యంత్రములో కానబడు చక్రము వేగముగా తిరుగుచున్నది. ఈరీతిగానే పైచెప్పబడిన ఇనుప కడ్డీలను నీటి ఆవిరి అదిమినతోడనే చక్రము తిరుగుటకు ప్రారంభించును.

ఈయంత్ర మనునది అనేకపెట్టెలను(బండ్లను)లాగికొని భూమిమీద పోయినపక్షమున అధికభారముచే చక్రములు భూ మిలో పాదుకొని వేగము తగ్గిపోయి వర్షాకాలమందు బండ్లు నడవకయే నిలిచిపోవచ్చును. దీనినుద్దేశించి ఇనుపదారిని ఏర్పా టు చేసియున్నారు. ఇనుపదారులచే జనులకు కలుగు లాభ ములనుద్దేశించి దానికి కావలసిన గొప్ప మొత్తములను ఈ దేశ స్థులు ఇవ్వలేరని కనుగొని సర్కారువారు ఇంగ్లాండులోనుండు కొంతమంది వర్తకులను, ధనవంతులను సంఘముగా ఏర్పఱచి వారికి కావలసిన పెట్టుబడిధనము విషయములో సాహాయ్యము

చేసి నష్టము వచ్చినప్పుడు నష్టమునకు సర్కారువారు కూడ బాధ్యతపడునట్లును, కొంతకాలమైన తరువాత సర్కారువారే ఈ ఇనుపదారులను తీసికొను నట్లును, లభించు లాభములో సర్కారు వారికి భాగము ఇచ్చిన చాలుననియు ఒడంబడిక చేసికొని ఈదేశములో ఇనుపదారులను ఏర్పాటు చేసియున్నారు. గాలి వలన ఉపద్రవము కలుగకుండ ఇనుపదారులను వెడల్పుగా వేయుటకు ప్రయత్నించిరి. కాని ఖర్చు అధికమగునని ఆలోచించి ఈ రాజధానిలో మదరాసు ఇనుపదారి 5 అడుగుల 6 అంగుళములును (బ్రాడ్ గేజి), దక్షిణ ఇండియా ఇనుపదారి 3 అడుగులు 3 అంగుళములును (మీటరు గేజి) ఉండులాగున తీర్మానించి యున్నారు. గవర్నమెంటువారు వాగ్దానము చేసిన ప్రకారము కొన్ని ఇనుపదారులను వారే తీసికొని స్వంతముగా జరుపుచున్నారు. కొన్ని స్థలముల యందు డిస్ట్రిక్టు బోర్డు వారిచే పాలింప బడుచున్నవి. ఇనుపదారి సంబంధమైన వంతెనలు, కట్టడములు, రస్తాలు మొదలగు వానిని కంపెనీ మూలకముగా సర్కారు పెట్టుబడి ధనము యొక్క సాహాయ్యముచే జరుపబడుచున్నవి. గనుక కన్సల్టింగు ఇంజనీరు ఫర్ రైల్వేసు (Consulting Engineer for Railways) అను గవర్నమెంటు ఉద్యోగస్థుడు రైల్వే సంబంధమైన పనుల నన్నిటిని తనిఖీ చేయుటకు ప్రతిభాగమునకును ఏర్పడి యున్నాడు.

శిల్పకార్య నిర్వాహణపు ఇలాకా సంబంధమైన పనులను చేయుటకు నియమింపబడు ఉద్యోగస్థులు ఆ పనులను సరిగా జేయగలిగి యుండుటకై, గవర్నమెంటు వారు చెన్నపట్నము, పూనా, రూర్కీ, మొదలగు స్థలములయందు కలాశాలలను ఏర్పఱచియున్నారు. ఈ ఇలాకాలో గొప్ప ఉద్యోగస్థులైన ఇంజనీర్లు తప్ప ఇతరులందఱు పైె చెప్పబడిన కలాశాలలో తర్బీయతు పొందినవారుగా ఉందురు.

ఈ ఇలాకా ప్రధాన ఉద్యోగస్థునికి చీఫ్ ఇంజనీయర్ అనిపేరు. ఈరాజధానిలో ఇద్దరు చీఫ్ ఇంజనీర్లు ఉన్నారు. ఒకరు నీరు పారుదల సాగుబడి సంబంధమైన పనులకు అధికారి. మఱియొకరు ఇతరకట్టడముల సంబాధమైన పనులకు అధికారి. సాగుబడి సంబంధమైన విషయములు రెండుశాఖలుగా నున్నవి. గొప్పనదులు, చిన్ననదులు, చెరువులు వీనిసంబంధముగా కావలసిన వంతెనలు ఆనకట్టలు మొదలగుపనులకు మేజరు ఇరిగేషను అనిపేరు. 200 యకరములకు పైబడని ప్రదేశములకు సాగుబడి సంబంధమైన కట్టడములు వానిమరమ్మతులు మొదలగు వానికి మైనరు ఇరిగేషన్ అనిపేరు. ఈమైనరు ఇరిగేషను సంబంధమైన పనులు యావత్తు జిల్లాకలక్టరు స్వాధీనములో విడువబడియున్నవి. ఇరిగేషను ఓవర్‌సీయర్, సబు ఓవరుసీయర్ మొదలగు సిబ్బంది ఉద్యోగస్థులు కలక్టరుకు సహాయముచేయు

దురు. ఈ ఉద్యోగస్థులు తాలూకా తహశ్శీల్ దారునకు లోబడి పనిచేయుదురు.

మేజరు ఇరిగేషన్ పనులు యావత్తు చీఫ్ ఇంజనీయర్ స్వాధీనములో నున్నవి. ఈరాజధాని ఆరుసర్కిల్సుగా భాగింపబడి ప్రతి సర్కిలుకు ఒకసూపరింటెండింగు ఇంజనీయరును నియమించి యున్నారు. వీరికి క్రింది అధికారికి ఎక్సికూట్యూటీవు ఇంజనీయరు అని పేరు. ఈఎక్సికూట్యూటీవు ఇంజనీయరు డివిజన్ ఛార్జిలోనుండును. ఒకడివిజన్ సాధారణముగా రెండు జిల్లాలు కలిసియుండును. వీరికి సహాయముగా అసిస్టెంటు ఇంజనీయర్లును, సబ్ ఇంజనీయర్లును నియమింపబడి యున్నారు. వీరికి క్రింది ఉద్యోగస్థులు సూపర్ వైజర్లు, ఓవర్ సీయర్లు, సబుఓవరు సీయర్లు, మేస్త్రీలు.

నీరుపారుదల సంబంధముగాను, కట్టడపు సంబంధముగాను ఈ ఇలాకాలో ఎక్కువ పనియున్నందున రస్తాలసంబంధమైనపనులు అన్నియు లోకల్ ఫండుబోర్డు వారివశమున విడువబడియున్నవి. లోకల్ ఫండు బోర్డువారు రోడ్డుసెస్ అని కాపులవద్దనుండి వసూలుచేయబడు పన్నును జిల్లాసంబంధమైన రస్తాలను మరమ్మతు చేయుటకును, క్రొత్తవానిని ఏర్పాటుచేయుటకును ఖర్చుపెట్టుదురు. బోర్డువారు ఈపనులను బాగుగా విచారించుటకు ఇంజనీయర్లనుగూడ ఏర్పాటు చేసియున్నారు. వ్యవసాయసంబంధముగా అనేకవిధములగు కట్టడములను కట్ట

వలసియున్నది. ఈ ఖర్చులనన్నిటిని ఉద్దేశించి సర్కారువారు జనులవద్దనుండి భూమిశిస్తుతో సహా నీటిపన్ను, రోడ్డుసెస్సు రైల్వేసెస్సు, మొదలగు వానినికూడ వసూలు చేయుచున్నారు.

## XIII. విద్య ఇలాకా.

(1) కలాశాలవిద్య (2) పాఠశాలవిద్య అని విద్య రెండు విధములు. కలాశాలవిద్య రెండువిధములు. (ఏ) శాస్త్రవిషయమైనవిద్య. ఉదాహరణము.—ప్రెసిడెన్సికాలేజి. (బి) వృత్తిసంబంధమైనవిద్య. ఉ॥ చట్టకలాశాల(లాకాలేజి), వైద్యకలాశాల.

పాఠశాలవిద్య రెండు విధములు:— (ఏ) సాధారణ విద్య:—ఈరాజధానిలో నుండు శెకండరీ, ఎలిమెంటరీ పాఠశాలలు దీనిలో చేరినవి— (బి) వృత్తిసంబంధమైన విద్య:— కళ్ళికోటలో వ్యాపార విషయముగా నేర్పడిన సర్కారు పాఠశాల, ఉపాధ్యాయవృత్తికి తర్బీతుచేయుట్రైనింగ్ పాఠశాలలు.

పైె చెప్పబడిన పాఠశాల విద్యలో ఒక భాగమైన ఎలిమెంటరీ పాఠశాలలను గురించి:—ఎలిమెంటరీ పాఠశాలలను నాలుగువిధములుగా భాగించవచ్చును. (1) సర్కారువారు స్వయముగా ఆదరించు పాఠశాలలు. ఇటువంటి పాఠశాలలు విశేషముగా బాలికా పాఠశాలలుగా నున్నవి. బాలికలు జీతములిచ్చి చదువుట దుర్లభమైనందున ఇతరులు సాధారణముగా బాలికాపాఠశాలలను నిర్వహించుటకు పూనుకొనరు. అయితే దేశక్షేమముకొఱకు బాలికలు విద్య నేర్చుకొనవలసినది అవ

శ్యము గనుక సర్కారువారే బాలికాపాఠశాలలను ఆదరించు చున్నారు. ఈ దేశమునకు వచ్చియుండు పాదిరీలు అనేక బాలికా పాఠశాలలను స్థాపించియున్నారు. (2) సర్కారువారిచే ఇవ్వబడు ద్రవ్యసహాయముచే మునిసిపాలిటీలచేతను, జిల్లా బోర్డువారి చేతను ఆదరింపబడు పాఠశాలలు. (3) పాదిరీలవల్లను, హిందువులవల్లను జరుపబడు పాఠశాలలు.—(4) వీధిబళ్లు.

పై చెప్పబడిన మొదటి మూడువిధములయిన పాఠశాలలయందును వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, వ్యవసాయశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, వీనిసంబంధమైన అనేక విషయములను బాలురకు వస్తుపాఠ మూలకముగాను, చిత్రపటముల ద్వారాను, బంకమట్టిచేతను మనస్సున నాటునట్లుగ నేర్పుటకు కావలసిన క్రొత్తపద్ధతులను అవలంబించుటకై విద్య ఇలాకా యొక్క పై అధికారియైన డైరెక్టరు దొరవారు ఆ ఇలాకా యొక్క పరీక్షాధికారుల మూలముగాను, పాఠశాలల మేనేజర్ల మూలకముగాను పాటుపడుచున్నందున ఈ పాఠశాలలు రానురాను మిక్కిలి వృద్ధినొందుచున్నవి.

పాదిరీలచేతను, స్వదేశీయులచేతను జరుపబడు పాఠశాలలు సర్కారు ద్రవ్య సహాయమును పొందుటకు స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగారిచే సదరు పాఠశాలలు అంగీకరింపబడవలెను. ఈ బడులయందు నియమింపబడు ఉపాధ్యాయులు తర్ఫీతు పొందిన వారుగాను, ఎక్కువ సామర్థ్యము గలవారుగాను ఉండవలెను.

పసికిరాని ఉపాధ్యాయులుగల పాఠశాలలకు ద్రవ్య సహాయము ఇవ్వబడదు. ప్రతిపిల్లవాడును (స్ఫోటకము పోసినవారుతప్ప) టీకాలు వేయించుకొని యుండవలెను. బడి మంచిగాలియు వెలుతురును గలదిగాను శుభ్రముగాను ఉండవలెను. బెంచీలు, కుర్చీలు, మేజాబల్లలు మొదలగు సామానులు అంతగా అవశ్యము లేదు. ప్రవేశపట్టి, హాజరుపట్టి, మొదలగు రిజిష్టర్లు, ఈబడుల యందు సిద్ధముగా నుండవలెను.

ద్రవ్యసహాయ వివరము:—(1) విద్య నేర్పుటకు ఉపాధ్యాయునకు ఒక్కొక్కనికి 36 రూపాయల వంతునను, సంవత్సరములో సరాసరిని 150 రోజులకు తక్కువలేక హాజరగు ప్రతిబాలునికి ఎనిమిది అణాల వంతునను, గ్రాంటు ఇవ్వబడును. అధమజాతి పిల్లలు అధికముగానుండు బళ్లకు సరాసరి హాజరగు రోజులను బట్టి ప్రతి బాలునికి రు. 0-10-0 వంతున గ్రాంటు ఇవ్వబడును. ఉపాధ్యాయుని విషయములో కాని, రిజిష్టరు, హాజరుపట్టి, అంగీకార నిబంధనలు వీని విషయములోగాని ఏమైనా లోపములుండునట్లు తెలిసినయెడల పరీక్షాధికారులు డైరెక్టరువారికి తెలియపఱచి గ్రాంటును తగ్గించవచ్చును. లేక ఉపాధ్యాయుని యోగ్యతాపత్రికను రద్దుచేయవచ్చును. తృప్తికరముగా నుండని బడులకు నూటికి రు. 25-0-0 వంతున గ్రాంటును తగ్గించివేయుటకు పరీక్షాధికారులు సిఫార్సు చేయవచ్చును. బాగుగ విద్యగఱపుబడులకు నూటికి రు. 25 లవంతున

గ్రాంటు ఎక్కువగా ఇచ్చుటకు పరీక్షాధికారులు సిఫార్సు చేయవచ్చును. సాధారణముగా గ్రాంటుదరఖాస్తు రాబోవు సంవత్సరమునకు జరుగుచున్న సంవత్సరము జూలై నెల మొదటి తేదిలోపల రేంజి సబు అసిస్టెంటు ఇన్‌స్పెక్టరుగారికి పంపుకోవలెను. గ్రాంటు విషయముగా ప్రతిసంవత్సరము సెప్టంబరు మాసము ఒకపర్యాయము పరీక్షాధికారులు ఒకచోట కలసి బళ్లకు యింత గ్రాంటు ఇవ్వవలెనని తీర్మానింతురు. ఈతీర్మానము ప్రకారమే అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు ఫిబ్రవరిమాసములో గ్రాంటుబిల్లులను మేనేజర్లకు పంపివేయుదురు. ఈబిల్లులను మార్చి నెల ఆఖరులోపల ఖజానాలో మార్చుకోవలెను.

కట్టడములు, పుస్తకములు, ఇతరసామానులు,—వీనినుద్దేశించికూడ గ్రాంటుఇవ్వబడును. ఒకబడికి పాఠశాలగృహము అవశ్యమైనదనిగాని; పుస్తకములు, పటములు, పలకలు ఇవి కావలెననిగాని, పరీక్షాధికారులకు తోచినయెడల వారు ఈవిషయముగా గ్రాంటుకు సిఫార్సు చేయవచ్చును. ఈగ్రాంటును పొందగోరు మేనేజర్లు ఈగ్రాంటు కొఱకు ఏర్పడియుండు దరఖాస్తు నమూనాను తయారుచేసి, మే నెల మొదటి తేదిలోపల డైరెక్టరుగారికి చేరులాగున రేంజిసబ్ అసిస్టెంటు ఇన్‌స్పెక్టరుగారికి ఒప్పజెప్పవలెను. వీరి సిఫార్సునుబట్టి కట్టడమునకు అయ్యే ఖర్చు పైకములో మూడవవంతును ఇతరసామానుల విషయముగా ఖర్చు అగు పైకములో సగమును గ్రాంటుగా ఇవ్వబడును.

## సర్కారు, బోర్డు. మునిసిపల్ పాఠశాలలు.

ఈ పాఠశాలలయందు గూడ ఉపాధ్యాయులు, రిజిస్టర్లు మొదలగు విషయములు పై చెప్పబడియుండు పాఠశాలలవలెనే ఉండవలెను. ఉపాధ్యాయులకు ఈక్రింద వివరింపబడియుండు రీతిగా ప్రతి నెలకు జీతము ఇవ్వబడును. పిల్లల వద్దనుండి వసూలు చేయవలసిన బడిజీతములును ఈక్రింద వివరింపబడియున్నవి.

| తరగతి. | ఉపాధ్యాయులు. |
|---|---|
| నాలుగు తరగతులకు తక్కువగా నుండు పాఠశాల. | 1 |
| నాలుగు తరగతులలోను మొత్తము 30 మంది పిల్లలకు తక్కువగా నుండు పాఠశాల | 1 |
| నాలుగు తరగతులలోను మొత్తము 30 మొదలు 60 మంది బాలురవఱకు గలపాఠశాల. | 2 |
| నాలుగు తరగతుల లోను 60 మొదలు 90 మంది బాలురు గల పాఠశాల. | 3 |
| 5 తరగతుల లోను 25 మంది బాలురకు తక్కువగా నుండుపాఠశాల. | 1 |
| 5 తరగతులలోను 25 మొదలు 45 మందివఱకు గల బడికి | 2 |
| 5 తరగతులలోను 46 మొదలు 75 పిల్లలవఱకుగలపాఠశాల. | 3 |

5 తరగతుల లోను 76 మొదలు 100 వఱకు గలపాఠశాల. 4
100 మంది పిల్లలకు పై బడిన పాఠశాల. 5

5 తరగతుల కంటె ఎక్కువ తరగతులు గల పాఠశాలలో ప్రతి పైతరగతిలోను 35 బాలురకు తక్కువ లేక యుండినను ప్రతి డివిజన్‌లోను 20 మంది బాలురకు తక్కువ లేక యుండినను ఒక ఉపాధ్యాయుడు ప్రత్యేకముగా ఉండవలెను.

ప్రతి పై తరగతిలోను 35 బాలురకు పైబడినయెడల ఆతరగతిని రెండు భాగములుగా భాగించి ప్రతి భాగమునకును ఒక ఉపాధ్యాయుని నియమించవలెను.

ఉపాధ్యాయుల యొక్క నెలజీతముల వివరము.

| | |
|---|---|
| 1 ఉపాధ్యాయునికి ... ... | రూపాయలు 8 |
| ఇద్దరు ఉపాధ్యాయులకు ... ... | 10,8 |
| ముగ్గురు ఉపాధ్యాయులకు ... | 12,10,8 |
| 4 ,, ,, ... | 15,12,10,8 |
| 5 ,, ,, ... | 20,15,12,10,8 |
| 6 ,, ,, ... | 25,20,15,12,10,8 |
| 7 ,, ,, | 30,25,20,15,12,10,8 |
| 8 ,, ,, | 40,30,25,20,15,12,10,8 |

## బాలుర జీతములు.

ఇన్ఫెంటు తరగతి మొదలు మూడవ తరగతివఱకు.
పూర్తిగానుండు పాఠశాలలో జీతముల వివరము.

| | |
|---|---|
| ఇన్ఫెంటు తరగతి | రూ. 0-0-6 |
| మొదటి ,, | 0-1-0 |
| రెండవ ,, | 0-2-0 |
| మూడవ ,, | 0-2-6 |

నాలుగు తరగతులు పూర్తిగానుండు పాఠశాలలోని జీతముల వివరము.

| | బాలురు. | బాలికలు. |
|---|---|---|
| ఇన్ఫెంటు | రు. 0-1-0 | 0-0-6 |
| మొదటితరగతి | 0-2-0 | 0-1-0 |
| 2 వ తరగతి | 0-3-0 | |
| 3. ,, | 0-4-0 | |
| 4. ,, | 0-6-0 | |
| 5. ,, | 0-8-0 | 0-2-0 |
| 6. ,, | | |
| 7. ,, | | |

షరా.—(1) బాలికలు, పంచములు, ఇతర హీనజాతి వారిపిల్లలు ఫీరలకు జీతము లేదు.

(2) ఇన్ఫెంటుతరగతి మొదలు మూడవ తరగతివఱకు

గల పాఠశాలలో జీతములు వసూలుచేసిన ప్రధాన ఉపాధ్యాయుడు దీసికోవచ్చును.

(3) ఇన్ ఫెంటు మొదలు మూడుతరగతులు గల పాఠశాలలో విధింపబడియుండు రేటుకు అధికముగా జీతము వసూలు చేయవచ్చును.

గ్రాంటు వివరము:—ఇన్ ఫెంటు మొదలు 3 వ తరగతి పూర్తిగాగల పాఠశాలలయందుండు ఉపాధ్యాయులకు తర్ఫీతు పొందియుండినయెడల గ్రాంటు ఇవ్వబడును. దీనికి క్యాపిటేషన్ అల్లవెన్సు (Capitation Allowance) అనిపేరు. సరాసరి హాజరగు బాలురకు ఒక్కొక్కనికి రు. 1-0-0 వంతునను, బాలికలు పంచములు ఇతర హీనజాతిపిల్లలు వీరికి రెండు రూపాయలవంతునను లెక్కచేసి ఉపాధ్యాయులయొక్క జీతముల దామాషాను ఇవ్వబడును. కట్టడములు పుస్తకములు సామానులు, వీని విషయముగా గ్రాంటు ఇవ్వబడదు. ఇవి కావలసినప్పుడు బోర్డువారుగాని సర్కారువారుగాని సప్లయి చేయుదురు.

ఎలిమెంటరీ పాఠశాలలకు ఇంతకు పూర్వము గవర్నమెంటువారు చేసిన ద్రవ్యసహాయ పద్ధతికిని, ఇప్పుడు చేయు ద్రవ్యసహాయ పద్ధతికిని భేదమేమన—మునుపు పిల్లలను పరీక్ష చేసి ఆ పరీక్షలో తేరినవారి సంఖ్యనుబట్టి ద్రవ్యసహాయము చేయుచుండిరి. దీనిచే ఉపాధ్యాయులు తమకు తెలిసి తెలియని

అనేక పాఠములను పిల్లలచే కంఠపాఠము చేయించుచుండిరి. ఇందువల్ల వారికి ఆలోచనశక్తి, పరిశీలనాశక్తి మొదలగునవి వృద్ధియగుటకు అవకాశమే లేకయుండెను. ఈ లోపములను సవరించుటకు ఇప్పుడు ఉపాధ్యాయుల సంఖ్యనుబట్టియు, పిల్లల యొక్క సరాసరి హాజరు సంఖ్యనుబట్టియు, అనుసరించు బోధనా పద్ధతుం బట్టియు గ్రాంటు ఇచ్చుచున్నారు.

ట్రెయినింగ్ పాఠశాలలయందు పిల్లలకు బోధించుటకు ఉపాధ్యాయులు కావలెను. వీరు బోధించుటయందు సామర్థ్యము గలవారై యుండవలెను. దీనిని నుద్దేశించి ఈ రాజధానిలో గవర్నమెంటువారు ఉపాధ్యాయులను తర్బీతు చేయుటకు కొన్ని పాఠశాలలను ఏర్పాటు చేసియున్నారు. ఈ పాఠశాలలు పలువిధములు. (1) బి. ఏ. పరీక్షలో తేరినవారు తర్బీతు పొందుపాఠశాలలు (2) మెట్రిక్యులేషన్, యఫ్. ఏ. పరీక్షలైన వారు తర్బీతుపొందుపాఠశాలలు (3) దీనికి తక్కువ చదువుగల వారు తర్బీతు పొందు పాఠశాలలు. ఈ కడపటి పాఠశాలలు మరల రెండువిధములు: (*a*) నాలవ తరగతి మొదలు ఏడవ తరగతివఱకు చదువుకొన్నవారు తర్బీతు పొందు పాఠశాలలు (*b*) 7-వ తరగతి మొదలు ఆఱవఫారమువఱకు చదువుకొన్న వారు తర్బీతు పొందు పాఠశాలలు.

ట్రెయినింగ్ పాఠశాలలు అన్నిటిలోను మాదిరి పాఠశాల (Model School) యొకటి యున్నది. ఈ మాదిరిపాఠ

శాలలో, తర్ఫీతు పొందు ఉపాధ్యాయులు బోధనా పద్ధతుల అభ్యాసపఱచుకొని బోధనసంబంధమైన అనేక విషయముల ను ట్రెయినింగు స్కూలులో నేర్చుకొని ఉపాధ్యాయవృత్తికి పోవుచున్నారు. ఈ ట్రెయినింగు స్కూల్సు స్త్రీలకును, పురుషు లకును ప్రత్యేకముగా ఏర్పడియున్నవి. సర్కారువారు మాత్ర మేగాక పాదిరులుకూడ ట్రెయినింగు స్కూళ్ళను ఏర్పాటుచేసి జరుపుచున్నారు. ట్రెయినింగు స్కూళ్లు ఏర్పాటు చేసి సరిగా జరిపించుటకు ఎక్కువ ద్రవ్యము ఖర్చు అగుచు గనుక ట్రెయి నింగుస్కూళ్ళు ఏర్పాటుచేయు పాదిరులకు గవర్నమెంటువా రు ద్రవ్య సహాయము చేయుచున్నారు. ట్రెయినింగు కాలేజీ లుతప్ప ఇతర ట్రెయినింగ్ స్కూల్సు అన్నియు ఒక ఇన్‌స్పెక్ట రు అధీనములో నున్నవి. వీరికి ఇన్‌స్పెక్టరు ఆఫ్ ట్రెయినింగ్ స్కూల్సు అని పేరు. ఇప్పుడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్లుకూడ కొంత వఱకు ట్రెయినింగు స్కూల్సును తనిఖీ చేయవలెనని ఏర్పా టు చేసియున్నారు.

## విద్య ఇలాకా పరీక్షాధికారులు.

(1) సూపర్ వైజర్లు:—సూపరువైజర్లు ఈరాజధానిలో సుమారు 260 మంది యున్నారు. వీరు పాఠశాల లేనిగ్రామా దులలో, పాఠశాలలను ఏర్పాటు చేయవలెను. సర్కారుద్రవ్య సహాయమును పొందు పాఠశాలలలోకనబడు లోపములను సవ రించవలెను. ఉపాధ్యాయ సంఘములను ఏర్పాటుచేసి మాదిరి

పాఠముల నిచ్చి బోధనాశక్తి తక్కువగానుండు ఉపాధ్యాయు లకు సామర్థ్యమును కలుగ జేయవలెను. వీరు అప్పుడప్పుడు పాఠశాలలకు పోయి లోపములను కనిపెట్టి పైవారికి రిపోర్టు చేయవలెను.

2. సబు అసిస్టెంటు ఇన్‌స్పెక్టర్లు:—ఈ రాజధానిలో సుమారు 120 మంది ఉన్నారు. వీరు వారివారి రేంజీలలోని పాఠశాలలను పరీక్షచేసి ద్రవ్యసహాయమునకు సిఫార్సు చేయ వలెను. బోధనలోను, పాఠశాలల ఏర్పాటులలోను, సరిలేని పాఠశాలలకు ద్రవ్యసహాయము తగ్గించుటకు ఈఅధికారి పైవా రికి సిఫార్సు చేయవచ్చును. పాఠశాలలకు వెళ్ళి తనిఖీచేసి లో పములను చూపి వానిని సవరించుటకు ప్రయత్నించవలెను. ఈ ఉద్యోగస్థులందఱును గొప్పపరీక్ష లిచ్చి ఉపాధ్యాయవృత్తిలో మిక్కిలి అనుభవము గలవారై యుందురు.

3. అసిస్టెంటు ఇన్‌స్పెక్టర్లు:—ఇప్పుడు ప్రతి జిల్లాకు ను ఒక అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు ఏర్పడి యున్నారు. ఆజిల్లా యొక్క ప్రథమవిద్యకు వీర్లు జవాబుదారిగా నుందురు. సబు అసి స్టెంటు ఇన్‌స్పెక్టర్లు చేయుపనులను వీరలు తనిఖీ చేయవలెను. వీరు ఇన్‌స్పెక్టరు అప్పుడప్పుడు చేయు ఉత్తర్వులను అమ లుకు తీసికొనిరావలెను.

4. స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లు:—వీరు పట్టణములయందుండు

సెకండరీ పాఠశాలలను తనిఖీ చేయవలెను. విద్యా విషయమై ఈరాజధాని 8 సర్కిల్సుగా భాగింపబడి యున్నది. ప్రతి సర్కిలుకును ఒక ఇన్స్పెక్టరును నియమించి యున్నారు. వీరు అసిస్టెంటు ఇన్స్పెక్టర్లు చేయు పనులను తనిఖీ చేసి డైరెక్టరు వారికి రిపోర్టు చేయవచ్చును. ఎలిమెంటరీ పాఠశాలలను అంగీకరించవలసినవారు ఈ ఇన్స్పెక్టర్లే.

బాలికా పాఠశాలలకు ప్రత్యేకముగా ఇన్స్పెక్ట్రెస్సులును, అసిస్టెంటు ఇన్స్పెక్ట్రెస్సులును నియమింపబడి ఉన్నారు. విద్య ఇలాకాకు పైఅధికారి డైరెక్టరువారు. వీరు ఆలోచన సభతో కూడిన గవర్నరువారికి లోబడిన ఉద్యోగస్థులు. వీరు ఈ రాజధాని విద్య ఇలాక అన్ని విధములైన పనులను చేయవలసి యున్నది గనుక వీరికి సహాయముగా ఇద్దరు ఉద్యోగస్థులు నియమింపబడి యున్నారు. వీరిలో (1) పెర్సనల్ అసిస్టెంటు:—వీరు ఈనాలుగువిధములైన పరీక్షాధికారులను నియమించుట, తీసివేయుట, మార్చివేయుట ఈమొదలైన ఉద్యోగసంబంధమైన పనులను, బోర్డు మునిసిపల్ పాఠశాలలసంబంధమైన విషయములను, కాలేజికి కావలసిన ఉపాధ్యాయులు, సామానులు, కట్టడములు మొదలగు విషయములను గమనించుటలో డైరక్టరువారికి సహాయముచేయుదురు. (2) డిప్యూటీ డైరెక్టరు:—వీరు ఎలిమెంటరీ సెకండరీ పాఠశాలలయొక్క ద్రవ్యసహాయ కార్యములను, కాలేజీలకు కావలసిన కట్ట

డము లు, సామానులు వీని సంబంధమైన ద్రవ్య సహాయకార్యములును, సెకండరీ పాఠశాలలను అంగీకరించుట లోను, డైరెక్టరువారికి సహాయము చేయుచుందురు. కట్టడముల విషయమున రూ. 1000 లకు ఎక్కువ మొత్తము కావలసినప్పుడును, సామానుల విషయమై 200 రూపాయలకు ఎక్కువగా కావలసి యున్నప్పుడును డైరెక్టరు వారు గవర్నమెంటు వారి అనుమతిని బొందవలెను.

## XIV బ్రిటిష్ రాజ్యభాగములు, స్వదేశ రాజ్యములు.

బ్రిటీషు గవర్నమెంటువారి పరిపాలనమునకు లోబడియుండునట్టియు పైతనిఖీకి లోబడియుండునట్టియు హిందూదేశముగెుక్క భాగములును తర్వాత రెండు పేజీలయందును చెప్పబడియున్నవి. అవి చూచినయెడల దేశమంతయు బ్రిటీషు గవర్నమెంటువారు స్వయముగ నేలుటలేదని తెలిసికొనవచ్చును. వారు స్వయముగ నేలుభాగములు అన్నియు ఒకకేపర్యాయము వారి ఆధీనములోనికి వచ్చియుండలేదు.

(1) బ్రిటీషు గవర్నమెంటువారి స్వకీయ పరిపాలనము నకు లోబడియుండు దేశములు:—

| | దేశములు. | విస్తీర్ణము చదరపు మైళ్లు దాదాపుగా. | 1910 సం॥ జనాభా లెక్క ప్రకారము జనసంఖ్య | రాజ్య భారము | బ్రిటిషువారి అధీనములోకి వచ్చిన సంవత్సరము |
|---|---|---|---|---|---|
| 1. | చెన్నపురి. | 1 1/2 లక్షలు. | 3 3/4 కోట్లు. | గవర్నరు. | 1639 |
| 2. | బొంబాయి. | 1 1/4 ,, | 1 3/4 ,, | గవర్నరు. | 1662 |
| 3. | బంగాళము. | 1 1/2 ,, | 7 1/2 ,, | లెఫ్టినెంటు గవర్నరు. | 1757 |
| 4. | ఆగ్రా, అయోధ్యా ఐక్యమాగాణము. | 1 ,, | 4 3/4 ,, | ,, | 1856 |
| 5. | పంజాబు. | 97 వేలు. | 2 ,, | ,, | 1849 |
| 6. | బర్మా. | 2 1/4 లక్షలు | 1 1/4 ,, | ,, | 1886 |
| 7. | మధ్యమాగాణము. | 86 వేలు. | 98 లక్షలు. | చీఫ్ కమీషనర్ | 1853 |
| 8. | అస్సాము. | 56 ,, | 61 ,, | ,, | 1829 |
| 9. | పశ్చిమోత్తరపరగణాలు. | 16 ,, | 21 ,, | ,, | 1901 |
| 10. | అజమీరు, మార్వార. | 2 1/2 ,, | 4 3/4 ,, | ,, | 1818 |
| 11. | బీరారు. | 17 3/4 ,, | 27 1/4 ,, | ,, | 1803 |
| 12. | కూర్గు. | 1 1/2 ,, | 1 3/4 ,, | మైసూరు రెసిడెంటు. | 1834 |
| 13. | బెలూచిస్థానము. | 45 ,, | 3 ,, | చీఫ్ కమీషనర్ | 1889 |
| 14. | అండమాన్ దీవులు. | 3 1/4 ,, | 24 1/2 వేలు. | ,, | 1858 |

(2) బ్రిటీషు గవర్నమెంటువారి తనిఖీకి లోబడియుండు స్వదేశ రాజ్యములు.

| | రాజ్యములు. | విస్తీర్ణము, చదరపుమైళ్లు. | 1901 సం॥ జనాభాలెక్క ప్రకారము జన సంఖ్య. | కప్పము మొత్తము. |
|---|---|---|---|---|
| 1. | రాజపుత్రస్థానము. | 1 1/4 లక్ష. | 97 లక్షలు. | 320 లక్షరూ. |
| 2. | మధ్యఇండియా. | 79 వేలు. | 86 ,, | 421 ,, |
| 3. | బెలూచిస్థానము. | 86 ,, | 5 ,, | 510 ,, |
| 4. | హైదరాబాదు. | 82 ,, | 1 1/4 ,, | 59 ,, |
| 5. | కాశ్మీరము. | 81 ,, | 29 ,, | 87 ,, |
| 6. | మైసూరు. | 29 1/2 ,, | 55 ,, | 190 ,, |
| 7. | బరోడా. | 8 ,, | 20 ,, | 123 ,, |

కొచ్చి, పుదుక్కోట, తిరువాన్కూరు ఇవి చిన్న స్వదేశ రాజ్యములు.

పైన చెప్పబడిన బ్రిటీషు గవర్నమెంటువారి పరిపాలనక్రింద నుండు స్వదేశములలో నొకటియైన చెన్నపురి రాజధానియందు ఏరీతిగ రాజ్యపరిపాలన జరుగుచున్నదను విషయము ఇదివరలో వివరించియున్నాము. ఇతర రాజ్యములందుగూడ ఇదేవిధము

గానే రాజ్యపరిపాలన జరుగుచున్నది. అయినను దేశముయొక్క విస్తీర్ణము, జనసంఖ్య, జనులయొక్క స్వభావము వీనినిబట్టి కొంతవ్యత్యాసముండును. బ్రిటీషు గవర్నమెంటువారిచే స్వయముగా పరిపాలింపబడు దేశములయొక్క సగము విస్తీర్ణము కంటె స్వదేశ రాజ్యములయొక్క విస్తీర్ణము ఎక్కువగానున్నది.

స్వదేశరాజులచే ఏలబడు రాజ్యములలో గొప్పవాని యందు ఆంగ్లేయ ఉద్యోగస్థుడైన రెసిడెంటు అనునాతడు, రాజ్యపరిపాలన విషయములో సహాయము చేయుటకు నియమింపబడియున్నారు. చిన్నస్వదేశరాజ్యములైన ఎడల ఇటువంటిసహాయము పొలిటికల్ ఏజంటు అని చెప్పబడు ఉద్యోగస్థునిచే చేయబడుచున్నది. మిక్కిలి చిన్నదైన ఎడల ఆరాజ్యముండు జిల్లాయొక్క కలక్టరే పొలిటికల్ ఏజంటుయొక్క పని చేయుచుండును.

1857 సంవత్సరములో గొప్పసిపాయికలహముజరిగెను. అప్పుడు ఇంగ్లాండులో రాజ్యపరిపాలన చేయుచుండిన విక్టోరియా మహారాణిగారు ఈకలహమును ఆపి, 1858వసంవత్సరమున ఈదేశమునకు చక్రవర్తిని అయ్యెను. ఒక రాజుక్రింద అనేక చిన్నరాజు లుండి (సామంతరాజులు) కప్పము చెల్లించుచుండిన ఎడల కప్పము గ్రహించురాజునకు చక్రవర్తి యని పేరు.

1858 సం॥ గొప్ప కలహమునకు తరువాత మహారాణిగారు హిందూ దేశజనులకు సహాయముగా ఇట్లు వాగ్దా

నము చేసి యున్నారు. (1) హిందూదేశములో నుండువారు వారివారికి ఇష్టము వచ్చినమతములను అవలంబించుటలో ఏకారణముచేతను గవర్న మెంటువారు ప్రవేశింప కూడదు. (2) 1858 వ సంవత్సరమున ఎవరెవరి వద్ద ఏయే రాజ్యము లుండెనో ఏ యే దస్తావేజు లుండెనో, కలహామునకు మునుపు హిందువులు ఏయే సదుపాయములు గలిగి యుండిరో వానిని వారు ఎప్పటికిని స్థిరముగా అనుభవించుచుండ వలసినది. అది మొదలు గవర్న మెంటు వారు స్వదేశ రాజ్యములను పరిగ్రహించుట లేదనియు, ఆరాజ్యములను స్వదేశ రాజులే పాలింపవలయు ననియు, ఆరాజుయొక్క సంతతివారు ఆరాజ్యములను పారంపర్యముగా అనుభవించ వచ్చుననియు, ఏస్వదేశ రాజ్యములు చక్కగా పరిపాలన చేయకపోవుటవల్ల జనులకు తొందర్లు కలుగుచున్నవో ఆ రాజ్యములను గవర్నమెంటు వారు స్వీకరించి వారి రాజ్యములతో కలుపుకొందు రనియు ఎల్లవారికి తెలుపఁబడెను. ఈ వాగ్దానము ప్రకారము స్వదేశరాజ్యములను గవర్నమెంటు వారు మర్యాదతోను, విశ్వాసముతోను ఆదరించు చున్నారు. కొందఱు రాజులు కప్పము చెల్లించుచున్నారు. అయిన ఈదేశము యొక్క బందోబస్తి కొఱకు గవర్న మెంటువారు ఖర్చుచేయు మొత్తములో ఈ కప్పము మిక్కిలి స్వల్పమని చెప్పవచ్చును.

పైని చెప్పబడిన స్వదేశ రాజ్యముల యొక్క రాజులు

వారి రాజ్యములను, గవర్నమెంటువారు హిందూ దేశమును పరిపాలించు నట్లుగానే, దివాన్ అనుబిరుదు వహించిన మంత్రి యొక్క సహాయము చేతను, ఇతర సిబ్బంది ఉద్యోగస్థులయొక్క సహాయము చేతను తృప్తికరముగా రాజ్యము చేయు చున్నారు. పూర్వపు మంత్రులలో నైజాము రాజ్యములో సాలరు జంగు అనువారును, మైసూరు రాజ్యములో శేషాద్రి అయ్యరు వారును, బరోడా రాజ్యములో కీర్తి జెందిన సర్ టి మాధవ రావువారును, ఇందూరు రాజ్యములో దివాన్ బహదర్ పనిచేసి ఖ్యాతిఁ బొందిన మహా రాజ రాజశ్రీ దివాన్ బహద్దర్ రఘునాధరావుగారును, ముఖ్యమైనవా రని చెప్పవచ్చును.

గవర్నమెంటువారు స్వదేశ రాజులు రాజ్యభారములనిర్వహించుచున్నారని తృప్తిపొంది వారికి అప్పుడప్పుడు కావలసిన సమయములలో ఆలోచన సహాయమును చేయు చున్నారు. ఇదియుగాక మహాబుద్ధిమంతులైన స్వదేశ మంత్రులు ఈరాజ్యములలో పనిచేయుటవల్ల దేశమునకును జనులకును ఎంతో మేలు కలుగుచున్నది.

## XV రిజస్ట్రేషను ఇలాకా.

దస్తావేజు వగైరాలు దృఢపఱచుటకై ప్రత్యేకము ఒక శాఖ ఏర్పడియున్నది. రివిన్యూ సందర్భమున ఒక్కొక్క జిల్లా తాలూకాలుగా విభజింపఁబడిన విధమున రిజస్ట్రేషన్ సందర్భమందు ప్రతిజిల్లాయును సబ్ డిస్ట్రిక్టులుగా విభజింపబడియున్నది.

ఈఇలాకా ఉద్యోగస్థులు-1. సబ్ రిజస్ట్రారు:—వీరు సబ్ డిస్ట్రి క్టుకు అధికారి. వీరి ఆఫీసుకు సబ్ రిజస్ట్రార్సు ఆఫీసు అనిపేరు. సబ్ డిస్ట్రిక్టులో చేరిన గ్రామములలోని స్థిరాస్తి సంబంధమైన దస్తావేజులువగైరాలను దృఢపఱచుటకువీరికిఅధికారముగలదు. 2. రిజస్ట్రారు:—వీరు జిల్లాకంతయు అధికారి. వీరికి డిస్ట్రిక్టురిజ స్ట్రారు అనియు పేరుగలదు. వీరు తమఅధికారమునకు లోబడి యుండు సబ్ రిజస్టర్ ఆఫీసులనన్నిటిని తనిఖీచేయుదురు. దృఢ పఱచు విషయములోగూడ తమ జిల్లాలోని ఏసబ్ డిస్ట్రిక్టులో పుట్టబడిన దస్తావేజునైన దృఢపఱచుటకు వీరికి అధికారము గలదు. 3. ప్రెసిడెన్సీ రిజస్ట్రారు:—వీరు చెన్నపట్నం చెంగ ల్పట్టుజిల్లాలకు రిజస్ట్రారు. ఈయనకు ప్రెసిడెన్సిలో ఎక్కడ పుట్టబడినదస్తావేజునైన దృఢపఱచుట కధికారమున్నది. 4. ఇన్ స్పెక్టర్ జనరల్ ఆఫ రిజస్ట్రేషన్:—వీరు ఈ శాఖకంతకు పై అధికారులు.

దృఢపఱచుట:—కొందఱు దుర్మార్గులు తప్పుదస్తావేజు లను పుట్టించి అనగా ఇతరులు తమకు బాకీయున్నట్టుగాని లేక వారివద్ద పొలములు ఇండ్లు మొదలగునవి విక్రయము చేసికొని నట్లుగాని రహస్యముగా పత్రములు వ్రాసి వారి సంతకములు ఫోర్జరీచేసి అనగా వారిచేవ్రాళ్లను తామేచేసి, వారికితోడుపో యినవఱికొందఱి దొంగలచే సాక్షిచేవ్రాళ్లు చేయించి, కడకు ఆఫోర్జరీ దస్తావేజును బట్టి కోర్టులో దావాచేసి, సాక్షిసందర్భ

ములను చక్కగా పొందుపఱచి, కోర్టువారికి నమ్మకము కలుగు నట్లుచేసి దావాతమపక్షము చేయించుకొని లోకులను అన్యాయముగా ముంచుచున్నారు. రిజస్ట్రేషన్ ఆక్టు పుట్టుటకుపూర్వము ఇట్టిఅన్యాయములువిశేషముగాజరుగుచువచ్చినందున వీనిని అపుటకై దస్తావేజులు మొదలయినవానిని దృఢపఱచునిమిత్తము 1877 సంవత్సరము సర్కారు వారు ఈ శాఖను నూతనముగా ఏర్పాటుచేసి తగినచట్టములను ఏర్పఱచిరి. ఏ దస్తావేజులు విధిగా రిజస్టరు కావలయునో అట్టివి రిజస్టరు కాని యెడల చెల్లకూడదని విధించిరి. రిజస్ట్రారు ఆఫీసులో దాఖలు కాబడు ప్రతిదస్తావేజులు సర్కారువారి తరఫున రిజస్ట్రారువారు చక్కగా పరిశోధించి దస్తావేజుల వ్రాసియిచ్చితిమని చెప్పినవారిని, దస్తావేజులోని సాక్షులను చక్కగా విచారించి ఈపేర్లుగల మనుష్యులు వీరేనా అని నిరూపణ చేయించి పిమ్మట దస్తావేజుకు వెనుకప్రక్కన దస్తావేజు వ్రాసి యిచ్చిన వారియొక్క బొట్టనవ్రేళ్లగుర్తులతోకూడ వారిసంతకములను, వారిని నిరూపించిన సాక్షులయొక్క సంతకములను చేయించి తాముగూడ సంతకముచేసి ఆఫీసుముద్ర వేయింతురు. ఈపనికే దృఢపఱచుట యని పేరు. ఇట్లు సర్కారు ఆఫీసరు ఎదుట దస్తావేజులు దృఢపఱచుకొన వలసినది విధిగా ఏర్పడినందున మోసగాండ్రు పుట్టించునట్టి ఫోర్జరీ దస్తావేజులవలన ప్రజలకు గలిగెడు ఉపద్రవములు నిర్మూలముగా కావింపబడినవని చెప్పవచ్చును.

దస్తావేజులనుదృఢపఱచినపిమ్మట వానిని రిజస్ట్రారువారు తమ ఆఫీసులోనుండు రిజస్టర్లలో ఉన్నది ఉన్నట్టుగ వ్రాయించి పార్టీలకు ఇచ్చివేయుదురు. ఇందుకు ప్రతి ఆఫీసులోను నాలుగువిధములయిన రిజస్టర్లు ఉండును. ఇవి ఏవన:—

1. నెం. రిజస్టరు:—మరణశాసనము గాక స్థిరాస్తితో సంబంధించినదస్తావేజు లన్నియు ఈపుస్తకములో వ్రాయబడును. దీనిలో వ్రాయబడు దస్తావేజులకు ఎవరు దరఖాస్తు పెట్టుకొన్నను నకళ్లు ఇవ్వబడును.

2. నెం. రిజస్టరు:—రిజస్టరు చేయుటకు నిరాకరింపబడిన దస్తావేజులతాలూకు నిరాకరింపబడుటకు తగినహేతువులు దీనిలో వ్రాయబడును. ఈబుక్కులోని అంశములకు నకళ్లు ఎవరుకోరినను ఇవ్వబడును.

3. నెం. రిజస్టరు:—ఈబుక్కులో మరణశాసనములు మాత్రము వ్రాయబడును. మరణశాసనములువ్రాసియిచ్చినవారు జీవించియుండువఱకు సదరు బుక్కువారిదరఖాస్తుమీదగాని, వారిఏజంట్లదరఖాస్తుమీదగాని, వెదకబడును. మఱియు బుక్కులోని దస్తావేజులకు నకళ్లు వ్రాసియిచ్చినవారియొక్క గాని వారిఏజంట్లయొక్కగానిదరఖాస్తుమీద ఇవ్వబడును. వ్రాసియిచ్చినవారు చనిపోయినపిమ్మట ఎవరుదర్ఖాస్తుచేసినను మరణశాసనములబుక్కు వెదకబడును. మఱియు

సదరుబుక్కులోనిదస్తావేజులకు నకళ్లు ఇవ్వబడును.

4. నెం. రిజిస్టరు:—చరాస్తితో సంబంధించినదస్తావేజులు ఈ బుక్కులో వ్రాయబడుచున్నవి. ఇది వ్రాసియిచ్చిన వారుగాని వ్రాయించుకొన్నవారు గాని లేక వారి ఏజంట్లుగాని లేక వారసులుగాని దరఖాస్తుచేసికొని నపుడు నకళ్లు ఇవ్వబడును.

దస్తావేజులు వగైరాలు రిజస్టరు చేయించక పోవుటవల్లను చేయించుటవల్లను కలుగుఫలములు:—

రిజస్టరు కాబడిన ప్రతి దస్తావేజున్ను రిజస్టరు తేదినుండి కాకుండ దస్తావేజు పుట్టినదినములనుండియు అమలులోనికివచ్చును. దస్తావేజులు స్థిరాస్తితోగాని, చరాస్తితోగాని సంబంధము కలిగి యున్నప్పుడు అట్టివి రిజస్టరు కానిపక్షమున చెల్లతగినవి కావు. సదరాస్తితో సంబంధించిన వాగ్రూపకమైన ఒడంబడికలు, సదరు ఒడంబడికలు ద్వారా సదరు ఆస్తి వెంటనే ఒప్పగింపబడనిపక్షమున చెల్లతగినవి కావు. విధాయకముగా రిజస్టరు కావలసిన దస్తావేజులు రిజస్టరు కానియెడల సదరు దస్తావేజులలోని ఆస్తిని బాధింపవు. దత్తతకు అధికారము కలుగజేయవు. అట్టి దస్తావేజులు ఆయా వ్యవహారములలో సాక్ష్యముగా నైనను అంగీకరింపబడవు.

దస్తావేజులలో అనేకవిధములు గలవు. వీనిలో కొన్ని విధాయకముగా రిజస్టరు కావలయును. తక్కినవి విధాయక

ముగా రిజిస్టరుకా నక్కఱలేదు గాని పార్టీలకు ఇష్టమయిన యెడల రిజిస్టరు చేసికొనవచ్చును.

ఈక్రింద 1, 2, 3, 4, 5 పేరాలలో పేర్కొన బడినవి విధాయకముగా రిజిస్టరు చేయవలసిన దస్తావేజులు:—

1. చరస్థిరాస్తులతో సంబంధముగల దానపత్రములు.

2. స్థిరాస్తితో సంబంధించిన విక్రయదస్తావేజులు, పరివర్తన (ట్రాన్సుఫర్) దస్తావేజులు, తాకట్టులేక తనఖా దస్తావేజులు, జామీను దస్తావేజులు మొదలగునవి.

3. స్థిరాస్తితో సంబంధించియుండి నూరు రూపాయల విలువకు తక్కువకాని విభాగపు దస్తావేజులు, పాలివ్యాపార సంబంధమైన దస్తావేజులు. వానిని నివర్తిచేయు దస్తావేజులు, తాకట్టుసొత్తును తిరిగి ఒప్పగించు దస్తావేజులు, హక్కువిడుదల దస్తావేజులు, శెటల్‌మెంటు దస్తావేజులు, కవులువిడుదల దస్తావేజులు, ట్రాన్సుఫర్ దస్తావేజులు దత్తత(స్వీకారము) ను రికార్డుచేయు దస్తావేజులు మొదలగునవి.

4. స్థిరాస్తితో సంబంధించి 5 సంవత్సరములకుమించిన షరతులగు కవుళ్లు, ఏక్‌సాలకు (ఒక సంవత్సరమునకు మించి సాలియానా (సంవత్సరపు) శిస్తు ఏబది రూపాయలకు మించిన కవుళ్లు, సాగుబడికాని లేక కాగితముని బీటిక్రింద వదలబడిన భూములు, పాటిస్థలములు, ఇండ్లు, స్థలములు వీనితో సంబంధించిన కవుళ్లు, అద్దెచీట్లు.

5. మరణశాసనము కానట్టియు, దత్తతకు అధికారము ఇచ్చునట్టియు 1872సం. జనవరి దరిమిలాను పుట్టబడిన దస్తావేజులు (స్వీకారపత్రములు.)

పైన 3. వ. పేరాలో ఉదహరింపబడిన వానిలో నూరు రూపాయల విలువకు లోబడిన దస్తావేజులును, వానితో సంబంధించిన రసీదులును, 2.వ. పేరాలో ఉదహరింపబడిన దస్తావేజులతో సంబాధించి నూరురూపాయల విలువకు మించనిరసీదులు, స్థిరాస్తితో సంబంధించి ఒకసంవత్సరమునకు పైబడని పరతుగల కవుల్లును, పైన ఉదహరించిన నాల్గవపేరాక్రింద చేరని కవుల్లు, మరణశాసనములు, చరాస్తితో సంబాధించిన విక్రయములు, తనఖాలు, పారీకత్తులు, హక్కువిడుదలలు, అద్దెచీట్లు, ఆబ్కారీ ముచ్చిలుకాలు, రసీదులు వగైరాదస్తావేజులు; విధాయకముగా రిజిస్టరుకావలసినవని చెప్పినవానిలో చేరని ఇతర దస్తావేజులు అనగా విడిపత్రములు, వకాల్తునామాలు ప్రామిసరినోట్లు, చరస్థిరాస్తుల సంబంధములేని రసీదులు, ఒడంబడికలు, పరివర్తనలు, తనఖా దస్తావేజులపయిన వ్రాయబడు చెల్లులు ఈ మొదలగు దస్తావేజులు విధాయకముగా రిజిస్టరు చేయ నక్కఱలేదు.

స్థిరాస్తి, చరాస్తి ఈరెంటికిని గల భేదము:—

స్థిరాస్తి అనగా ఒకచోటనుండి మఱియొక చోటునకు తీసికొని పోవుటకు వీలుగాని ఆస్తి:—పొలములు—నివేశన

స్థలములు—గృహములు—ఇనాములుగా ఇవ్వబడిన గ్రామములు, ముఠాలు, జాగీర్లు, జమీనులు మొద లగునవియును, వానిలోనిభాగములును — రేవులు—నూతులు—చేపలుపట్టు స్థలములు-సంతస్థలములు—చెట్లు ఈ మొదలగునవి అన్నియు స్థిరాస్తి సంబంధమైనవి.

చరాస్తి అనగా ఒకచోటనుండి మఱియొకచోటునకు తీసికొనిపోవుటకు వీలు అయినట్టిది :—పశువులు, సేద్యపుపనిముట్లు, గృహోపకరణములు. ఇతరసామానులు, నగలు, నాణెములు, వస్త్రములు, ధాన్యము మొదలగునవి చరాస్తి సంబంధమైనవి.

స్థిరాస్తి సంబంధమైనదస్తావేజును వ్రాయునప్పుడు సదరు ఆస్తిని దస్తావేజులలో వివరింప వలసిన విధము ఈ క్రింద వ్రాయబడినది;—

| సర్వే కాబడినపొలము. | సర్వే కానిపొలము. |
|---|---|
| 1. సర్వేనంబరు సబ్ నెంబరు లేక లెటరు. | 1. పేరు ఉన్నయెడల అట్టిపేరు. |
| 2. జిరాయితీ, ఈనాం, లేక జమీందారీ. | 2. పేరులేనియెడల ప్రసిద్ధిగల హద్దులు. |
| 3. పరిమితి. | 3. పయిమాయిషీనంబరు. |
| 4. మెరక, పల్లము, లేక, తోట పైనవివరించినవాని లోనుండు, | 4. జిరాయితి, ఈనాం, జమీందారీ. |
| 5. గృహములు, కట్టడములు, చెట్లు, నూతులు. | 5. పరిమితి. |
| | 6. మెరక, పల్లము లేక తోట. |

6. సబ్ నంబరుగాని లేటరుగాని లే నట్టి పొలములు కొంతభాగమైన యెడల సదరు పొలములో ఏ వైపుననో అందులో ఎంతభాగమో.

7. పైవానిలోనుండు ఇండ్లు, కట్టడములు, చెట్లు, నూతులు మొదలయినవి.

నివేశస్థలములు, గృహములు.—వీని విషయమున దస్తావేజులలో కనబఱచవలసిన విషయములు ఏవనగా 1. వీధి పేరు. 2. వీధి ఏవైపున నున్నది. 3. నాలుగువైపులహద్దులు 4. మునిసిపల్ లేక యూనియన్ నంబరు. చెన్నపట్టణమైనయెడల సర్వేనంబరు 5. పరిమితి అనగా నాలుగువైపులగజములు లేక చతురపుగజములు.

నూతులు, చెట్లు:—వీని విషయమున దస్తావేజులో కనబఱచవలసినవిషయములు ఏవన 1. ఏపొలములో లేక ఏస్థలములోఉన్నది. 2. పొలములో నున్నయెడల పొలముయొక్క వివరము. స్థలములోనున్నయెడల స్థలముయొక్క వివరము.

గ్రామములు, జాగీర్లు వగైరాలలోనుండు భాగముల విషయమై దస్తావేజులో కనపఱచవలసినవివరణము ఏమన:— 1. గ్రామముయొక్క హద్దులు. 2. గ్రామములో ఎంతభాగమైనది ఏవైపుననున్నది 3. పరిమితము.

దేవుల వివరణ:—
1. ఏగ్రామముసరిహద్దులో ఉన్నది,
2. ఏనదికి సంబంధించినది.
3. ఏస్థలమునుండి ఏస్థలమునకు అయినది.

| చేపలు పట్టుస్థలముల వివరణ | 1. నదిపేరు. చెఱువుపేరు.<br>2. ఏస్థలమునుండి ఏస్థలమువఱకు. |
|---|---|

సంతస్థలముల వివరణ:—వీనికి నాలుగు హద్దులును వ్రాయవలయును.

[దస్తావేజులన్నిటిలోను 1. సబ్ డిస్ట్రిక్టుపేరు 2. గ్రామము శివారు ఉన్నయెడల శివారును వ్రాయవలయును.]

దస్తావేజులు 1. ఎక్కడ 2. ఎప్పుడు 3. ఎవరు దాఖలు చేయవలెను?

1. స్థిరాస్తితో సంబంధించిన దస్తావేజులు అన్నియును సదరు ఆస్తి ఉండునట్టి సబ్ డిస్ట్రిక్టులో రిజిస్టరుకావలెను. సదరు సబ్ డిస్ట్రిక్టుతో సంబంధించిన డిస్ట్రిక్టులోగాని లేక ప్రెసిడెన్సిటవునులోగాని రిజస్టరు చేయవచ్చునుగాని రిజస్టరు రుసుము అట్టివిషయములో సబ్ డిస్ట్రిక్టులో చెల్లించవలసిన దానికంటె అధికముగా చెల్లించవలసియుండును. స్థిరాస్తితో సంబంధించని ఇతర దస్తావేజులు ఏసబ్ డిస్ట్రిక్టులో నైనను రిజస్టరు చేసికొనవచ్చును.

ఒక దస్తావేజుతో ఉదహరించవలసిన స్థిరాస్తి ఒకటికంటె ఎక్కువ సబ్ డిస్ట్రిక్టులో ఉన్నయెడల సదరుదస్తావేజును సదరు సబ్ డిస్ట్రిక్టులో ఎక్కడనైనను రిజస్టరు చేయవచ్చును:—కృష్ణాజిల్లా గుడివాడ సబ్ డిస్ట్రిక్టులో చేరిన ఒకభూమిని విక్రయింపదలచుకొన్న వారు విక్రయదస్తావేజును గుంటూ

రుజిల్లా వంగోలు సబ్ డిస్ట్రిక్టులో రిజస్టరు చేయఁదలచుకొన్న యెడల సదరుదస్తావేజు వంగోలు సబ్ డిస్ట్రిక్టులో తనహక్కు-భుక్తములోనున్న స్థిరాస్తిని ఏమాత్రమైనను (ఒక సెంటుగాని, అరసెంటుగాని) నామకార్థముగా ఉదాహరించినగాని అట్టిదస్తావేజు అక్కడ (వంగోలులో) రిజస్టరు కాబడదు.

2. దస్తావేజు వ్రాయబడిన తేది మొదలుకొని నాలుగుమాసములలోగా దస్తావేజును వ్రాసియిచ్చినవారు రిజస్టరుకు హాజరు కావలయును. లేకున్న అది అంగీకరింపబడదు. సదరు నాలుగు మాసముల కాలములో ఏకారణము వల్లగాని హాజరు కానిపక్షమున అందులకు తగినంత కారణము కనపఱచి, రిజస్టరు రుసుముకు పదిరెట్లకు మించని జరిమానా చెల్లించినపక్షమందు సదరు దస్తావేజు రిజస్టరు చేయబడవచ్చును.

దస్తావేజు వ్రాసి యిచ్చిన వారు బుద్ధిపూర్వకముగా రిజస్టరుకు హాజరు కానిపక్షమందు వ్రాయించుకొన్న వారే దస్తావేజును దాఖలు చేసి వ్రాసి యిచ్చిన మనిషిని హాజరు పఱచుటకు సమ్మను దరఖాస్తు చేసికోవచ్చును. సమ్మనుకుగూడ హాజరు కానియెడల వారంటుదరఖాస్తు పెట్టుకొనవచ్చును.

3. దస్తావేజును వ్రాసియిచ్చినవారును, వ్రాయించుకొన్న వారును దస్తావేజును రిజస్టరుకుదాఖల్ చేయవలయును. పైన ఉదహరించిన నాలుగుమాసముల కాలములో వీరిలో నెవ

రైనను చనిపోయిన యెడల అట్టివారి వారసులు దాఖలు చేయవలయును. వీరిలో ఎవరుగాని హాజరగుటకు వీలుకాని పక్షమున వీరి ఇలాకా అధికారము పొందబడిన ఏజంట్లు సదరు దస్తావేజులను దాఖలు చేయవచ్చును. అధికారము పొందుట అనగా అధికార పత్రిక లేక పవర్ ఆఫ్ అటర్నీ అను పేరుగల దస్తావేజును అధికారము చెలాయించ వలసిన వానిపేర వ్రాయబడి అదిఏరిజస్టరు ఆపీసరుగారి ఎదుట నైన యథార్థ పఱచబడవలయును.

[పవ రాఫ్ అటర్నీ యొక్క మతలబు ఇతర దస్తావేజుల మతబులతో గూడ తరువాత వ్రాయబడి యున్నది.]

ఇండియన్ రిజస్ట్రేషన్ ఫీజు పట్టికనుండి జనులు ముఖ్యముగా తెలుసుకోవలసిన రిజస్ట్రేషన్ ఫీసు జాప్తా.

1. (a) దస్తావేజులను I వ, IV వ పుస్తకములలో రిజిస్టరు చేయుట.—

| | | | | | | రు. అ. పై. |
|---|---|---|---|---|---|---|
| (1) | దస్తావేజుయొక్క కిమ్మతు 10 రూపాయలకు మించనియెడల | | | | | 0 4 0 |
| (2) | ఆ కిమ్మతు | 10 రూపాయలకు మించి | 25 రూపాయలకు | | మించనియెడల | 0 6 0 |
| (3) | డిటో | 25 | డిటో | 50 | డిటో | 0 8 0 |
| (4) | డిటో | 50 | డిటో | 75 | డిటో | 0 12 0 |
| (5) | డిటో | 75 | డిటో | 100 | డిటో | 1 0 0 |
| (6) | డిటో | 100 | డిటో | 250 | డిటో | 1 8 0 |
| (7) | డిటో | 250 | డిటో | 500 | డిటో | 2 0 0 |

(8) డిటో 500 డిటో 1,000 డిటో 3 0 0
(9) డిటో 1,000 డిటో 5,000 డిటో అట్లు
మైఁబడిన ప్రతి 500 రూపాయలకుఁగాని లేక అందలి భాగ
మునకుఁ గాని. 1 0 0
(10) ఆ కిమ్మతు 5,000 రూపాయలకు మించి 50,000 రూపా
యలకు మించనియెడల, అట్లు పైఁబడిన ప్రతి 1,000 రూపా
యలకుఁ గాని అందలి భాగమునకుఁ గాని. 1 0 0
(11) ఆ కిమ్మతు 50,000 రూపాయలకు మైఁబడిన యెడల, అట్లు
మైఁబడిన ప్రతి 1,000 రూపాయలకుఁ గాని అందలి భాగము
నకుఁ గాని. 0 8 0
(12) పవర్ అఫ్ అటర్నీలను రిజిస్టరుచేయుటకు 2 8 0

* * * *

విభాగపు పత్రముల సంగతిలో, స్టాంపు హాసీలు చెల్లింపబడవలసి యున్నట్టి ప్రత్యేకపఱుపఁబడిన భాగముయొక్క లేక భాగములయొక్క కిమ్మతునే కిమ్మతుగా లేక కన్సిడరేషనుగా గ్రహింపవలయును.

* * *

(ప్రిన్సిపల్) ముఖ్యమైనట్టి, లేక (ప్రైమరీ) మొదటిదైనట్టి తాకట్టు క్రమముగ రిజిస్టరు చేయఁబడియున్నట్లు రిజిస్టరుచేయు ఆఫీసరునకు తృప్తికరముగ ఋజువుపఱుపఁబడినపుడు, కొల్లాటరల్ (తోడుగా నుండుటకైన) లేక ఆక్సిలియరి (ఉపబలముగా నుండుటకైన) లేక అడ్డిషనల్ (హెచ్చుగా నుండుటకైన) లేక సబ్‌స్టిట్యూటెడ్ (బదులుగా నుండుటకైన) జామీనుగాని, మఱికొంత బరవసాగా నుండుటకైన జామీనుగాని యిచ్చునట్లు ఉద్దేశింపఁబడిన దస్తావేజుమీఁద కట్టఁదగిన రిజిస్ట్రేషను ఫీజు అయినది—ముఖ్యమైన తాకెట్టుపైఁగాని విధించిన ఫీజు 2 రూపాయలకు మించక పోయినయెడల అది యెంతో అంత ఫీజుగాను, అట్లు కాకపోయిన యెడల 2 రూపాయలు ఫీజుగాను, ఉండును.

తత్పూర్వమె రిజిస్టరై యున్న యేదస్తావేజుకుఁగానైనను పైకము పుచ్చుకొన్నట్లు లేక చెల్లించినట్లు ఒప్పుకొనుచు వ్రాసియిచ్చిన యొక దస్తావేజుమీఁదగాని లేక తత్పూర్వమె రిజిస్టరై యున్న తాకట్టులను, కార్లు వగయిరాలను అనుసరించి అప్పులు లేక పన్నులు చెల్లింపఁబడినట్లు ఒప్పుకొనుచు వ్రాసియిచ్చిన యే రసీదుమీఁదఁగాని, కట్టఁదగిన రిజిస్ట్రేషను ఫీజు 2 రూపాయల హెచ్చుమొత్తమునకు మించక, 1 (a) ఆర్టికలులో నిర్ణయింపఁబడిన ప్రకారము విలువనుబట్టి యుండును.

అసలు దస్తావేజును రిజిస్టరుచేయుటకు దాఖలుచేయఁబడు దినమందే ఆ దస్తావేజుకు (డూప్లికేటు) రెండవప్రతిగాని (కౌంటర్ పార్ట్) యెదురు నకలుగాని రిజిస్టరుచేయుటకు దాఖలు చేయఁబడినయెడల, అట్టి రెండవ ప్రతిని లేక యెదురునకలును రిజిస్టరు చేయుటకు రుసుము, సదరు అసలు దస్తావేజుగూడ రిజిస్టరు చేయఁబడు పక్షమందు, సర్టిఫైచేసిన నకళ్లకు నిర్ణయింపఁబడియున్న రేటుచొప్పున ఉండును; కాని కాపీచేయుటకయిన రుసుము సదరు సాధారణమయిన రుసుమునకంటె హెచ్చుగా నున్నయెడల అటుండదు.

(4) 64, 65, 66, 67 సెక్షన్లననుసరించిన యాదాస్తు— రు.అ.పై.
కోరినటువంటి ప్రతినకలుకు ... ... 0 4 0

(5) మరణశాసనములను స్వీకారాధికార పత్రికలను రిజిస్టరుచేయుట (3 వ పుస్తకము)—

లిఫాఫాలో వేయకుండ ఊరకె హాజరు చేయఁబడినట్టి మరణశాసనము లేక స్వీకారాధికారపత్రిక 4 0 0

అయినను, సంబంధపడిన సొత్తుయొక్క కిమ్మతు ఉదహరింపబడియుండి ఆకిమ్మతు 1,000 రూపాయలకు మించని మరణశాసనముల సంగతిలో

రిజిస్టరు చేయుటకు రుసుము 1 (a) ఆర్టికలులోని విలువను అనుసరించునట్టి స్కేలుప్రకారముగా నుండును.

*　　　*　　　*

7. పవర్ ఆఫ్ అటర్నీలను అటెస్టుచేయుట—

| | | రు. అ. పై. |
|---|---|---|
| (1) స్పెషల్ పవరు | ... ... | 0 8 0 |
| (2) జెనరల్ పవరు | ... ... | 1 0 0 |

*　　　*　　　*

11. (1) ఏ వాసస్థలమునకయినను లేక జెయిలుకైనను పోవుటకును అక్కడనుండి మరల వచ్చుటకును మైలుకు 4 అణాలకంటె అధికము కాకుండ ఎంతమొత్తము వాస్తవముగా ప్రయాణపు ఖర్చు క్రింద అగుచున్నదో ఆ మొత్తము రిజిస్ట్రార్లకు ఇయ్యవలెను. మఱియు అదేవిధ మయిన ప్రయాణములకు మైలుకు 3 అణాలకంటె అధికముకాకుండ ఎంతమొత్తము వాస్తవముగా ప్రయాణపు ఖర్చు క్రింద అగుచున్నదో ఆ మొత్తము సబ్ రిజిస్ట్రార్లకు ఇయ్యవలెను.

(2) రిజిస్ట్రార్లు వెంబడిగాని సబ్ రిజిస్ట్రార్ల వెంబడిగాని పోవునట్టి బంట్రౌతులకు లేక సర్కారు పనులలోనుండు అటువంటి తక్కువ నవుకర్లకు, వారు పోవునట్టి దూరము మరల వచ్చునట్టి దూరము (5) అయిదేసి మైళ్లకు ఎక్కువగా నున్నయెడల రోజుకు 2 అణాల రేటుచొప్పున ఇయ్యవలెను.

*　　　*　　　*

| | రు.అ.పై. |
|---|---|
| 13. (1) ఒక (ఎంట్రి) దాఖలాను లేక దస్తావేజును వెదకుటకుగాని లేక చూచుకొనుటకుగాని— మొదటి సంవత్సరమునకయి వెదకబడు పుస్తకములలో ఆ మొదటి సంవత్సరములో, ప్రతి దాఖలాకు లేక దస్తావేజుకు | 1 0 0 |

అట్లు ఇంకను తర్వాతి సంవత్సరములకయి వెదకఁబడు పుస్తకములలో తర్వాతి ప్రతి సంవత్సరములో, ప్రతి దాఖలాకు లేక దస్తావేజుకు ... ... ... 0 4 0

(2) ఒక్కటేసొత్తుకు సంబంధించి లేక యెవఁడయిన ఒకే నఫరువలననైనను నఫరు పేరటనైనను వ్రాయఁబడియుండు నట్టి యెన్ని దాఖలాలనైనను సరే, దస్తావేజులనైనను సరే మొత్తముగా వెదకుటకు లేక చూచుకొనుటకు—

మొదటి సంవత్సరమునకయి వెదకఁబడు పుస్తకములలో మొదటి సంవత్సరమునకు ... ... 2 0 0

అట్లు ఇంకను తర్వాతి సంవత్సరములకయి వెదకఁబడు పుస్తకములలో తర్వాతి ప్రతిసంవత్సరమునకు ... 0 8 0

* * *

ఒక సర్చి (వెదకడము) ముగిసిన తేదినుండి వారము రోజులయిన పిమ్మట అట్టి సర్చి యింకను చేయుటకుఁగాను పెట్టుకొనిన దరఖాస్తు ఒక క్రొత్త దరఖాస్తుగా భావింపబడి, యే పుస్తకములు ఇంకను వెదకవలయు నని కోరఁబడునో అట్టి పుస్తకములలో మొదటి సంవత్సరమునకు హెచ్చు రుసుములగు 1 రూపాయి, 2 రూపాయలు క్రమముగా చార్జిచేయఁబడును.

సర్టిఫైచేయఁబడ్డ నకలు ఇచ్చుటకుఁగాను చేసికొనఁబడు దరఖాస్తు దస్తావేజు రిజిస్టరుచేయుకాలమందు పెట్టుకోఁబడిన దరఖాస్తుగాభావింపఁబడి అదేప్రకారముగా రుసుము కట్టబడును. అయినను, సరియయిన రుసుములు వసూలు చేయఁబడియుండునట్టి ఒక్కటే దాఖలాకొరకై వెదకునపుడుగాని దాఖలాలకొరకై మొత్తముగా వెదకునపుడుగాని కనుగొనఁబడిన దాఖలాలకు నకళ్లు నిచ్చు విషయములో, దరఖాస్తుదారుఁడు దరఖాస్తులో దాఖలాయొక్క నంబరును సంవత్సరమును పార్టీలపేర్లును, దస్తావేజు స్వభావమును తెలిపినట్లయిన, రెండవసారి సర్చి రుసుము వసూలుచేయఁబడదు.

* * *

**14.** ఏ మనుష్యుడైనను తన లాభమునకుగాని లేక ఏ యాఫీసుకయిన పంపుటకుఁగాని, దాఖలాలకును, దస్తావేజులకును నకళ్లుకోరిన ఎడల అట్టి దాఖలాలకును దస్తావేజులకు నకళ్లఫీజు:—

| | రు.అ.పై. |
|---|---|
| (1) ఇంగ్లీషులో గాని రిజిస్టరుచేసెడి సబ్ డిస్ట్రిక్టు యొక్క దేశభాషలోగాని—ప్రతి 100 పదములకు లేక 100 పదములకు లోఁబడిన భాగమునకు ... | 0 1 0 |
| (2) వేఱె యే స్వదేశభాషలోనైన—ప్రతి 100 పదములకు లేక 100 పదములకు లోఁబడిన భాగమునకు ... | 0 3 0 |

(3) మ్యాపులయొక్కయు ప్లానులయొక్క నకళ్లవిషయములో, రిజిస్టరు చేయు ఆఫీసరు ప్రత్యేకముగా ఎంతరుసుము న్యాయముగా నిర్ణయించునో అంత రుసుము.

దాఖలుకాబడిన ప్రతిదస్తావేజు నిరభ్యంతరముగా దృఢపఱచబడునని తలంపకూడదు. రిజస్ట్రారుగారికి దస్తావేజుల విషయమున ఏవైన లోపములుఁ న్నట్లు కనబడినయెడల అట్టివానిని రిజస్టరు చేయుటకు వారు నిరాకరింప వచ్చును. ఇందువల్ల దూరపు గ్రామములనుండి రిజిస్టర్ ఆఫీసుకు వచ్చువారికి వ్యయప్రయాసములు కలుగుటయేగాక వచ్చినపని కాకపోవుటచే ఎన్నో యితర యిబ్బందులు కూడ కలుఁగవచ్చును. కాబట్టి దస్తావేజులు ఏకారణముల వల్ల నిరాకరింప బడవచ్చునో వానిని తెలిసికొని యుండుట మిక్కిలి అవశ్యము.

## దస్తావేజులు నిరాకరించుటకు కారణములు.

1. స్థిరాస్తియొక్క వివరము ఫలానిదని పూర్తిగా నిరూపింపక యుండుట.
2. దస్తావేజు వ్రాయబడిన తేదీలగాయతు నిర్ణయింపబడిన నాలుగుమాసముల గడువులోపల దాఖలుచేయక పోవుట.

3. ఒక డిస్ట్రిక్టులో సాధారణముగా వాడుకలేని భాషలో దస్తావేజు వ్రాయబడినపుడు దానికి సరియైన భాషాంతరము (తర్జుమా) గాని, సరియైన నకలుగాని, లేకపోవుట.

4. దస్తావేజు వ్రాసియిచ్చినవారుగాని, వారి ప్రతినిధులుగాని, అసైనీలు (Assignees) గాని, ఏజంట్లుకాని, నిర్ణయింపబడిన కాలములో హాజరు కాకపోవుట.

5. రిజస్టరుచేయు ఆఫీసరు ఎదుట హాజరయి దస్తావేజు వ్రాసి యిచ్చినట్టు చెప్పెడు మనుష్యుని యొక్క నిరూపణను గురించి వారికి తృప్తి కలుగకపోవుట.

6. ప్రతినిధిగాని, ఏజంటుగాని, అసైనీగాని హాజరయ్యెడు ఏమనుష్యునకైనను అట్లు హాజరు అగుటకు హక్కును గురించి రిజస్ట్రారువారికి తృప్తికలుగకపోవుట.

7. దస్తావేజులో హంసపాదలు, ఖాలీస్థలములు, తుడుపులు, సవరణలు మొదలగువానిని గుర్తింపకయుండుట; ఆయాచోట్ల ఇనిషలు (Initials) చేయకపోవుట.

8. నిర్ణయింపబడిన రుసుములుగాని, జుల్మానాలుగాని చెల్లింపక పోవుట.

9. దస్తావేజు వ్రాసియిచ్చినట్టు చెప్పబడు మనుష్యుడు ఈడురానివాడుగా గాని, ఫుట్టువెర్రిగాగాని, పిచ్చివాడుగాగాని ఉండుట.

10. దస్తావేజు దాఖలుచేయుటకు హక్కులేనివారిచే దాఖలు కాబడుట.

11. దస్తావేజు వ్రాసియిచ్చిన మనుష్యుడు చనిపోయిన యెడల చనిపోయినట్లు చెప్పినది రుజువు పఱచకపోవుట.

12. దస్తావేజు వ్రాసియిచ్చినమనిషి చనిపోయినపుడు సదరు మనిషియొక్క ప్రతినిధిగాని, అసైనీగాని దానిని వ్రాసి యివ్వలేదని చెప్పుట.

# దస్తావేజుల ముసాయిదాలు.

దస్తావేజులు వ్రాయు విధము సాధారణముగా అనేకులకు తెలియదు. కొన్ని గ్రామములలో ఎవరైన ఒకరు తెలిసినవా రున్నను ఇప్పటిదేశస్థితిని బట్టి రిజిస్ట్రేషను విశేష అవసరమైన విషయమైనందున ఎల్లవారును తెలిసి కొని యుండుట మిగుల ముఖ్యము. దస్తావేజుల లోని షరతులు దస్తావేజు వ్రాసి యిచ్చిన వారికి ఎంతవరకు అనుకూలములో ఎంతవరకు ప్రతి కూలములో స్కూళ్లలోగాని కాలేజీలలోగాని చెప్పఁబడ్డది కాదు గనుక బియ్యే పరీక్షలో తేరిన వారు కూడ దస్తావేజులు వ్రాయుటకు గాని, వానిలోని సంగతులు గ్రహించుటకుగాని అసమర్థులుగ నుండవలసి వచ్చినది. ఈకొఱత నివారించుటకై ఈ రిజిస్ట్రేషను విషయములు ఇంతే సవిస్తరముగా నిచ్చట చెప్పబడినవి. కొన్ని ముసాయిదాలు ఇవ్వనిది ఈ విషయము సంపూర్ణముగ నుండదని తోచినందున ఈక్రింద కొన్ని ముసాయిదాలు ఇచ్చియున్నాము.

(1) స్థిరాస్తి స్వాధీనపఱచిన విక్రయ దస్తావేజు.

1913 సంవత్సరం ఫిబ్రవరినెల తే 16 ది వంగోలు సబ్‌రిజిస్ట్రరులోని ప్రస్తుతం వంగోలుకాపురం బ్రాహ్మణుడు భూస్థితి ఉద్యోగంవల్ల జీవించే ఓరుగంటి సాంబయ్య శాస్త్రులగారి కొమారుడు రామలింగ శాస్త్రిగారికి వంగోలు సబ్‌రిజిస్ట్రరులోని చీమకుర్తి కాపురం ప్రస్తుతం కలకత్తాలోనుండే బ్రాహ్మణులు భూస్థితివల్ల జీవించే వేమూరు గోపాలకృష్ణయ్యగారి కొమాళ్లు రామయ్య, సుందరయ్య అను మేము వ్రాసియిచ్చిన స్థిరాస్తి స్వాధీన పఱచిన విక్రయపత్రము.

మాపెత్తండ్రి కోడలయిన వేమూరి అన్నమ్మతాలూకు ఉత్తరవార్సు హక్కుద్వారా వంగోలు డిస్ట్రిక్టు మునిసిప్ కోర్టు ఫైల్ అసల్ 1900 సం. రం. నె 818 ర్లనున్ను, ఇందు పైన నెల్లూరు డిస్ట్రిక్టు అప్పీల్ కోర్టు ఫైల్ 1901 సం. నె 175 ర్లనున్ను మాకు హక్కుగలిగి యీనెంబర్ల ప్రతివాదులు ఓరుగంటి శివరామయ్య వగైరాలద్వారా యీదినము స్వాధీన పర్చుకొన్నటువంటి యీక్రింద వ్రాయబడిన షెడ్యూల్ దాఖలా వంగోలుగ్రామములో

బ్రాహ్మణవీధిలోనుండే పెంకుటిల్లు, స్థలం, వృక్షములు వగైరాలు ఈదినము మా మనస్ఫూర్తిగా రూ 500-0-0 లు అక్షరాల అయిదువందల రూపాయలకు మీకు విక్రయించి సదరు క్రయధనమునకుగాను ఈదినము నీవల్ల మేము తీసుకొన్నది. రూ 100-0-0 లుగాక కడమ రూ 400-0-0 నన్నూరు రూపాయలు సబ్ రిజిస్ట్రరు వారి యెదుట నీవల్ల మేము తీసికొంటిమి గనుక సదరు క్రయధనము పూర్తిగా మాకు ముట్టినది. సదరుఇల్లు, స్థలం వగైరాలను ఇదివరలో జయవరపు శంకరరావుగారికి బాడిగకు ఇచ్చి వారివల్ల ఖరారునామా వ్రాయించుకొని యున్నందుకు సదరు ఖరారునామాను ఈదినము నీపరంగా యిచ్చి ఆస్తిని స్వాధీనపరిస్తిమి గనుక యిందునగురించిన్ని, యిందులోని జల తరు పాషాణ నిధి నిక్షేప దానాదమన వినిమయ విక్రయాద్యనుభవములను గురించిన్ని, మునిసిపల్ పన్ను వగైరాలు చెల్లించుకోవడమును గురించిన్ని యింతటనుంచి నీపుత్రపౌత్రపారంపర్యంతం దానవిక్రయం కలిగి స్వేచ్ఛగా అనుభవించ వలసినదేకాని యింతటనుంచి మాకు మావార్సులకు ఎన్నటికి ఏవిధమైన హక్కున్నులేదు. ఇది మాసమ్మతిని ఓరుగంటి కేశవయ్యదస్తూరిని వ్రాయించి యిచ్చిన స్థిరాస్తి స్వాధీనపర్చిన విక్రయపత్రం.

19. పంక్తిలో హంసపాది ఉన్నది.

## షెడ్యూలు.

వంగోలు సబ్ రిజస్ట్రరులోని వంగోలు బ్రాహ్మణవీధిలో పైప్రకారము మాకు హక్కుగల మునిసిపల్ డోరునెం 64 రుగల యిల్లు స్థలములకు హద్దులు తూర్పు సందువీధిన్ని, దక్షిణం ఒరుగంటి శ్రీరామశాస్త్రిగారి స్థలమున్ను, పడమర దావులూరు హనుమంతరావు వగైరాలస్థలమున్ను, ఉత్తరం బాపి వెంబడి వీధిన్ని యీహద్దులలోని పెంకుటిల్లు పంచసహా పెద్దగదులు 4న్ను, ఇంటి పంచయొక్క అడుగుస్థలము పైకప్పు సామానున్ను, ఈయింటికి తల వాకిలి పెట్టియున్న ద్వార బంధములు సహా తలుపులు రెండున్ను, యీహద్దులలోని ఖాళీస్థలముగదులు సుమారు 26 న్ను, యిందులోని హెచ్చు పెచ్చు

లున్ను, యీస్థలమునకు నాలుగుప్రక్కల ఉండే రాతిగోడలున్ను, గోడల అడుగు స్థలమున్ను, ఈగోడలమీద మూరువేసుకొనే హక్కున్ను, ఖాళీస్థలములో ఉన్న వేపచెట్లు 7 న్ను, రేగుచెట్టు ఒకటిన్ని, జామచెట్టు ఒకటిన్ని, దానిమ్మచెట్టు ఒకటిన్ని, మునగచెట్టు ఒకటిన్ని, యీయావదాస్తిన్ని.

ఇందుకు సాక్షులు. వేమూరు రామయ్యవ్రాలు.

పంతుల కృష్ణయ్యవ్రాలు<br>
కొప్పోలు కాశీపతివ్రాలు.<br>
తాతా పుల్లయ్యవ్రాలు.

వేమూరు సుందరయ్యవ్రాలు.

## (2) రూ 600 లకు వ్రాయించియిచ్చిన స్థిరాస్తి అస్వాధీన తనఖా దస్తావేజు.

ది 9-1-1903 సం॥ రం తారీఖున నెల్లూరు డిస్ట్రిక్టు వంగోలు సబ్ రిజిష్ట్రారు ఇలాకావంగోలు కాపురస్తులు బ్రాహ్మణులు యినాం వగైరా వృత్తివంతులు ఓరుగంటి సాంబయ్యశాస్త్రులుగారి కుమారుడు రామలింగ శాస్త్రులకు.

కయికరము కాపురస్తులు ఓరుగంటి శీతారామశాస్త్రులు వ్రాయించి యిచ్చినది.

**2.** ఈక్రింద నుదహరింపబడిన, మూడవకలం దాఖలా స్థిరాస్తిని నీకు తాకట్టు ఉంచి నీవల్ల యీతారీకున నేను క్రయమును పొందిన స్థిరాస్తి క్రయ మొత్తము ఆరువందల రూపాయీలు నీకు బాకీ ఉంటిని గనుక సదరు రూపాయలకు ఈతారీఖు లగాయతు సొమ్ము ముట్టేవరకు నెల 1-కి నూటికి 1 రూ (ఒకరూపాయి) వడ్డీతో ఇవ్వ నేర్పర్చుకొనిన వాయిదాల వయినం:—శుభకృతుసంవత్సరమాఘబ 30 లునాటికి రూ 150-0-0 నూటయాభయి రూపాయలున్ను ఇందుకైనవడ్డిన్ని, శోభకృతుసంవత్సర ఫాల్గుణశుద్ధ౧౫ నాటికి రూ 112-8-0 లున్ను ఇందుకయినవడ్డిన్ని, క్రోధి సం॥ రం ఫాల్గుణ శు ౧౫ నాటికి రూ 112-8-0 లున్ను ఇందుకయిన వడ్డిన్ని,

విశ్వావసు సం॥ రం॥ ఫాల్గుణ శు ౧౫ నాటికి రూ 112-8-0 లున్న ఇందు కయిన వడ్డిన్ని; పరాభవసం॥ రం ఫాల్గుణ శు ౧౫ నాటికి రూ 112-8-0లున్న ఇందుకయిన వడ్డిన్ని, సదరు వాయిదాల ప్రకారము యిస్తూఉండగలవాడను. సదరు వాయిదాల ప్రకారము పయికము ఇవ్వక తప్పినయెడల వాయిదా గుజస్తు తారీఖులగాయతు నెల 1-కి నూటికి రూ 1-8-0 ల చొప్పున వడ్డితో యివ్వగలవాడను.

## షెడ్యూల్.

3. ఇందుక్రింద తనఖా కృష్ణాడిస్ట్రిక్టు కయికరము సబ్ రిజిస్ట్రరువారి యిలాకాకయికరము గ్రామములో నా హక్కుభుక్తములుగల వారతునకు అనే మామూలు పల్లం యినాం డిమార్కేషన్ నెం 25 రు య 4-59 సెంటున్ను, సదరు గ్రామములో నీవల్ల యీతారీఖున క్రయమును పొంది నాస్వాధీనమై యున్న కయికరమునేరే పల్లం 343 ఖండంబాపతుడిమార్కేషన్ నెం 96, 116, 117, 114 ర్ల తాలూకు మొత్తము, య 18-16½ సెంట్లున్ను, తాకట్టు ఉంచి సదరుఆస్తి, నాస్వాధీనములోనే ఉంచుకొనడమైనది. ఇదివరకు ఈ భూములు ఎవరికి ఏవిధముగాను అన్యాక్రాంతములు చేసియుండలేదు. మీ బాకీతీరుమానం అయ్యేవరకు ఎవరికి ఏవిధముగాను అన్యాక్రాంతములు చేయ గలవాడనుకాను. ఈబాకీ యీదస్తావేజు దాఖలా ఆస్తివల్లను, ఇంకా నా తాలూకు ఇతర ఆస్తివల్లను తీర్మానించగల వాడను. ఇందుక్రింద ఇచ్చేవసూళ్లు ఈపత్రంస్పెట్ని చెల్లువ్రాయించడముతప్ప'మరి యేవిధముగాను ఇచ్చినామనిముజ రాకోరగల వాడనుకాను. ఇది సమ్మతిని వ్రాయించి యిచ్చిన స్థిరాస్తి అస్వా ధీనతనఖా దస్తావేజు.

ఇందుకు సాక్షులు.

మల్లాది వెంకటరావువ్రాలు.
నేతి గంగయ్యవ్రాలు.
ఏలూరుశ్యామలరాజువ్రాలు.

ఓరుగంటి శీతారామ శాస్త్రులువ్రాలు.

ఇందుల దస్తూరి ఓరుగంటి వెంకటరమణశాస్త్రు్గ.

## (3)

## స్థిరాస్తిస్వాధీన తనఖా దస్తావేజు.

1895 సం॥ రం ది 27 శెప్టెంబరుకు సరిఅయిన మన్మథనామ సం॥ ఆశ్వీజ శు 8 శుక్రవారము రోజున కృష్ణాడిస్ట్రిక్టు గుడివాడ సబ్ రిజస్ట్రారుయిలాకా కయికలూరుకాపురస్తులు, బ్రాహ్మణులు, స్మార్తులు సర్కారు ఉద్యోగము వ్యవసాయమువగయిరావృత్తివంతులు అయిన కొంపల్లి బుచ్చయ్యగారి కుమారుడు రామరావుగారికి, డిటో డిస్ట్రిక్టు గుడివాడ సబురిజస్ట్రారుయిలాకా కయికలూరుకాపురస్తులు బ్రాహ్మణులు, స్మార్తులు అగ్రహారంయినాములు వగయిరాలవల్ల జీవించే ఒద్దుగంటిరామలింగశాస్త్రులగారి కుమారుడు సాంబయ్యశాస్త్రులు, ఈయన అవిభక్త కుమారుడు రామలింగశాస్త్రి హాలు మకాం నెల్లూరుజిల్లావంగోలు, ఇరువురము వ్రాయించియిచ్చిన స్థిరాస్తిస్వాధీన తనఖాపత్రము.

1892సం॥ రం ది 5 జులయి తేదీని తమ భార్యగారైన సీతాబాయమ్మగారిపేర మేము వ్రాసియిచ్చినటువంటిన్ని 1892 సం॥ ది 3 శెప్టెంబరు తేదీని గుడివాడ సబ్ రిజస్ట్రారుగారి ఆఫీసులో రిజస్టరు అయినంటువంటిన్ని పత్రం తాలూకు ఈరోజువరకు మీమారుజువున లెక్కచూచుకోగా తేలిన బాకీమొత్తము అసల్ రూ 1000న్ను, యీరోజు వరకున్ను అయిన వడ్డి రూ 242-8-0, యీ తేది మొదలుకొని మన్మథనామసంవత్సర ఫాల్గుణబ 30ల వరకు అయ్యేరాగలవడ్డి రూ 135-0-0 లు చెరసి అసల్ ఫాయిదాలమొత్తము రూ 1278-2-0 ల మింజుమలెవడ్డిక్రింద ఈ తేదీని వసూలు ఇచ్చినది రూ 278-2-0 గాక తతిమ్మాఅసల్ రూ 1000 రూపాయీలు మీకు బాకీ ఉంటిమి గనుక ఈ బాకీమొత్తమునకు దుర్ముఖిసం॥ చైత్రశు॥ ౧ లు లగాయతు నెల 1-కి నూటికి రూ 0-10-0 పది అణాల చొప్పున వడ్డి అసల్ ఫాయిదాలు ఇవ్వ నేర్పాటు చేసికొని గుడివాడ సబ్ రిజస్టర్ యిలాకా కయికలూరు గ్రామములో ఉన్న టువంటిన్ని, మాపూర్వార్జిత మైనటువంటిన్ని, వంశపరంపరగా మాకు హక్కు-

7.81 సెంట్ల భూమి క్షేత్రములో ఉన్నటువంటిన్ని మామూలుపల్లం యీనాంభూమి 12-25 సెంట్లున్ను, కయికలూరు గ్రామములో సాంబయ్యశాస్త్రుల స్వార్జిత మయినంటువటిన్ని, మేముకాపురం చేస్తూఉన్నటువంటిన్ని రాజవీధికి ఉత్తరముగాఉండే నివేశనస్థలము అందులో ఉండే పూరియిల్లున్ను ఇందుతో జత పరిచిన షెడ్యూలు దాఖలాప్రకారము ఈపత్రము అసల్ ఫాయిదాల మొత్తము తీరుమానము అయ్యేవరకు ఇందుక్రింద తనఖాఉంచిన సదరు తనఖాఆస్తి మీస్వాధీన పరచడమైనది. కయికలూరు తాలూకు సదరు ఈనాంభూమి దుర్ముఖినామ సం. రం మొదలుకొని 1315 ఫసలీ విశ్వావసు సం. రం ఆఖరు వరకు సదరు మొత్తము రూపాయీల వడ్డీక్రింద మీయిష్టప్రకారము అనుభవం చెసికొనిగాని మీస్వంత కమతమున సాగుబడిచేయించిగాని అందలఫలము మీరుఅనుభవిస్తూ ఉండగలందులకున్ను, ఈ పది సంవత్సరాల వాయిదా అనంతరము వడ్డితో నిమిత్తము లేకుండా అసల్ బాకీరూ 1000 వెయ్యిరూపాయీలు సంవత్సరం ప్రారంభమైన ఒకటి రెండు నెలలో మీకు ఇచ్చినయెడల సదరహీ నాతాలూకు మీస్వాధీనములో ఉన్న కయికలూరు ఈనాం య 12-25 భూమిన్నీ, నివేశనస్థలం యిల్లున్ను మాస్వాధీన పర్చవలసినది. సదరు పది సం॥ రాల వాయిదాఅనంతరము అసల్ మొత్తము రూ1000 రూపాయలు మేము ఇవ్వనియెడల సైపరతు ప్రకారము వడ్డీక్రింద పదకొండవ సం॥ రం మొదలుకొని సదరు భూమి ఫలం మీరు మావల్ల బాకీ రాబట్టుకొనేవరకు మీరు అనుభవిస్తూ ఉండగలందుకులన్ను, సదరు తనఖా ఆస్తివల్లనున్ను ఇంకా మాకు ఉండే యితరస్థిరచరాస్తివల్లనున్ను అసల్ సొమ్ము మీరు రాబట్టు కొనుటకున్ను ఒప్పుకో వడమైనది. సదరహీ భూమికి సర్కారుకు చెల్లించవలసిన క్విట్ రెంటువగైరా అన్ని బాపతులకిస్తు మాకు నిమిత్తములేకుండా కిస్తిబంది ప్రకారము మీరే మాపట్టాక్రింద సర్కారుకు చెల్లించి రసీదులు తీసికొని వాటిని మాకు ఇస్తూఉండగలందులకున్ను నిర్ణయించుకోవడమైనది. ఇందుక్రింద యిచ్చేవసూలు ఈపత్రముపీటిని చెల్లువ్రాయించి యీపత్రం గద్దుపరిపించి మీవల్ల

మేము తీసుకోగలవారము. ఈమన్మథనామ సంవత్సరములోవచ్చిన ములక మోస్తరుగా దేశోపద్రవమైనములక వచ్చి రాముడు కరలో సర్కారుఇనాం భూములు యావత్తుతోపాటు ఈభూమున్ను పూరానష్టమయిన యెడల అటువంటి పూరాములక సంవత్సరాల వడ్డీ సాలు 1-కి రూ 75 ల చొప్పున అయ్యే మొత్తమున్ను, అసలు 1000 వెయ్యిరూపాయలున్ను సైవాయిదా అనంతరము ఏకకాలములో ఇచ్చి మాభూములు వగైరాలు మాస్వాధీన పరచుకోవడమునకున్ను, రాముడు కరగల్లు రయితులు స్వంతమరమ్మతులు చేయించుకోవడము తటస్థమయినయెడల రాముడుకరలో ఉండేయావత్తు భూముల కామాషాయీప్రకారము మాభూమికి అయ్యే మరమ్మతు ఖర్చు మీరు ఇచ్చి అందుకుగాను మీరు కనబరిచిన జాబితా ప్రకారము లెక్కైన అంకెకు ఆసామీలతోపాటు ఆసొమ్ము మేము మీకు ముజరా యివ్వవలెనన్ను, నదరు భూములక్వాట్ రెంటు వగైరా అన్ని బాపతులకిస్తు మాకు నిమిత్తములేకుండా మీరే మాపట్టాక్రిందసర్కారుకు చెల్లించి రసీదు తీసికొని మాకు ఇవ్వవలసినకున్ను షరతులు యేర్పరచుకొని యీవస్తావేజు మీకు వ్రాసియివ్వడమైనది. ఈతనఖాఆస్తిని యిదివరకు ఎవరికి క్రయం వగైరాలు చేసియుండలేదు. ఈ బాకీ తీరుమానము అయ్యేవరకు క్రయంవగైరాలు చేయుగలవారము కాము. ఇది సమ్మతిని వ్రాయించియిచ్చిన స్థిరాస్తిస్వాధీన తనఖాపత్రము.

ఓరుగంటి సాంబయ్యశాస్త్రిచ్రాలు.

ఇందుకు సాక్షులు. ఒరుగంటి రామలింగశాస్త్రి తరఫు

రావూరిశోభనాద్రివ్రాలు } ముక్త్యార్ నామాదారు
వేంపాటికృష్ణయ్యవ్రాలు. } ఓరుగంటి సాంబయశాస్త్రివ్రాలు

దస్తూరి ఓరుగంటి సాంబయ్యశాస్త్రులస్వహస్తం.

(4)

(పవర్ ఆఫ్ అట్టర్నీ జనరల్) లేక ముక్త్యార్ నామా అనబడు అధికార పత్రిక.

1895 సం॥ సెప్టంబరు తే 13 దీని కృష్ణాడిస్ట్రిక్టు గుడివాడ సబ్ రిజిస్టర్ యిలాకా కయికలూరు కాపురస్థులు బ్రాహ్మణులు భూస్థితివల్ల జీవించే ఓరుగంటి రామలింగశాస్త్రులుగారి కుమారుడు సాంబయ్యశాస్త్రులగారికి సదరు కయికలూరు కాపురము ప్రస్తుతం వంగోలుసబ్ రిజస్టరు ఇలాకా వంగోలు హాల్ మకాం బ్రాహ్మణుడు భూస్థితివల్ల జీవించు ఓరుగంటిసాంబయ్యశాస్త్రుల అవిభక్త జ్యేష్ఠకుమారుడు రామలింగశాస్త్రులు వ్రాయించియిచ్చిన పవర్ ఆఫ్ అట్టర్నీ అనే అధికారపత్రిక:—

ప్రస్తుతము వంగోలులో ఉద్యోగములో నున్నందున అక్కడికి వచ్చి కుటుంబకార్యములు విచారించుటకు వీలు లేక మనకు ఈరోజువరకు నుండే ఋణములు తీర్మానించు నిమిత్తమున్ను, ఇంకా స్వంతపనుల నిమిత్తమున్ను మనకు గుడివాడ సబ్ రిజస్ట్రార్ యిలాకా కయికలూరు వేవాక, కొల్లేరు గ్రామాదులలో నుండే ఈనాములున్ను, ప్రొద్దువాక అగ్రహారంభూములున్ను స్వాధీనతనఖాగాని, అస్వాధీనతనఖాగాని, మక్తాపీసబడి పాలువగైరాకాళ్లు ఇచ్చి గాని, మిక్కిలి అవసరమైనపుడు తగినంతమట్టుకు భూమి విక్రయముచేసిగాని ఇంకా ఇతరపనులు ఏవైనా చేసిగాని బాకీలు తీరుమానము చేయుటకున్ను, అట్టిదస్తావేజులు, క్రయశాసనములు, కవులు, రశీదులువగైరాలమీదను నాకుగాను నాతరపున మీరు దస్కతుచేసి రిజస్టరు వగైరాలు చేయించుటకున్ను, మనకుటుంబమునకు గల యావత్తు స్థిర చర హక్కులను గురించి యేవాదములు వచ్చినను, సర్కారు సంబంధమైన సివిల్, మేజస్ట్రీటు, రివిన్యూ వగైరా యావత్తు ఆఫీసులలో మీరు నాతరపున దస్కతులుచేసి అవసరమైన కాగితములు దాఖలుచేసి జవాబు చెప్పగలందులకున్ను, మనకు వసూలు కావలసిన సైకములు తమరు దావాలువగైరాచేసి రాబట్టగలందులకున్ను.

మనకు ఉండే సొత్తులను భాగస్తులతో విభాగముచేసికోవలసిన అవసరము కలిగినయెడల నాతరఫున యావత్తుకార్యములు జరిగించగలందులకున్ను ఇందువల్ల తమకు అధికారము ఇచ్చుకొంటిని గనుక మీరు ఏమివ్రాసియిచ్చి ఏమిజవాబుసవాలుచేసినను నేను ఖుద్దునఉండి జరిగించినట్లు సమ్మతింతును. ఇది నాసమ్మతిని వ్రాసి ఇచ్చిన జనరల్ పవర్ అఫ్ అట్టర్నీ.

ఇందుకు సాక్షులు. ఓరుగంటి రామలింగశాస్త్రి వ్రాలు.

ఓరుగంటి కృష్ణయ్య వ్రాలు.
గోటేటి సుబ్బరావు వ్రాలు.

## కవులు కబోలియతు.

ఒక భూమిని అమరకము లేక సేద్యము చేయునట్టిరైతు భూస్వామునకు వ్రాసియిచ్చునట్టి దాస్తావేజునకు కబోలియతు అని పేరు. దీనికే ఖత్తు అనియు ఖరార్‌నామా అనియు ముచ్చిలుకాఅనియు పేళ్ళు గలవు. భూస్వాములు రైతులకు వ్రాసియిచ్చు దస్తావేజునకు కౌలుఅనిపేరు. కౌలుఖత్తులలోని విషయములన్నియు ఒకటిగానె ఉండును. నీ, నా, అనెడు సర్వనామపదములును, వానితో అన్వయించు క్రియలును వీనిని మాత్రము సందర్భానుసారముగా మార్చుకొనవలయును. వీనిని రిజిస్టర్ చేయుటనుగూర్చి ముందేచెప్పబడెను. రిజిస్టరుకాబడిన కబోలియతు ఒకటియు రిజిస్టరుకాని కబోలియతు ఒకటియు ఈదిగువ ఉదాహరణములుగా వ్రాయబడినవి.

### (5) ఫేసాలా వీసబడి ఖత్తు లేక కబోలియతు.

(ఫేసాలా=ఆఱుసంవత్సరములు.)

1896 సం॥ ది 11 అక్టోబరుకు సరియైన దుర్ముఖిసం॥ రం ఆశ్వీజ శు ౫ ఆదివారం తారీఖున కృష్ణాడిస్ట్రిక్టు గుడివాడసబ్‌రిజిస్ట్రారువారి ఇలాకా ప్రొద్దువాక అగ్రహారికులు ఏలూరు కాపురస్తులు బ్రాహ్మణులు అగ్రహారం వగైరా వృత్తివంతుడు లేట్ ఓరుగంటి రామలింగ శాస్త్రులుగార్కి కుమారుడు

సాంబయ్యశాస్త్రులగారికి టిటోడిటో రిజస్ట్రారువారి యిలాకా ప్రొద్దువాక అగ్రహారం కాపురస్తుడు శూద్రకులస్తుడు వ్యవసాయముచలన జీవనముచేసే శేటు సూదల సుబ్బరాయుని కుమారుడు ఆదికేశవులు వ్రాయించి యిచ్చిన ఫసాలా వీసబడిఖత్తు—

కృష్ణాడిస్ట్రిక్టు గుడివాడ సబ్ రిజస్ట్రారువారి యిలాకా ప్రొద్దువాక అగ్రహారములో మీకు భాగలబ్ధమై మీస్వాధీనానుభవములో ఉన్న ఈక్రింద ఉదహరించిన షెడ్యూలు దాఖలా మామూలుపల్లం భూమి య9-75సెంట్లకు సాలు 1 కి య 1 కి రూ 8-10-0 ల చొప్పననున్ను, మెరక గరువుభూమి య 2-13 సెంట్లకు సాలు 1 కి య 1 కి రూ 3-0-0 చొప్పననున్ను వీస బడిరేట్లు ఏర్పరచుకొని సదరహీ య 11-88 శెంట్లభూమి 1306 ఫసలీదుర్ముఖి సంవత్సరం మొదలుకొని 1311 ఫసలీ ప్లవ సంవత్సరం ఆఖరువరకు ఆరుసంవత్సరాలకు మీవల్ల నేను సాగుబడికి తీసికొంటిని కనుక సదరుభూములు వెంటతోలి బాగాఫలపర్చి కలుపుతీసి సదరు సంవత్సరములలో అంతాగాని కొంతగాని సాగుచేయక బంజరు ఉంచినప్పటికిన్ని, ఫలించినను ఫలింపకపోయినను అతివృష్టి అనావృష్టి మొదలయిన వానివల్ల సంభవించునట్టి లాభనష్టములకు నేనేబాధ్యుడనై ఏమియు రాయతీకోరక సాలు 1 కి సదరు మామూలుపల్లం భూమికి సదరు రేటుప్రకారము అయ్యేశిస్తు రూ 84-1-6లున్ను, మెరకభూమికి సదరు రేటుప్రకారము అయ్యేశిస్తు రూ 6-8-1లున్ను జుమలారూ90-9-7 తొంభైరూపాయలతొమ్మిదిఅణాలయేడుపైసలచొప్పన ఈసంవత్సరం మొదలుకొని ప్లవసం॥ రం వరకు ప్రతిసం॥ రం, మాఖబ 30 నాటికి తప్పక ఒకపర్యాయమే మీకు ఇచ్చి ఇందుపేటిని చెల్లువ్రాయించగలందులకున్ను, ఆలా వాయిదాప్రకారము ఇవ్వనియెడల వాయిదాగుజస్తు తేదీలగాయతు గుజస్తువాయిదా పైకమునకు సొమ్ము ముట్టేవరకు నెల 1 కి 100 కి రూ 2-1-4 చొప్పన వడ్డీతో అయ్యే అసలుపాయిదాలు మీకు ఇవ్వగలందులకున్ను, సదరు శిస్తు ఫీదాగా ఇవ్వనిది సదరు భూములలో ఫలించినఅయినజునా తసరబుచేసికోకుండా

యుండుటకున్ను, సదరహీంభూములకు సర్కారుకు చెల్లించవలసిన క్విట్ రెంటువగైరాలు మీరేయిచ్చుకొనుటకున్ను మగతు ఆఖరున అనగా 1311 ఫసలీప్లవసంవత్సరం ఆఖరున నోటీసుతో నిమిత్తము లేకుండా సదరుమీతాలూకు మామూలుపల్లం మెరకభూములు మీస్వాధీనపర్చుకొని మీయిష్టానుసారము అమరక పరచుకునేయెడల నేనుగాని, నావారసులుగాని యేవిధమైన అక్షయాంతరములును చేయకుండ ఉండగలందులకున్ను అట్లావచ్చేయెడల మీకుగలిగే యావత్తునష్టములు నేనుగాని, నావారసులుగాని మీకు ముజరా యిచ్చుటకున్ను, సదరహీం[ప్రొద్దువాక అగ్రహారములో మీభాగమునకు సర్కారుకు చెల్లవలసిన క్విట్ రెంటు వగైరాశిస్తుసదరు ఆరుసంవత్సరములకు ప్రతి సం॥రం కిస్తీబందీప్రకారము నేనేసర్కారుకుచెల్లించి రసీదులు తీసికొని ఆరసీదులు మీపరముగా ఇచ్చి ఆరసీదుల దాఖలాసొమ్ము మీవల్ల నేను ముజరా పుచ్చుకోగలందులకున్ను పరతులు ఏర్పరచుకొని ఈఖత్తు వ్రాయించి మీకు యిచ్చి మీవల్ల ఈతారీఖున నేను కవులుపొందడమైనది. ఇది సమ్మతిని వ్రాయించి యిచ్చిన చేసాలాపీసబడి ఖత్తు.

షె. డ్యూలు.

| మెరక, పల్లంవివరము. | | భూమి పరిమితి |
|---|---|---|
| | | య - సెం |
| 1. మామూలు పల్లము. | సె 63 న తా॥ పట్టుకోటి పంపు తూర్పు ఒ॥ శీతారామాశాస్త్రిల భాగం పొలము, దక్షిణంవెంపటి వారి యీనాం, పడమర ఓ॥ రమణయ్య వగైరాల భాగం పొలము, ఉత్తరం పట్టుకోటి కాల్వ, ఈ హద్దులమధ్య. | 3 - 1 |
| 2. డిటో | | 6—40 |
| 3. డిటో | | 0—34 |
| | ఫలములు 3. కి. వెరశీ పల్లం ... | 9—75 |

| | | |
|---|---|---|
| 4 మెరక సర్వే. | నె॥ రు॥తా॥ రేగు చెట్టు పంపు. తూర్పు ఒ॥ నాగలింగ శాస్త్రిల భాగం పొలం, దక్షిణం పడమగ మీ తాలూకు భాగం పొలం, ఉత్తరం ఓ. భగవానుల గారి భాగంపొలం, ఈ హద్దుల మధ్య. | 0—63 |
| 5. డిటో. | | 0—75 |
| 6. డిటో. | | 0—75 |
| | స్థలములు 3. కి. వెరశి మెరక. | 2—13 |
| | మెరక పల్లముల మొత్తము. | య. 11—88 |

ఇందుకు సాక్షులు.

శ్రవణం గామయ్య వ్రాలు. } సూదుల ఆదికేశవుల నిశాని.
ఓరుగంటి అప్పయ్య వ్రాలు. }

దస్తూరి గుడివాడ వెంకయ్యది.

# 6. దానపట్టా.

(1) తే 4 సెప్టెంబరు 1912 సం.

(2) రు 1000 లు కిమ్మతుచేయు ఆస్తికి దానపట్టా.

| | |
|---|---|
| (3) గోదావరి డి. పిఠాపురం సబు డి. గోరసకాపురస్థులు కాపులు వ్యవసాయదార్లు తలమంచిలి నాగియ్యభార్య బాలమ్మకు | గోదావరి డి. పిఠాపురం సబు డి. కొమరగిరి కాపురస్థులు కాపులు వ్యవసాయదార్లు కొమరపు సోమయ్య కుమార్డు వెంకట్రావు |

వ్రాయించియిచ్చినది.

(4) యీదిగువ షెడ్యూలు దాఖలాఆస్తి నీవు నాకు కుమార్తెవు అవుట వల్లనున్ను నీయందు నాకువుండే ప్రేమాతిశయమునుబట్టి నీకు పసుపు కుంకుమ కింద వుచితముగా యిచ్చివేయడమయినది. గనుక సదరుభూమి యీ తేదీలగాయతు నీయిష్టప్రకారం నీపుత్రపౌత్రపారంపర్యం దానవిక్రయ

స్వాతంత్ర్యములతో అనుభవించవలసినది. యీభూమి నీ పేర రెఖలలో సమో జు చేయించగలవాడను. యీభూమినిగురించి జ్ఞాతిసామంతాద్యవరోధములు యేమివచ్చినా నాస్వంతఖర్చులతో పరిహరించి యీభూమి నీకు నిర్వివాదగా జరుపుదును.

(5) షెడ్యూలు.

డిష్ట్రిక్టు గోదావరి సబు డి. పిఠాపురం గ్రామం కొమరగిరి. ఆస్తివివరం నివేశనంపాటి పెరడు. హద్దులు—తూర్పు. లాలుమహమ్మదుస్థలం x 10. పు. చుండీలాలు స్థలం x 83. ద. గాడెపాటి గోవిందయిల్లు x 20 ప. మాతాలూకు యిల్లు x 15

యిది సమ్మతిని వ్రాయించియిచ్చినదాన వ్రాలు.

కొమరవు వెంకట్రావు నిశాని.

యిందుకు సాక్షులు

దస్కతు.

# (7) క్రయదస్తావేజు

(1) తే 15 శెప్టెంబరు 1912 సం.

(2) రు 1000 లకు క్రియం

| | |
|---|---|
| (3) గోదావరి డి. పిఠాపురం సబు డి. పిఠాపురం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందార్లు చావలి గోపిరాజుగారికిన్ని నర్సయ్యగారికి. | గోదావరి డి. పిఠాపురం సబు డి. పిఠాపురం కాపురస్తులు కాపులు వ్యవసాయదార్లు ఆకుల సుందయ్యా కుమార్లు రాజయ్యా. |

వ్రాయించియిచ్చినది.

(4) యీ దిగువ షెడ్యూలు దాఖలా ఆస్తి మాకు వుండే కున్న రుణముల తీర్మానం నిమిత్తమున్ను నావివాహంనిమిత్తమున్ను రు 1000 పదివేలరూపాయిలకు మీకు క్రియముకు యిచ్చి క్రియధనంపుచ్చుకున్న వివరం.

రు 500_0_0 యిదివరలో తే 1 శెప్టెంబరు 1902 సం. తేదని మీకు నేను వ్రాయించియిచ్చిన అస్వాధీనతనఖాదస్తావేజు తా. అసలీపాయిదాలు చెల్లుబాకీ శిరాకు.

రు 500_0_0 యీరోజ్జున సబురిజస్ట్రారు వారియెదట రిజస్టరీకాలమందు నావివాహం ని॥ పుచ్చుకున్నవి.

1000_0_0 వెరశి పదివందలరూపాయలున్ను సదరునవ్రాశ్లి ప్ర॥ ముట్టినవి. గన్కు యింతటినుంచి యీక్రిందవ్రాశ్లి ఆస్తి నీపుత్రపౌత్రపారం పర్యాయం నానవిక్రయస్వాతంత్రియములతో సుఖాన అనుభవించవలయును. యిందును గురించి జ్ఞాతిసామంతాద్యవరోధములు యేమివచ్చినా మాస్వంత ఖర్చులతో పరిహరించి యీక్రియం సిరాటంకముగా మీకు జరుపగలవారము.

(5) షెడ్యూలు.

డిస్ట్రిక్టు గోదావరి సబుడిస్ట్రిక్టు పిఠాపురం గ్రామం పిఠాపురం ఆస్తివివరం లుల్లాపల్లి సర్వే నె. 82—1వె య10_0. యిది సమ్మతిని వ్రాయించి యిచ్చినక్రియ దస్తావేజు.

ఆకుల రాజయ్య నిశాని

సాక్షులు.

దస్తూరి.

# (8) వు యి లు.

## తే 20 అక్టోబరు 1912 సం.

గోదావరి డి. పిఠాపురం సబుడి. లో చేర్న వాకతిప్పకాపరస్తుడు పాలికులస్తుడు కులవృత్తివల్ల జీవించే చల్లా వెంకటస్వామికుమారుడు రామయ్య వ్రాయించిన వుయిలు.

నాకు సుమారు 2 సం. లునుంచి దేహంఖాయిలాగావుండి జీవించననే అపైర్యముతోచీ నాఆస్తినిగురించి యీద్దిగువ యేర్పాటులను చేయడమయిది

నాకు యిప్పటికి సుమారు 70 సం. రములు కావచ్చినవి. నాకు పుత్రపుత్రికా సంతానములేదు. ముందుకలుగుతుందనే ధైర్యమున్ను లేదుగనుక నామేన మామ వీరమల్లు నారన్న కుమార్డు నరసయ్యను నాభార్య కొటమ్మదత్తస్వీకారం చేసుకొని ఆపిల్లవానికి మైనార్టి తీరిలేవరకు నాభార్యాదె గార్డియనుగావుండి ఆపిల్లవాడికి విద్యాభివృద్ధులు చెప్పిస్తూ నాఆస్తినల్లవచ్చే ఆదాయమును దుర్వ్యయముకాకుండా జాగ్రతగా ఖర్చుపెట్టి సరియయిన జమాఖర్చులు వ్రాయించి దత్తునకు మయినార్టీ వదిలినతరువాత జమాఖర్చులతో ఆస్తి వప్ప గింతపెట్టవలెను. ఒకవేళ నాభార్యకు దత్తునకు సరిపడనియడల నామేనమామ వీరమల్లునారన్న సదరు నాయావదాస్తిన్ని స్వాధీనపర్చుకుని మయినరుతరఫున ఎగ్జిక్యూటరుగావుండి వ్యవహరిస్తూ మయినరు మయినార్టీ వెళ్లినవెంటనే అప్పటికి మిగిలివుండె యావదాస్తిన్ని జమాఖర్చులతో మయినరుకు వప్పగింప పెట్టవలెను. నాభార్యకు దాని యావజ్జీవం సాలు 1కి రు 100 లు యిస్తూ రు1000లు కిమ్మతు చెయు పాత్రసామాను యివ్వవలసినది. ఆమెకంటికి మీదవుండే జవాహీరి ఆమెయిష్టానుసారం చేసుకోవలసినది. ఆమె అనంతరమ్ము నిలచి యుండె యావదాస్తి దత్తునకు చెందవలసినది. నా ఆస్తినిగురించి యెవరున్ను యేవిధమయ్ని పేచీలుపెట్టవలసినది లేదు. పెట్టినను చెల్లకూడదు. యీపయ్ని వ్రాసిన సంగతులు మంచితెలివితోటిన్ని స్వహతోటిన్ని వ్రాయించడమయి నది. గనుక యీవీలు నాఅనంతరంనుంచి అములులోకి రావలెను.

చల్లా రామయ్యవిశాని.

సాక్షులు. దస్తూరి.

## (9) సెటిల్ మెంటు దస్తావేజు.

I. తే 10 జూలై 1912 సం.

II రు 400 లు కిమ్మతుచేయు ఆస్తిని యావజ్జీవం అనుభవించుటకు సెటిల్ మెంటు దస్తావేజు.

III గోదావరి డి. పిఠాపురం సబు డి. రమణక్కపేట కాపురస్థులు శ్రీ వైష్ణవులుయీనాందార్లు శ్రీమాన్ నల్లానిచక్రవర్తుల రామాచార్యులు గారిభార్య నరసమ్మకు. | గోదావరి డి. పిఠాపురం సబు డి. పిఠాపురం కాపురస్థుడు శ్రీవైష్ణవుడు యీనాందారు వేమూరి తాతాచార్యులుగారి కు. రంగస్వామి వ్రాయించియిచ్చినది.

IV నీవు నాకు మనమరాలవు అగుటవల్లనున్ను నీభర్త చిన్నతనములోనె చనిపోయివుండుటవల్లనున్ను నీకు అత్తవారివల్ల యేవిధమయిన్ని ద్రవ్యమున్ను రాకపోవుటచేతనున్ను నీవు నన్నే నమ్ముకొనియున్నందువల్లనున్ను నీయందు కరుణయుంచి యీక్రిందవ్రాశిన ఆస్తిని నీకు యావజ్జీవం అనుభవించగలందులకు యివ్వడమయినది గనుక సదరుభూమి నీవు చిరకాలపుకవుళ్లకుగాని స్వాధీనతనఖాలకుగాని యివ్వకుండా నీయావజ్జీవం అనుభవించవలసినది. సదరుభూమి నీఅనంతరం నాకుటుంబములోకి చేరవలసినది. నీవు యేమయినా తాకట్లు వగయిరాలు పెట్టినప్పటికి చెల్లకూడదు.

ఆస్తివివరం:—

డిస్ట్రిక్టు గోదావరి.
సబుడిస్ట్రిక్టు పిఠాపురం.
గ్రామం. రమణక్కపేట.

ఆస్తివివరం జిరాయితీ మెరక సర్వే నె 151 రు య 23-90 ట్లు గలది. యిది సమ్మతిని వ్రాయించియిచ్చినది.

వేమూరి రంగస్వామి వ్రాలు.

సాక్షులు. దస్తూరీ

## (10) కవులు.

I తే 4 అక్టోబరు 1912 సం.

II సాలు 1 కి రు 200 లు శిస్తుయిచ్చుటకు 3 స॥ రంలుకు కవులు.

III గోదావరి డి. పిఠాపురం సబు డి. మూలపేట కాపురస్థులు యీడిగ | గోదావరి డి. పిఠాపురం సబు డి మూలపేట కాపురస్థులు కోమట్లు

వాండ్లు వ్యవసాయదార్లు గుత్తుల నారయ్యకుమార్డు కోటయ్యకు. | వ్రాత్రకలు కొండా చంద్రయ్యగారి కుమార్డు రామన్న.

వ్రాయించియిచ్చిన కవులు.

IV యీదిగువ పెద్యాలుదాఖలా మూలపేటగ్రామంలో మాప్రొ వ్రైత్తుతంతాలూకుస్వాధీనంలో యున్న సర్వే నె 30 రు యక 3-90 ల్లుపల్లం యీనాంపాలుసాలు పరీధావి సం॥రం.ల 3 సం॥ లు సాలు 1 కి రు 200 లు చొ॥ శిస్తు యిచ్చుటకు నిర్నయించుకొని నీవు ముచ్చిలికా వ్రాయించి యిచ్చి యుండగా నేను అంగీకరించి యీపట్టా వ్రాయించియివ్వడమయినది గనుక యే సం॥రం శిస్తు ఆసంవత్సర మకరసంక్రమణంనాటికి మాకు యిచ్చి హావల్లు రసీదును పొందవలెను. అతివృష్టి అనావృష్టివాదులు మాకు నిమిత్తం లేదు. యీభూమిలో యేవిధమయినవృక్షములున్నా మానెలవులేనిది నరక కూడదు. యీభూమికి చెల్లవలసినపన్నులు యావత్తు మేమే చెల్లింతుము. మరితులోగా యేసం॥ తాలు శిస్తు వాయిదానాటికి యివ్వకపోయినా సదరుశిస్తు తేదీలు నె 1 కి నూట్కి రు 2 లు చొ॥ వడ్డితో యివ్వడమెగాక భూమి మేము యితరులకు అమరకపచ్చేయెడల నీవు యేవిధమయిన అభ్యంతరము చెప్పగూడదు. మరతు ఆఖరున మాభూమి నీవిడుదలతోటిన్ని మా నోటీసుతోటిన్ని నిమిత్తంలేకుండా వచ్చేకొత్తరయితునసాగుబడితరుణంలో ఆకుమడికిభూమి విడిచిపెట్టవలెను. యీ భూమిలో గోడలుపెట్టడం ఇల్లుకట్టడం మొదలయిన శాశ్వతమయిన పనులు జరిగించకూడదు. మాభూమిలో కనిపెట్టబడే తరు, జల, నిధి పాషాణాదుల హక్కు మాదే అయినందున నీకు యేవిధమయినహక్కును లేదు.

V డిస్ట్రిక్టు గోదావరి
సబు డి. పిఠాపురం
పెద్యాలు. గ్రామం. మూలపేట

ఆ స్తివివరం యీనాంపల్లం సర్వేనెం 30ను యక3_90ట్లు. ఇని సమ్మతిని వ్రాయించియిచ్చిన కవులు.

సాక్షులు. కొండా రామన్న నిశానీ.

దస్తూరీ

## (11) అస్వాధీనపు తనఖాపత్రం.

I తే 8 అక్టోబరు 1912 సం.

II రు 100 లకు అస్వాధీనతనఖాపత్రం.

III గోదావరి డి. పిఠాపురం సబు డి. పిఠాపురం కాపురస్తులు బ్రాహ్మణులు యీనాందార్లు జమంతి రామలింగయ్యగారికుమాళ్లు నారాయణరావుగార్కి గోదావరి డి. పిఠాపురం సబు డి. పిఠాపురం కాపురస్తులు కాపులు యీనాందార్లు కొమ్మన రంగయ్యకుమాళ్లు రామయ్య వ్రాయించి యిచ్చినది.

IV యీరోజున నా అవసరం నిమిత్తం అనగా నాకుమారుని వివాహం నిమిత్తం మీవద్ద మహారాజశ్రీ పిఠాపురం సబురిజస్ట్రారువారి యెదుట బదులుపుచ్చుకున్నది రు 100_0_0 నూరురూపాయిలు యిందుకు వడ్డి నెల 1కి నూటికి రు 1_8_0 చొ॥ సొమ్ముముట్టేవరకు యిస్తూ అసలీపాయిదాలు తీర్చుటకు నిర్ణయించుకున్న వాయిదాలవైనం.

రు 50_0_0 పరీధావి సం॥ మాఘ బ॥ 30లుకు అసలున్ను మొత్తమునకయ్యే వడ్డిన్ని

రు 50_0_0 ప్రమాదీచ సం॥ మాఘ బ॥ 30లుకు డిటో డిటో

రు 100_0_0 వెరశి నూరురూపాయిలున్ను తీరుమానించి పత్రంపయ్యే చెల్లువ్రాయించి పత్రం పుచ్చుకుందును. వాయిదానాటికి సొమ్ముయివ్వని యెడల గుజస్తు తేదిలగాయతు గుజస్తుమొత్తముకు పైరేటుప్రకారం వడ్డితో యివ్వ నిర్ణయం. దస్తావేజుమీద చెల్లువ్రాయని సొలుకు నిదర్శనములు మంజూరు శాయవలసిన నిమిత్తం లేదు. పయిన వ్రాసిన అసలీపాయిదాలుకు

యీదిగువ వ్రాసిన ఆస్తి హమీరియిచ్చి మాస్వాధీనంలోనె వుంచుకోవడ మయినది. సదరు ఆస్తికి యేమిభంగము కలిగినను మాస్వంత యితరాస్తులతో నున్ను మాజవాబుదారీతోనున్ను తీర్మానింతుము. యీఆస్తి యిదివరలో యెవరికి తనఖాలువగయిరాలు యిచ్చియుండలేదని మిమ్ములను నమ్మించి మీకు ప్రధమతనఖా యివ్వడమయినది. అలాటిని వున్నట్టు మీనోటీసులోకి వచ్చే యెడల మీరు జరిపె క్రిమినలువగయిరా చర్యలకు బద్ధులవుగుదుము. మా బాకీ తీరనిది యితరులకు తనఖాలు వగయిరాలు పెట్టగలవారము కాము.

షెడ్యూలు. డిస్ట్రిక్టు గోదావరి. గ్రామం. పిఠాపురం

- సబు డి. పిఠాపురం ఆస్తివివరం. యీనాంపల్లం

స్వాసె 101 యఁ 8-97 ట్లు.

యిది సమ్మతిని వ్రాయించియిచ్చిన అస్వాధీనతనఖాపత్రం.

కొమ్మనరామయ్య నిశానీ

సాక్షులు.

దస్తూరి.

## (12) పారీఖత్తు

## I రు 3000 లు కిమ్మతుచేయు ఆస్తికి పారీఖత్తు.

## II తే 20 అక్టోబరు 1912.

III గోదావరి డి. పిఠాపురం. సబు డి. గొల్లప్రోలు కాపురస్తులు కాపులు వ్యవసాయదార్లు యీనాలు వెంకయ్యకుమాళ్లు రామయ్య 2 లక్ష్మయ్య 3 పుల్లయ్య ఏకీభవించి వ్రాసుకున్న పారీఖత్తు.

IV మనము చాలాకాలమునుంచి అవిభక్తసోదరులుగా వుండి వున్నాము. యిప్పుడు కొన్నికారణములచేత మనలో మనకు పడక మన పిత్రార్జితం తాలూకున్ను మన స్వార్జితం తాలూకున్న ఆస్తి యీదిగువ వ్రాసినది 3 వాటాలుగా చేసుకొని పంచుకున్న పద్ధతుల వివరం:—

రు 2000-0-0 కిమ్మతుచేయు పిత్రార్జితపు ఆస్తిన్ని; రూ. 1000-0-0 మన ముగ్గురుభార్యలకు వుండుకున్న జవాహీరిన్ని.

రు 3000_0_0 వెరశి. మూడువేలరూపాయలు కిమ్మతుచేయుఆ స్తిలో రు 1000_0_0 కిమ్మతుచేయు గొల్లప్రోలు గ్రామంలోని నివేశనం తాటిఆకుు యిల్లు రామయ్య పుచ్చుకొనుటకున్ను, రు 1000_0_0 కిమ్మతుచేయు సదరు గ్రామంలోని జిరాయితీభూమి లక్ష్మయ్య పుచ్చుకొనుటకున్ను, రు 1000 లు కిమ్మతుచేయుఆస్తి అనగా జవాహిరి పుల్లయ్య పుచ్చుకొనుటకున్ను నిర్ణయించుకోవడ మయినది గనుక యికముందు యెవరి ధనరుణములు వారు వహించుకొని ఒకరితో ఒకరికి నిమిత్తం లేకుండా యెవరిపుత్రపౌత్రపారంపరియాయం వారు అనుభవించుకొనుటకు నిర్ణయించుకొని వ్రాసుకోవడ మయినది.

V రామయ్యకు వచ్చిన ఆస్తివివరం.

గోదావరి డి. పిఠాపురం సబు డి. గొల్లప్రోలు గ్రామంలోని నివేశనం తాటియాకులయింటికి-తూ. రాయవరపు రామయ్యయిల్లు; ద. తురకలస్థలం ప. జమీందారువారిలోగిలి; వు. గల్లీ యీమధ్యచ. గ. 500 లు స్థలం యిల్లు

లక్ష్మయ్య వంతువచ్చిన ఆస్తివివరం.

గోదావరి డి. పిఠాపురం సబు డి. గొల్లప్రోలు గ్రామంలోని జిరాయితీ పల్లం సర్వేనె 57 రు య 3_91 ట్లు.

పుల్లయ్యకు వచ్చిన జవాహిరివివరం.

500 రూ॥ కిమ్మతుచేయు 25 తులముల 2 కంటెలు.

500 రూ॥ కిమ్మతుచేయు 25 తులముల 2 కాసులపేర్లు.

1000 రూ॥ వెరశి.

పయిన వ్రాసిన పద్ధతులకు ముందు ఒకరిని ఒకరు యెందునుగురించిన్ని తకరారు శాయకూడదు. యిది సమ్మతిని వ్రాసుకొన్న పారీఖత్తు.

సాక్షులు. యానాలు రామయ్యనిశానీ

యానాలు లక్ష్మయ్యనిశానీ

యానాలు పుల్లయ్యనిశానీ

దస్తూరీ.